# ధర్మచక్రము




## సాధారణ మనిషి యొక్క ధర్మచక్రము

రచయిత: త్రిమత ఏకైక గురువు
ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త
ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

**శ్రీ శ్రీ శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**

www.thraithashakam.org





# ధర్మచక్రము

రచయిత

**త్రిమత ఏకైక గురువు**

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, (85) దశ అష్టాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

## శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు





ప్రచురించిన వారు

**ఇందూ జ్ఞానవేదిక**

(Estd. in 1978 - Regd.No.: 168/2004)

త్రైత శకము–38 ప్రథమ ముద్రణ : జనవరి–2017

ప్రతులు : 1000 **వెల : 120 /-**

## "ఇందూ జ్ఞానవేదిక" ప్రచురణలు

01) త్రైత సిద్ధాంత భగవద్గీత.
02) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
03) ధర్మము-అధర్మము.
04) ఇందుత్వమును కాపాడుదాం.
05) యజ్ఞములు (నిజమా-అబద్ధమా?).
06) దయ్యాల-భూతాల యదార్థసంఘటనలు.
07) సత్యాన్వేషి కథ.
08) మంత్రము-మహిమ (నిజమా-అబద్ధమా?).
09) శ్రీకృష్ణుడు దేవుడా! భగవంతుడా!!
10) గీతా పరిచయము
11) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
12) జనన మరణ సిద్ధాంతము.
13) మరణ రహస్యము.
14) పునర్జన్మ రహస్యము.
15) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా).
16) కథల జ్ఞానము.
17) సామెతల జ్ఞానము.
18) పొడుపు కథల జ్ఞానము.
19) తత్త్వముల జ్ఞానము.
20) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
21) గీతం-గీత (పాటల జ్ఞానము).
22) తత్త్వార్థ బొమ్మల జ్ఞానము.
23) దేవాలయ రహస్యములు
24) ఇందూ సాంప్రదాయములు.
25) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?).
26) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?).
27) తల్లి తండ్రి.
28) గురు ప్రార్థనామంజరి.
29) త్రైతారాధన.
30) సమాధి.
31) ప్రబోధ
32) సుబోధ.
33) ప్రసిద్ధి బోధ.
34) సుప్రసిద్ధి బోధ.
35) సిలువ దేవుడా?
36) దేవుని గుర్తు-963.
37) మతము-పథము.
38) ఇందువు క్రైస్తవుడా?
39) ఆత్మలింగార్థము.
40) నాస్తికులు-ఆస్తికులు.
41) గుత్తా.
42) ప్రబోధ తరంగాలు.
43) త్రైత సిద్ధాంతము.
44) రూపము మారిన గీత.
45) ద్రావిడ బ్రాహ్మణ.
46) తీర్పు.
47) కర్మ పత్రము.
48) ప్రవక్తలు ఎవరు?
49) ధర్మశాస్త్రము ఏది?
50) వార్తకుడు-వర్తకుడు.
51) దేవుని చిహ్నము.
52) ఏది నిజమైన జ్ఞానము?
53) నిగూఢ తత్త్వార్థ బోధిని.
54) ప్రబోధానందం నాటికలు.
55) మత మార్పిడి దైవద్రోహము.
56) మతాతీత దేవుని మార్గము.
57) హేతువాదము-ప్రతివాదము.
58) నీకు నా లేఖ.
59) జీహాద్ అంటే యుద్ధమా?
60) త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక ఘంటు.
61) దేవుని జ్ఞానము కబ్జా అయ్యింది.
62) ఒక్కడే ఇద్దరు.

## "ఇందూ జ్ఞానవేదిక" ప్రచురణలు

63) అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు.
64) మరణము తర్వాత జీవితము.
65) ఏ మతములో ఎంత మతద్వేషము?
66) హిందూ మతములో సిద్ధాంతకర్తలు.
67) మూడు గ్రంథములు, ఇద్దరు గురువులు.
68) ప్రతిమ × విగ్రహ-దైవము × దెయ్యము.
69) స్వర్గము ఇంద్రలోకమా!-నరకము యమరాజ్యమా!!
70) ఒక మాట మూడు గ్రంథములు.
71) లు అంటే ఏమిటి? (తెలుగు)
72) ఆదిత్య.
73) చెట్టుముందా! విత్తుముందా?
74) ఏసు చనిపోయాడా? చంపబడ్డాడా?
75) దేవుని రాకకు ఇది సమయము కాదా!
76) సాయిబాబా దేవుడా! కాదా?
77) విశ్వ విద్యాలయము
78) కృష్ణ మూస (శ్రీకృష్ణ మరణము తర్వాత జీవితము)
79) గీటురాయి
80) మూడు దైవ గ్రంథములు-మూడు ప్రథమ వాక్యములు
81) హేతువాద ప్రశ్నలు-సత్యవాద జవాబులు
82) భావము-భాష
83) దైవగ్రంథములో సత్యాసత్య విచక్షణ
84) నాది లోచన-నీది ఆలోచన
85) దేవుని ముద్ర
86) ధర్మచక్రము
87) హిందూమతములోనే కులవివక్ష
88) యోహాను చెప్పిన జ్ఞానము
89) ప్రాథమిక జ్ఞానము.
90) రాజకీయము×రాజకీయము
**91) ప్రథమ దైవగ్రంథము భగవద్గీత.**
**92) మధ్యమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.**
**93) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.**
**94) అంతిమ దైవగ్రంథములో వజ్రవాక్యములు**

# ఇతర సంఘముల ప్రచురణలు

## ఖుదా ఇస్లామిక్ స్పిరిచ్యువల్ సొసైటీ

1. అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు. 2. ఖుర్ఆన్‌లో ఆణిముత్యాలు.
3. అంతిమ దైవగ్రంథములో అర్థాలు-అపార్థాలు. 4. జకాత్ (ఆర్థిక సేవ).
5. అంతిమ దైవగ్రంథములో జ్ఞాన రత్నాలు. 6. షరియతా-జ్ఞానమా.
7. అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు. 8. ఖుదా-అల్లాహ్. 9. రెక్కల గుఱ్ఱము.
10. చంద్రుడు-నక్షత్రము.

## సువార్త క్రైస్తవ సంఘం

1. మతాలన్నిటికి ప్రాథమిక జ్ఞానము.
2. మత ధిక్కారము కాదు-సత్యగ్రాహితము.
3. పాప క్షమాపణ ఎలా కలదు?
4. ముందు చూపు.

## రావణ బ్రహ్మ ద్రావిడ బ్రాహ్మణ సంఘం

1. త్రైత సిద్ధాంత పరిశీలన
2. త్రైత సిద్ధాంతం సూపర్ సైన్స్
3. కాలజ్ఞానములో ఆనంద గురువు.
4. అంతర్ ధన శతకము (జ్ఞాన ధన శతకము)
5. బెర్ముడా ట్రయాంగిల్-సైంటిస్ట్‌లకు సవాల్
6. ట్విన్ టవర్స్ (9/11) ట్రూత్
7. తెలుగు-వెలుగు

## ద్రావిడ శ్రేష్ఠి సంఘం

1. సంఖ్య లో అంఖ్య

*DVD'S*

01. సంతకము.
02. సాంప్రదాయము.
03. త్రైతశకము.
04. కోడిపుంజు-పాదరసము.
05. యుగము-యోగము.
06. నైజం-సహజం.
07. ఆత్మకు వెంట్రుక గుర్తు.
08. పైత్యం-సైత్యం.
09. శైవము-వైష్ణవము.
10. ఇందూ మహాసముద్రము.
11. సృష్ఠి-సృష్ఠికర్త.
12. కాయ-పండు-కాయ.
13. జ్ఞానము-విజ్ఞానము.
14. వార-మాస-వత్సర.
15. సేకూవలి-కూలిసేవా.
16. ధర్మము-అధర్మము.
17. ఏక్‌నిరంజన్-అలక్‌నిరంజన్.
18. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
19. బట్టతల.
20. భగవంతుడు.
21. ద్రావిడులు-ఆర్యులు.
22. ప్రభువు-ప్రభుత్వం.
23. భూతం-మహాభూతం.
24. ప్రభు-ప్రజ.
25. యాదవ్.
26. పుస్తకము-గ్రంథము.
27. వెలుగుబంటు.
28. ప్రకృతి-వికృతి.
29. మాట-మందు.
30. ఏకత-ఏకాగ్రత.
31. హరికాలు-హరచేయి.
32. పుట్టగోసి-మొలత్రాడు.
33. 1 2 3 గురుపౌర్ణమి.
34. చమత్కార ఆత్మ.
35. క్షమించరాని పాపము.
36. మాయకుడు-అమాయకుడు.
37. మరణము-శరీరము.
38. ఎదమీదముద్ర-తల్లి తండ్రి గుర్తు.
39. ద్వితీయుడు-అద్వితీయుడు.
40. బయటి సమాజం-లోపలి సమాజం.
41. సేవా శాతము.
42. ప్రపంచ శ్రద్ధ-పరమాత్మ శ్రద్ధ.
43. శ్రీకృష్ణాష్టమి.
44. దేవుని జ్ఞానము-మాయ మహత్యము
45. తల్లి తండ్రి.
46. తల్లి తండ్రి-గురువు దైవము.
47. సమాధి.
48. మతము-పథము.
49. కలియుగము.
50. దివ్యఖురాన్-హదీసు.
51. పుట్టుట-గిట్టుట.
52. తల్లి.
53. గోరు-గురు.
54. కర్మ మర్మము.
55. ఆత్మ.
56. తాత.
57. గురుపౌర్ణమి.
58. ఇందువు-హిందువు.
59. శ్రీకృష్ణజన్మ మధుర.
60. ఆత్మపని.
61. త్రైత సిద్ధాంతము.

*DVD'S*

62. కర్మ లేని కృష్ణుడు-
కర్మ ఉన్న కృష్ణుడు.
63. సహజ మరణం- తాత్కాలిక మరణం.
64. స్త్రీ-పు / లింగము.
65. దేశం మోసం-దేహం మోహం.
66. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
67. జీర్ణ+ఆశయము.
68. మేఘం ఒకభూతం-
రోగం ఒకభూతం.
69. దేవునికి మతమున్నదా?
70. ఇచ్ఛాధీన కార్యములు-
అనిచ్ఛాధీన కార్యములు.
71. ఏది ధర్మము?
72. అధర్మ ఆరాధనలు.
73. మూడు పుట్టుకలు-రెండు జాగాలు.
74. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
75. నిదర్శ - నిరూప.
76. నటించే ఆత్మ.
77. సంచిత కర్మ.
78. గురువు ఎవరు?
79. శ్రీకృష్ణుడు ఎవరు?
80. సుఖము-ఆనందము.
81. టక్కుటమారా, ఇంద్రజాల
మహేంద్రజాల, గజకర్ణ, గోకర్ణ.
82. భయం.
83. దశ-దిశలు.
84. ఆడించే ఆత్మ.
85. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం)
86. మూడు నిర్మాణాలు-ఒక పరిశుభ్రత.
87. ఏది శాస్త్రము?
88. తెలుగులో మూడు-ఆరు-తొమ్మిది.
89. 6-3=6.
90. గుర్తింపబడనివాడు గురువు.
91. జ్ఞానము దగ్గర జాగ్రత్త!
92. చంద్రాకారము (బట్టతల).
93. మతములలో పవిత్రయుద్ధము.
94. మూడు గ్రంథములు.
95. ఏడు ఆకాశములు.
96. దైవగ్రంథము
97. జ్ఞానము కబ్జా అయ్యింది!
98. భక్తి-భయము.
99. జ్ఞానశక్తి.
100. కాలజ్ఞాన వాక్యములు.
101. అర్థము-అపార్థము.
102. తోలేవాడు.
103. గురు చిహ్నం.
104. భక్తి-శ్రద్ధలు.
105. దేవుడు ఇద్దరా! ఒక్కరా!!
106. పురుషోత్తమ.
107. మతద్వేషము.
108. నీ వెనుక వాడు.
109. గ్రంథము - బోధ.
110. ఆట - దోబూచులాట.
111. ప్రజలు - మానవులు.
112. ఆస్తి - దోస్తి.
113. దంతము-అంతము.
114. మాయ మర్మము- ఆత్మ ధర్మము
115. శ్రీకృష్ణుడు చనిపోయాడా? చంపబడ్డాడా?
116. అంతిమ గ్రంథములో
ప్రథమ వాక్యములు.
117. అదురు-బెదురు.
118. శవము-శివము
119. ధర్మచక్రము
120. గ్రాహిత శక్తి
121. ఆధ్యాత్మిక ప్రశ్నలు - జవాబులు.

## ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా

## ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 98665 12667, 99516 75081, 94903 63038.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
అనంతపురము టౌన్, A.P.
Cell : 97059 59390, 99855 80099

**కె.లక్ష్మీనారాయణాచారి** (ప్రెసిడెంట్)
ధర్మవరం, అనంతపురం (జిల్లా),
Cell : 94405 56968, 92900 12413, 94406 01136

**టి. సూర్యనారాయణ** (సూర్య మీ సేవా)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9885250967

**ఇందూ ధరణి జనరల్ స్టోర్స్**
(పి. శివరామ్ ప్రసాద్)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9030057963, 9063504963

**బి. ఆదిశేషయ్య** (టీచర్) (ప్రెసిడెంట్)
గుత్తి, అనంతపురం జిల్లా
Cell : 9491362448, 7382986963.

**పి. ఆదినారాయణ** (ప్ర.సభ్యుడు)
ముద్దిరెడ్డి పల్లి (గ్రా॥), అనంతపురం (జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**ఎ. నాగేంద్ర** (ప్రెసిడెంట్)
క్రొత్త చెరువు (గ్రా,మం)
అనంతపురం జిల్లా. Cell:9493622669
9959316410, 9949995090.

**పి. నాగయ్య** (ప్ర.సభ్యుడు)
వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు టౌన్
Cell : 9440244598, 9849303902

**ఇందూ జ్ఞానవేదిక** (Head Office)
చైతన్యపురి, దిల్‌సుఖ్‌నగర్,
హైదరాబాద్, తెలంగాణ రాష్ట్రం,
Cell:94910 40963, 90329 63963, 98485 90172.

**డి. గోపికృష్ణ**
హుజురాబాద్, కరీంనగర్ జిల్లా. T.S
Cell : 9989202003, 9542061601

**కె.వెంకటేశ్వర్లు** (ప్ర.సభ్యుడు)
నందికొట్కూరు, కర్నూలు జిల్లా
Cell : 9440047256, 9701956599

**కె.అశోక్‌బాబు** (టీచర్) (ప్రెసిడెంట్)
రామాపురం (గ్రా), వి.కోట (మం).
చిత్తూరు జిల్లా. Cell : 9440305700

**వి. రామక్రిష్ణన్** (వైస్ ప్రెసిడెంట్)
కుప్పం, చిత్తూరు జిల్లా. Cell : 96527 55110

**డి. బాలాజీ** (వైస్ ప్రెసిడెంట్)
బంగారు పాళ్యం (గ్రా), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.

**బాలం లక్ష్మీనరసింహులు** (ప్రెసిడెంట్)
మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

**టి.వి. రమణ** (ప్రెసిడెంట్)
ముదిగుబ్బ (గ్రా) అనంతపురం జిల్లా
Cell : 9440980036, 07406039453.

# ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా

**P.M.H నాయుడు**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా)
Cell : 9440490963

**P. రామకృష్ణారెడ్డి**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా)
Cell : 9666202963

**శ్రీ ప్రబోధ క్లీనిక్**
**U. జనార్ధన్** (R.M.P)
ఆటోనగర్, బస్టాండు రోడ్
కోయిలకుంట్ల (మం), కర్నూలు (జిల్లా)
Cell : 9491851911

**డా॥యం. వెంకటేశ్వర రావు (ప్రెసిడెంట్)**
MD (acu)
శాంతినగర్, నెల్లూరు జిల్లా.
Cell : 9440615064, 9246770277.

**అనమల మహేశ్వర్ (ప్రెసిడెంట్)**
చవటపాల్యం (గ్రా), గూడూరు, నెల్లూరు జిల్లా.
Cell : 9494631664, 9490809181, 8106065300.

**రౌతు శ్రీనివాసరావు (ప్రెసిడెంట్)**
ఏటుకూరు రోడ్, దర్గామాన్యం,
గుంటూరు జిల్లా.
Cell : 9948014366, 9052870853

**ఘడియం. పెద్దరెడ్డి (ప్ర.సభ్యుడు)**
నరసరావుపేట, గుంటూరు జిల్లా
Cell : 9989204097, 9849555738

**నర్రా శ్రీనివాస్ రెడ్డి**
కంభం (మం), ప్రకాశం జిల్లా.
Cell :9849883261, 8142853311, 8187084516

**తలారి గంగాధర్**
గుడిపాటి గడ్డ, నంద్యాల టౌన్
Cell: 9491846282, 7671963963

**Y. రవిశేఖర్ రెడ్డి**
పెద్దకొట్టాల (గ్రా), నంద్యాల (మం)
కర్నూలు (జిల్లా)
Cell : 9440420240, 9885385215

**టి. ఉదయకుమార్ (ప్రెసిడెంట్)**
భీమవరం వన్‌టౌన్, పశ్చిమ.గో.జిల్లా
Cell : 99482 75984, 73864 33834.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
విశాఖపట్టణము, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం.
Cell : 76749 79663, 94400 42763,
89777 13666, 92478 26253.

**ఎన్.బి. నాయక్ (ప్ర.సభ్యుడు)**
పెదమడక, అగనంపూడి,
విశాఖపట్నం (జిల్లా), Cell : 73964 92239,
92483 15309, 73862 12589.

**వి.సి.వర్మ (గురూజీ) ఆనందాశ్రమము**
మజ్జివలస (గ్రా, పోస్టు),
భీమిలి (మం), విశాఖపట్నం (జిల్లా).
Cell : 94415 67394, 9502 172711.

**వి. శంకర రావు (టీచర్) (ప్రెసిడెంట్)**
అశోక్‌నగర్, విజయనగరము (జిల్లా).
Cell : 9703534224, 9491785963.

**తులసీ రావు**
Opp. T.T.D కళ్యాణమండపం,
విజయనగరము (జిల్లా).
Cell : 9441878096, 9030089206.

**www.thraithashakam.org | Email : info@thraithashakam.org**

**యస్. అనిల్‌కుమార్**
కాకినాడ టౌన్, తూర్పు గోదావరి జిల్లా
Cell:9866195252, 9640526520, 7396038888

**బండారు సత్యనారాయణ**
మామిడి కుదురు (మం),
తూ.గోదావరి జిల్లా, Cell:95535 07141,
84669 20419, 94902 95577

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యుడు)
బొద్దాం (గ్రా), రాజాం (మం),
శ్రీకాకుళం (జిల్లా).
Cell : 9494248963, 9959779187.

**చెల్లారపు అప్పల నాయుడు**
చెల్లారపు వలస (గ్రా),
బొబ్బిలి (మం), విజయనగరం జిల్లా.
Cell:9494853773, 8465860706

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
మల్లిగాం (గ్రా), కొత్తపేట్ (పో),
రాయగడ (జి), ఒడిశా (రాష్ట్రం)
09437527499, 09437527470, 09437975781

**షేక్ అమీర్ అలీ** (President, K.I.S.S)
నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం.
Cell : 9505989898, 9505768181

**షఫీ షేక్** (Vice President, K.I.S.S)
చెన్నై, తమిళనాడు రాష్ట్రం.
Ph:09445554354.

**షేక్ ఇబ్రహీం** (K.I.S.S Member)
కర్నూల్ టౌన్, ఆం.ప్ర. Ph:70950 08369

**యం. అల్లీపీర్** (K.I.S.S Member)
మడకశిరా, అనంతపురం జిల్లా, ఆం.ప్ర.
Cell : 89780 58081

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
కొత్తకోట, మహబూబ్‌నగర్ (జిల్లా).
Cell : 87905 58815, 9440655409, 9701261165

**యం. మురళి** (Cell : 97057 16469)
జడ్చర్ల, మహబూబ్‌నగర్ జిల్లా.

**యం. జైరాంనాయక్**
పద్మావతి కాలనీ, మహబూబ్‌నగర్ టౌన్.
Cell :70321 74830, 90009 16419

**జి. సాయిశంకర్ శ్రేష్ఠి** (టీచర్)
అచ్చంపేట, మహబూబ్ నగర్ (జి)
Cell : 9948947630, 9640717574

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ)** (ప్రెసిడెంట్)
హుజూర్‌నగర్, నల్గొండ జిల్లా.
Cell : 9848574803, 9866423853.

**బి. దేవేందర్**
భువనగిరి టౌన్, నల్గొండ జిల్లా.
Cell:7680065963, 9704885964, 9848741703

**ఇ. శ్రీనాథ్ శ్రేష్ఠి**
గణేష్ స్ట్రీట్, జనగాం, వరంగల్ జిల్లా.
Cell : 9573552963, 8096958359.

**ఎ. రాఘవేంద్ర శ్రేష్ఠి**
శ్రీకృష్ణ మెడికల్స్ & జనరల్స్
పటేల్ నగర్, 3వ క్రాస్ హోస్పేట,
బళ్ళారి జిల్లా, కర్ణాటక రాష్ట్రం.
Cell : 097318 16452, 096111 33635.

**A.V. LAKSHMI NARAYANA**
San Antonio, TEXAS, U.S.A
+1(210) 714 9696, +1(210) 527 3436

**K.SIVA KRISHNA**
Atlanta, GEORGIA, U.S.A
+1(404) 551 3297, +1(470) 658 7635

# యోగీశ్వరుల వారి రచనల సారాంశము

1) త్రైత సిద్ధాంత గ్రంథములలో అక్షర సముదాయమే, ఆత్మ సమాచారమై ఉన్నది. త్రైత సిద్ధాంత గ్రంథములలో క్షయ అక్షయ సమాచారము, పరమాత్మ సమాచారము ఉన్నది.

2) త్రైత సిద్ధాంత సంబంధ గ్రంథములను భౌతికముగా వ్రాసినది యోగీశ్వర్లు. త్రైత సిద్ధాంత అనుబంధ గ్రంథములలో అభౌతికముగా యోగశక్తి ఉన్నది.

3) త్రైత సిద్ధాంతము ఇందూ (హిందూ) ధర్మములలో విప్లవాత్మకమైనది. త్రైత సిద్ధాంత గ్రంథములలోని జ్ఞానము సంచలనాత్మకమైనది, చదివి చూడండి.

4) త్రైత సిద్ధాంతము లోకములో అన్నిటికంటే గొప్పది. త్రైత సిద్ధాంత గ్రంథములు అన్ని గ్రంథములను మించినవి, దాని రచయిత యోగులకు ఈశ్వరుడైన యోగీశ్వరుడు.

5) త్రైత సిద్ధాంత గ్రంథములు కనిపిస్తే దుష్టశక్తులు భయముతో వణికిపోతాయి. త్రైత సిద్ధాంత గ్రంథములను దగ్గర ఉంచితే యోగశక్తికి తాళలేక భయపడిపోతాయి.

6) త్రైత సిద్ధాంత జ్ఞానము భగవద్గీత తరువాత చెప్పబడిన అతి గొప్ప జ్ఞానము. త్రైత సిద్ధాంత గ్రంథములలో కృష్ణుడు ముందు చెప్పని జ్ఞానమును కూడా యోగీశ్వర్లు చెప్పారు.

7) త్రైత సిద్ధాంత జ్ఞానము మానవ జీవితమునకు గొప్ప వెలుగు. త్రైత సిద్ధాంత వెలుగులోనికి పోయిన వానికి అది దైవశక్తి అని తెలియును.

8) త్రైత సిద్ధాంత భగవద్గీతను వ్రాసినది యోగీశ్వర్లు. అందువలన త్రైత సిద్ధాంతము అంటే ఏమిటో, అది ఎంత గొప్పదో తెలియబడినది.

9) త్రైత సిద్ధాంతమును గురించి తెలియగలిగితే, యోగీశ్వరుల గ్రంథములను చదువగలిగితే, ఏ మతస్థుడైనా ఒప్పుకొని తీరును, దానిని ఆచరించును.

10) త్రైత సిద్ధాంతము ప్రత్యక్షముగా భగవంతుడు చెప్పినది. అందువలన అన్ని మతముల సారాంశము త్రైత సిద్ధాంత గ్రంథములలో కలదు.

11) త్రైత సిద్ధాంత గ్రంథములు వ్యక్తి వ్రాసినవి కావు, వ్యక్తిలోని శక్తి వ్రాసినవి. అందువలన అన్నీ రహస్యములే చదివి తెలుసుకోండి.

12) త్రైత సిద్ధాంతము భగవద్గీత, బైబిలు, ఖురాన్ గ్రంథములలో కలదు. అయినా హిందువులకుగానీ, క్రైస్తవులకుగానీ, ముస్లీమ్‌లకుగానీ ఆ విషయము తెలియదు.

# ధర్మచక్రము

'ధర్మము' అను పదము అందరికీ సుపరిచయమే. అయితే అది కొందరికి వినికిడి వరకే పరిమితమైనది. ధర్మము ప్రతి వస్తువుకు ఉన్నది. వస్తువులు వేరువేరుగాయున్నవి, వాటి ధర్మములు కూడా వేరువేరుగా యున్నవి. దేనికయినా శాశ్వితముగా ఉండునది ధర్మము. ఉదాహరణకు నీరును తీసుకొందాము. నీరును ఒకచోటయున్న దానిని ఎన్ని భాగములుగా అయినా విడదీయవచ్చును. అలాగే ఎన్ని భాగములుగా యున్న నీరునయినా తిరిగి ఒక్కటిగా కలుపవచ్చును. నీరును కలుపగా అతుకుబడును. కలిపినప్పుడు అతుకుబడును కావున ఎన్ని నీళ్ళను కలిపినామని తెలియదు. నీరును కత్తితో నరికినా అది కలిసిపోవుచుండును. నీరు తగ్గు ప్రదేశమునకు ప్రవహించును. నీరును వేడిచేస్తే ఆవిరిగా మారును. ఆవిరిని చల్లబరుస్తే తిరిగి నీరుగా మారును. ఇవన్నీ నీటికి గల శాశ్విత లక్ష్యణములు. ఎప్పటికీ మారని శాశ్విత లక్షణములను 'ధర్మములు' అంటాము. వాటికున్న శాశ్విత ధర్మములను బట్టి వాటిని గుర్తించవచ్చును. అట్లే వస్తువునుబట్టి దానికున్న ధర్మమును చెప్పవచ్చును.

దేవుని చేత సృష్ఠింపబడినది ప్రకృతి. ప్రకృతిలోని ప్రతి వస్తువుకు, ప్రతి ద్రవమునకు, ప్రతి వాయువుకు, ప్రతి లోహమునకు ధర్మములు కలవు. **సృష్ఠింపబడినది ఏదయినా ఏదో ఒక ధర్మమునుగానీ, ధర్మములనుగానీ కల్గియుంటుంది. సృష్ఠింపబడనిది ఏదయితే ఉందో దానికి ధర్మము అంటూ ఏదీ ఉండదు.** ఆ లెక్క ప్రకారము ప్రకృతి దేవుని చేత సృష్ఠింపబడుట చేత ప్రకృతిలోని సమస్త వస్తు, ద్రవ, వాయువులకు ధర్మములు కలవని చెప్పవచ్చును. ప్రపంచములో ధర్మము లేనిది ఏదీ లేదు. ప్రకృతి సంబంధమైన వాటికేకాక ఆత్మసంబంధమైన మనిషికి (జీవునకు) ధర్మము కలదు.

**ప్రశ్న :- మీరు ఇంతవరకు చెప్పిన ధర్మములు వాస్తవమే అయినా మేము వాటికంటే ఎక్కువగా విన్నది దేవుని ధర్మముల గురించి. దేవుడు తన ధర్మములకు ముప్పు ఏర్పడినప్పుడు దేవుడు స్వయముగా ఉద్భవించి, తిరిగి తన ధర్మములను ప్రతిష్ఠించుననీ, అధర్మములను లేకుండా చేయునని భగవద్గీత జ్ఞానయోగములో 6, 7, 8 శ్లోకములలో చెప్పియున్నారు. ఇంతకుముందు మీరు ఒక సూత్రమును చెప్పారు. అదేమనగా! సృష్ఠింప బడిన ప్రతి దానికి ధర్మములు ఉంటాయని అన్నారు. ఇప్పుడు దేవునికి కూడా ధర్మములున్నట్లు మీరు భగవద్గీతయందే శ్లోకములను చూపారు. మీ సూత్రము ప్రకారము ధర్మములున్నాయి అంటే దేవుడు కూడా సృష్ఠింపబడియున్నాడనియేగా అర్థము. దేవుని ధర్మములను గురించి భగవద్గీతలో చాలాచోట్ల చెప్పబడినది. మిగతా రెండు దైవగ్రంథములయిన ఖుర్ఆన్, బైబిలుయందు కూడా దేవుని ధర్మములను గురించి చెప్పియున్నారు. దేవుడు ధర్మములతో కూడుకొన్నవాడుయని కొందరు జ్ఞానసంపన్నులైన వారు కూడా చెప్పగా విన్నాము. తన ధర్మములను ఆచరించువారిని దేవుడు ఇష్టపడునుయనీ, వారికి మోక్షమును కలుగజేయుననీ, ఎప్పటికీ దుఃఖమును పొందని ముక్తిని మనిషికి ప్రసాదించునని చెప్పగా విన్నాము. ఇదంతా చూచిన తర్వాత మీ సూత్రము ప్రకారము దేవుడు కూడా ఇంకొకరి చేత సృష్ఠింపబడినవాడేయని చెప్పవచ్చును. మీ సూత్రము సత్యమైతే 'దేవుడు సృష్ఠింపబడినాడు' అనునది సత్యము. ఒకవేళ దేవుడు ఇతరుల చేత సృష్ఠింపబడలేదు అంటే మీ సూత్రము తప్పు అగును. ఇప్పుడు సూటిగా అడుగుచున్నాము. మీ సూత్రము తప్పా? ఒప్పా?**

**జవాబు :-** నా సూత్రము తప్పు అని చెప్పుటకు అవకాశమే లేదు. మీ

ప్రశ్నకు జవాబు కావాలంటే **"ధర్మచక్రము"** అంటే ఏమిటో తెలియవలసి యుంటుంది. ధర్మచక్రమును గురించి తెలియగలిగితే దేవుని ధర్మములను గురించి తెలియవచ్చును. దేవుని ధర్మములు తెలియగలిగినప్పుడు దేవుని సమాచారము అంతా పూర్తిగా తెలియగలదు. దేవుని సమాచారమును సంపూర్ణముగా తెలిసినప్పుడు దేవుని ధర్మములలోని మర్మము తెలియును.

**ప్రశ్న :- మీరు మేము అడిగిన ప్రశ్నకు సూటిగా జవాబును చెప్పడము లేదు. ప్రశ్నను దాటవేస్తున్నారు. మీ సూత్రము నిజమా, అబద్ధమా ఒకే మాటలో చెప్పండి?**

**జవాబు :-** నా సూత్రము సత్యమనియే చెప్పుచున్నాను. నేను చెప్పినది ముమ్మాటికీ సత్యమే.

**ప్రశ్న :- అయితే దేవుడు ఎవరి చేత సృష్ఠింపబడినాడు? ఒకేమాటలో జవాబు చెప్పండి?**

**జవాబు :-** దేవుని చేత సృష్ఠింపబడినాడు.

**ప్రశ్న :- నేను అడుగుచున్నది దేవున్ని గురించి?**

**జవాబు :-** నేను చెప్పుచున్నది దేవున్ని గురించే. దేవుడు సృష్ఠింపబడి నాడని చెప్పుచున్నాను. వాస్తవముగా దేవుడు సృష్ఠించబడేవాడు కాదనీ, దేవుని సృష్ఠి ఎవరికీ తెలియదని చెప్పుచున్నాము. ఇదంతా అర్థము కావాలంటే ధర్మచక్రమును వివరముగా తెలియుటకు ప్రయత్నిద్దాము. నేను ఒకమారు దేవుడు ధర్మములకు తెలియబడును అనీ, అట్లే దేవుడు ధర్మములకు అతీతుడనీ, ధర్మాతీతుడయిన దేవుడు ధర్మములకు తెలియబడడని చెప్పుచుందును. నా మాటలు ద్వంద్వ ధోరణిలో ఉండుట వలన వ్రాసే వానికా పిచ్చి లేక చదివేవానికాయని అనుమానము వచ్చును. అందువలన

అంతవరకు పోకుండా నా మాటలు మీకు అర్థమగుటకు ముందు ధర్మ చక్రమును గురించి తెలుసుకొందాము.

ధర్మము అంటే మార్పుచెందని లక్ష్యణమని చెప్పవచ్చును. చింతకాయకు పులుపు మార్పుచెందని శాశ్విత లక్ష్యణము. అందువలన చింతకాయ ధర్మము పులుపుయని చెప్పవచ్చును. మామిడి కాయ లేతగా కసికాయగా యున్నప్పుడు వగరుగా, పూర్తి కాయగా మారినప్పుడు పుల్లగా, పూర్తి పండుగా మారినప్పుడు తియ్యగా ఉండును. అందువలన మామిడి కాయ ధర్మము పులుపుయనిగానీ, వగరు అనిగానీ, తీపి అనిగానీ చెప్పలేము. శాశ్వితముగా ఉండునదే ధర్మమగును. శాశ్వితముగా ఉండు లక్ష్యణములను బట్టి ఇది ఫలానా వస్తువు అని చెప్పినట్లు అట్లే శాశ్వితముగా యుండు లక్ష్యణములు లేక ధర్మములను బట్టి ఈయన ఫలానా దేవుడు అని చెప్పవచ్చును. దేవున్ని దేవుని ధర్మములను బట్టి తెలియవచ్చును. అందువలన దేవుని ధర్మములను తెలియుటకు దేవుని సమాచారము లేక దేవుని జ్ఞానమును ముందు తెలియవలసి యున్నది. దేవుని జ్ఞానము ద్వారా దేవుని ధర్మములను తెలిసి, దేవుని ధర్మముల ద్వారా దేవున్ని తెలియవచ్చును.

ఏ ధర్మమయినా సృష్ఠింపబడిన వారికేయున్నది అదే సూత్రమైనప్పుడు దేవుడు సృష్ఠింపబడినవాడా లేక సృష్ఠించినవాడా?యను ప్రశ్న బయలు దేరుచున్నది. ఉన్న సత్యమును చెప్పితే దేవుడు సమస్తమును సృష్ఠించిన వాడు, దేవుడు ఎవరి చేత సృష్ఠింపబడలేదు. ఈ విషయము నాకు బాగా తెలుసు. అయితే నేనే దేవునికి ధర్మములు కలవని చెప్పుచున్నాను. నేను చెప్పడమే కాదు దైవ గ్రంథములు సహితము దేవుని ధర్మముల గురించి చెప్పుచున్నవి. దేవుడు సృష్ఠింపబడని వాడు

అయినప్పుడు ఆయనకు ధర్మములున్నాయని చెప్పడము అజ్ఞానమగును కదా!యని ఇతరులు అడుగవచ్చును. అజ్ఞానమగును అని తెలిసి దేవునికి ధర్మములున్నాయని నేను నాతో పాటు మూడు దైవగ్రంథములు చెప్పుచున్నవి. అలా చెప్పుటకు బలమైన కారణము కలదు. అదేమనగా! ఒకరైతు తన పొలములో పంట వేయుటకు శుభ్రమయిన గింజలను ఎన్నుకొని వాటియందు మన్ను, రాళ్ళు లేనివి తీసుకొని పొలములో విత్తును. అయితే నూగులు అను గింజలను పొలములో విత్తాలంటే ఆ గింజలలోనికి కొంత మన్ను లేక కొంత ఇసుకను కలుపుకొని విత్తవలసియుండును. అలా కలుపుకోకపోతే నూగు గింజలు చేతినుండి జారి పొలములో పడవు. అవి ఒక దానికొకటి అంటుకొన్నట్లుండును. కొద్దిగ చేయి వదులు చేస్తే గింజలు కుప్పగా పడిపోవును. కొద్దిగ గట్టిగ పట్టుకొంటే గింజలు జారి పొలములో పడక అలాగే చేతిలోనే ఉండిపోవును.

అందరూ అన్ని విత్తనములను శుభ్రపరచి మన్ను, ఇసుక లేనివి పొలములో విత్తితే, నూగులు విత్తువాడు మాత్రము మన్ను, ఇసుక కలిపి విత్తుచున్నాడు. అలాగే ధర్మములు లేని దేవున్ని తెలియుటకు, సృష్ఠింపబడని దేవున్ని తెలియుటకు దేవునికి ధర్మములను అదే పనిగా చేర్చవలసి వచ్చినది. మనుషులకు ధర్మములున్నవే తెలియబడును. కావున దేవున్ని తెలియుటకు లేని ధర్మములను దేవునికి కల్పించి, ధర్మముల ప్రకారము దేవున్ని అర్థము చేసుకొన్నప్పుడు తర్వాత ధర్మములను తీసివేసి దేవున్ని చూడవలెను. చిన్న ఉదాహరణను చెప్పుకొందాము. ఒక సమాచారమును కాగితములో వ్రాసి ఇతరులకు పోస్టుద్వారా పంపుదుము. ఏ విధముగా పంపినా వ్రాయబడిన సమాచారముగల కాగితమును మడచి ఒక కవర్‌లో పెట్టి పంపుదుము. కవర్ మీద ఎవరికి పంపవలెనో వారి అడ్రస్ వ్రాసియుండును. అది

చేరవలసిన వారికి చేరినప్పుడు కవర్ తీసి ప్రక్కన వేసి కాగితములో వ్రాసిన సమాచారమును చూస్తాము. అక్కడికి చేరువరకు కవర్‌కు ప్రాధాన్యత కలదు. ఉత్తరము చేరిన తర్వాత కవర్‌కు ఏమాత్రము విలువ లేదు. కవర్‌ను అడ్డముగా చించి లోపలి కాగితమును మాత్రము చదువుదుము. అంతవరకు విలువయున్న కవర్ ఉత్తరము చేరిపోయిన తర్వాత ఎట్లు విలువ లేకుండా పోయినదో దేవుని విషయములో దేవుని సమాచారము తెలియునంతవరకు ధర్మముతో అవసరము. దేవుని విషయము తెలిసిన తర్వాత ధర్మముతో అవసరము లేదు.

తెలియబడని దేవున్ని తెలియుటకు ధర్మములున్న దేవున్ని మొదట తెలియగలిగితే తర్వాత ధర్మములు లేని దేవుడు తెలియబడును. అందువలన దేవుడు తనను ధర్మములున్న దేవునిగా తయారు చేసి, ఆయన తప్ప మీరు తెలియదగిన దేవుడు లేడని చెప్పారు. ఆయనే మీకు ఆరాధ్యదైవము అని చెప్పాడు. ఆ విధానము అంతయూ మూడు గ్రంథములలో సంపూర్ణముగా చెప్పబడినది. ధర్మములు గల దేవున్ని గురించిన జ్ఞానమే మూడు దైవ గ్రంథములలోనూ దాదాపు ఎనభై శాతము గలదు. కొద్దిశాతము మాత్రము ధర్మములు లేని దేవున్ని గురించి, సృష్ఠింపబడని దేవున్ని గురించి చెప్పడమైనది. దైవగ్రంథములలో ఎనభై శాతము చెప్పిన ధర్మములు గల దేవుడే సరిగా మనుషులకు అర్థము కానప్పుడు కొద్దిపాటి సమాచారమున్న ధర్మములు లేని దేవున్ని గురించి ఏమీ అర్థము కాలేదనియే చెప్పవచ్చును. ధర్మములు లేని దేవుడు, సర్వమును సృష్ఠించిన దేవుడు ధర్మములు గల దేవున్ని సృష్ఠించి ఆ దేవున్నే అందరూ ఆరాధించవలెననీ ఆయనే మీకు ఆరాధ్య దైవమని అంతిమ దైవగ్రంథము ఖుర్ఆన్‌లో చెప్పిన ఆయత్‌ను చూడండి. సూరా మూడు, ఆయత్ పదునెనిమిదిలో ఇలా చెప్పారు.

**(3-18) "అల్లాహ్ తప్ప మరొక ఆరాధ్య దైవము లేడని స్వయముగా అల్లాహ్, ఆయన దూతలు, జ్ఞానసంపన్నులు సాక్ష్యమిచ్చుచున్నారు. ఆయన సమత్వము, సమతూకముతో ఈ విశ్వాన్ని నిలిపి ఉంచాడు. సర్వాధిక్యుడు, వివేచనాశీలి అయిన ఆయన తప్ప మరొకరెవరూ ఆరాధనకు అర్హులు కారు."**

ఈ వాక్యమును బట్టి మనుషులు ఆరాధించుటకు తగిన దేవున్ని అసలయిన దేవుడు తయారు చేశాడని తెలియుచున్నది. ధర్మములు లేని దేవుడు, ప్రజలు తనను తెలియు నిమిత్తము, తాను సృష్ఠించిన ఆత్మను దేవునిగా ప్రకటించి, తాను ఎవరికీ తెలియనివాడై పోయాడు. ధర్మములు లేని దేవున్ని మనుషులు ఆరాధించలేరు. మనుషులు ధర్మములు గల వానిని, సృష్ఠింపబడిన వానిని మాత్రమే తెలియగలుగు బుద్ధి గలవారై యున్నారు. ధర్మములు లేని దేవున్ని తెలియు విధానము ఏమాత్రము తెలియని వారైనందున, ప్రపంచములోయున్న ధర్మములు గల వానిని మాత్రమే ధర్మముల ఆధారముగా తెలియుటకు తెలిసిన మనుషులకు దేవుడే మొదట ధర్మములుగల దేవున్ని తెలియునట్లు చేశాడు. మొదట ధర్మములుగల దేవున్ని తెలియగలిగిన తర్వాత ధర్మములు లేని దేవున్ని తెలియగలరని దేవుని నమ్మకము. అందువలన ఖుర్ఆన్ గ్రంథములో (3-18) వాక్యములో స్వయానా దేవుడే 'మరొక దేవున్ని ఆరాధించమని' చెప్పాడు.

దేవుడు తన సృష్ఠిలో మొదట ప్రకృతిని తర్వాత ఆత్మను, జీవాత్మను సృష్ఠించాడు. తనతో కూడా మొత్తము జీవరూపము గల శరీరములతో నిండిన విశ్వమును తయారు చేశాడు. సృష్ఠి తర్వాత తాను ఎవరికీ తెలియని వాడుగా ఉండదలచి, తాను దేవునిగా కూడా ఆరాధించబడకుండా ఉండుటకు, తాను నిర్ణయించుకొన్న ప్రణాళిక ప్రకారము మానవులందరూ

ఆరాధించుటకు ఆత్మనే దేవునిగా నిర్ణయించి, ఇతనే మీకు ఆరాధ్య దైవము, ఇతను తప్ప వేరే ఆరాధ్య దైవము లేడని చెప్పియున్నాడు. దేవుడయిన ఆత్మను గురించి దైవగ్రంథములలో అధికభాగము చెప్పబడియుండగా సర్వమును సృష్ఠించిన దేవున్ని గురించి కొంత వరకే చెప్పియున్నారు. ఈ సమాచారమంతయూ ఆధారపూర్వకముగా యున్నది. శాస్త్రబద్ధముగా ఆత్మే దేవుడుగా చెప్పబడియున్నది. సృష్ఠింపబడిన ఆత్మే దేవుడయితే సర్వమును సృష్ఠించిన వాడు కేవలము సృష్ఠికర్తగా మాత్రము యున్నాడు, దేవుడుగా లేడు. సృష్ఠికర్తయైన దేవుడు తన అధికారములన్నియూ ఆత్మకు ఇచ్చి దేవునిగా ప్రకటించి, తాను స్థబ్దతగా ఏ కార్యము చేయకుండా అన్నిటినీ చూస్తున్న సాక్షిగా నిలిచిపోయినది.

విశ్వము చర, అచర ప్రకృతిగా విడిపోగా, చరప్రకృతి ద్వారా శరీరములు తయారుకాగా, శరీరములో జీవాత్మ దేవుడయిన ఆత్మచేత నడిపింపబడుచున్నది. జీవుడు కర్మప్రకారము కష్టసుఖములను అనుభవించునట్లు శరీరములో దేవుడయిన ఆత్మ పని చేయుచూ కార్యకర్తగా యుంటున్నది. జీవుడు తోలబడేవాడు కాగా, ఆత్మదేవుడు తోలేవాడుగా యుండగా, పరమాత్మ సాక్షిగా యున్నది. శరీరములో మూడు ఆత్మలున్ననూ, పరమాత్మ చూచేవాడుగా యుండగా, ఆత్మ కార్యములను చేయుచూ కష్టసుఖములలో జీవున్ని నడుపుచుండగా, జీవాత్మ కష్టసుఖములను అనుభవించుచున్నది. ఈ విషయమునే అంతిమ దైవగ్రంథములో **(50-21) "ప్రతి వ్యక్తి తనవెంట తనను తీసుకవచ్చే వాడొకడు, సాక్ష్యమిచ్చే వాడొకడు ఉన్న స్థితిలో హాజరవ్వుతాడు".** మరొక గ్రంథములో **(50-21) "ప్రతి ప్రాణి ఒక తోలేవాడితో మరొక సాక్ష్యమిచ్చేవాడితో సహా వస్తుంది"** అని కలదు.

ఇట్లు వాక్యములో చెప్పినట్లు ప్రకృతి శరీరముగా ఉండగా దేవుడు మూడు భాగములుగా శరీరములో యున్నాడు. శరీరములో ఆత్మే నిర్ణయింప బడిన దేవుడుగా ఉండగా, సృష్టికర్తయైన దేవుడు సాక్షిగా యుండగా దేవునిగా యున్న ఆత్మ శరీరములో కార్యకర్తగా యుండగా, జీవాత్మ కర్మరీత్యా ఆత్మ చేసిన కార్యములలోని కష్టసుఖములను అనుభవించుచున్నది. శరీరములో మూడు ఆత్మలున్నాయని, అవి ఈ విధముగా ఉన్నాయని ఖుర్ఆన్ గ్రంథములో (50-21) వాక్యములో చెప్పబడియున్నది. ఈ మూడు ఆత్మలే ప్రథమ దైవగ్రంథమయిన భగవద్గీతలో పురుషోత్తమ ప్రాప్తి యోగమున 16, 17 శ్లోకములలో **క్షరుడు, అక్షరుడు, పురుషోత్తముడు** అని చెప్పియున్నారు. అట్లే ద్వితీయ దైవగ్రంథమయిన ఇంజీలు (బైబిలు)లో మత్తయి సువార్తయందు 28వ అధ్యాయమున 19వ వచనమున **తండ్రి, కుమారుడు, పరిశుద్ధాత్మ**యని చెప్పడమైనది. అంతిమ దైవగ్రంథము **(50-21) "తోలబడేవాడు, తోలేవాడు, చూచేవాడు** అని చెప్పబడినది. సర్వప్రపంచమును పరమాత్మ సృష్ఠించి, ఆత్మను దేవునిగా నిర్ణయించగా, జీవాత్మ శరీరములో కాలము గడుపుచున్నది. దాదాపు ఈ విషయమంతయూ **"దేవుని ముద్ర"** అను గ్రంథములోనే చెప్పియున్నాము. అక్కడ చెప్పినదే ఇక్కడ జ్ఞాపకము చేశాము.

ఇప్పుడు మనము కొంచెము ముందుకు పోయి జ్ఞానమును చెప్పుకోగలిగితే ఈ గ్రంథములో కొంత క్రొత్త జ్ఞానము తెలిసినట్లగును. ఆ ప్రయత్నములోనే ధర్మముల విషయము తెరమీదికి తెచ్చాము. దేవుని ధర్మములను తెలిసితే దేవుని ధర్మముల ద్వారా దేవున్ని తెలియనగును. ధర్మము అనగా లక్ష్యణము అని చెప్పుకొన్నాము. నిమ్మకాయకు పులుపు ధర్మమగును. ఎందుకనగా! అది నిమ్మకాయకు శాశ్విత లక్ష్యణము.

పులుపునుబట్టి నిమ్మకాయను తెలియవచ్చును. అలాగే ధర్మమును బట్టి దేవున్ని తెలియవచ్చును. అటువంటప్పుడు ప్రకృతి వస్తువుతో సమానముగా దేవుడు గుర్తింపబడుచున్నాడు కదా!యని ఎవరయిన అడుగవచ్చును. అప్పుడు నిజమేనని ఒప్పుకోక తప్పదు. అయితే ధర్మముగలవాడు, ధర్మము చేత గుర్తింపబడువాడు నిజమైన దేవుడు కాదు, నిజమైన దేవునికి ధర్మములు లేవు అని చెప్పవచ్చును. ధర్మముల చేత తెలియబడు దేవుడు దేవుని చేత సృష్ఠింపబడిన దేవుడని చెప్పవచ్చును.

ఏకేశ్వరోపాసనయని ఒకే దేవున్ని విశ్వసించాలి, ఒకే దేవున్ని ఆరాధించాలని చెప్పువారున్నారు. అలా చెప్పడము ఒక మతమునకు పరిమితి లేదు. దైవ గ్రంథములలో సహితము ఒకే దేవున్ని ఆరాధించవలెనని చెప్పియున్నారు. కావున అందరూ ఆరాధించవలసినది ఒకే దేవున్నే అయితే భగవద్గీతలో ఈ విషయమును చెప్పియున్నా హిందువులు అన్యదేవతారాధనే ముఖ్యముగా చేయుచున్నారు. ముస్లీమ్‌లు, క్రైస్థవులు ఏకేశ్వరోపాసనయని చెప్పినా వారు వారి దేవున్ని, వీరు వీరి దేవున్ని ఆరాధించుచున్నారు. అన్ని మతముల వారు ఒకే దేవున్ని ఎక్కడా ఆరాధించలేదు. ముస్లీమ్‌లు మాత్రము మేము ఖచ్చితమైన పద్ధతిలో ఒకే దేవున్ని ఆరాధించుచున్నాము అని చెప్పినా వారు ఆరాధించు దేవుడు ఎవరు? అని ప్రశ్నిస్తే “అల్లాహ్” అంటున్నారు. అప్పుడు వారు మా గ్రంథము అని చెప్పుచున్న ఖుర్ఆన్ గ్రంథములో (3-18) ఆయత్‌లో చెప్పియున్న దానిప్రకారము ఇతనే మీరు ఆరాధించ వలసిన అల్లాహ్ (దేవుడు) అని స్వయానా అల్లాహ్‌యే చెప్పియున్నాడు కదా! మీరు ఏ అల్లాహ్‌ను ఆరాధిస్తున్నారని అడిగితే ఆ ప్రశ్నను వారు క్రొత్తగా వినుట వలన ఏమి జవాబు చెప్పాలి? ఏ అల్లాహ్ అని చెప్పాలి?

అని సందిగ్ధములో పడుచున్నారు. వారు ఇంతవరకు ఒక అల్లాహ్ అనియే విని యున్నారు గానీ రెండవ అల్లాహ్‌ను గురించి తెలియదు.

ముస్లీమ్‌లు ఎక్కువ శాతము తమ పెద్దలు చెప్పినదే వినుచుందురు. ఖుర్‌ఆన్ గ్రంథమును చదువు అలవాటు లేదు. ఎక్కడయినా ఎవరయినా ఖుర్‌ఆన్ గ్రంథమును చదవాలని అనుకున్నా దానిని వారికి అర్థమయ్యే భాషలో చదవకూడదు, అది వ్రాయబడిన అరబ్బీ భాషలోనే చదవాలి. అలా అరబ్బీ భాషలో చదువుట వలన ఖుర్‌ఆన్‌లో ఏమున్నదో వారికి తెలియదు. వచ్చిన భాషలో చదివినా దానిని అర్థము చేసుకొనుటకు చాలా కష్టమగును. బైబిలు గ్రంథము ఏ భాషలో అయినా చదువవచ్చును. బైబిలు అన్ని భాషలలో అచ్చు అయినది. వచ్చే భాషలో చదివినా అక్కడ వాక్యములోని వివరము తెలియలేక గ్రంథములోని భావమును గ్రహించలేక పోవుచున్నారు. అరబ్బీ భాషలో ఖుర్‌ఆన్‌ను చదవడము వలన అందులోని భావము ఏమాత్రము తెలియలేదు. వారు ప్రార్థన ఆచరణకు ఎంతో ముందున్న వారని చెప్పినా వారికి దేవుని జ్ఞానము తెలియదు. వారి ఇమాంసాబ్‌లు మస్జీద్‌లలో జ్ఞానము చెప్పినా వారు పూర్తి వివరము తెలిసి చెప్పడము లేదు. అందువలన వారిని మీరు ఏ అల్లాహ్‌ను ఆరాధిస్తున్నారని అడిగితే ఏమీ చెప్పలేకున్నారు.

ఏ మతస్థులకయినా దేవుడు అంటే ఒక్కడేయను నమ్మకము కలదు. ముస్లీమ్‌లకయితే రెండవ అనుమానము లేకుండా ఒకే దేవున్ని విశ్వసించి యున్నారు. ఒకే దేవుని మీద విశ్వాసముండుట నిజమైన భక్తి మార్గము. ఎందుకనగా! దైవగ్రంథములలో అల్లాహ్ ఒక్కడే మీ ఆరాధ్య దైవము అని చెప్పబడియున్నది. అయితే అల్లాహ్‌యే మీరు ఒకే అల్లాహ్‌ను ఆరాధించమని ఇంకొక అల్లాహ్‌ను చూపాడని మొత్తము మానవులందరికీ తెలియదు.

అల్లాయే స్వయముగా తనను గురించి మనుషులకు తెలియకూడదని తలచినవాడై, తన పాత్ర ఏమీ లేదని తెలిసినవాడై, మనుషులను పాలించుటకు ఇంకొక దేవున్ని ఏర్పాటు చేసి **"అందరికీ ఆయన ఒక్కడే దేవుడు, అందరూ ఆయననే ఆరాధించవలెనని"** చెప్పాడు. అట్లే దేవుని పాలకులు అయిన దేవదూతలు దేవుడు సృష్టించిన సృష్టికర్తయని ఆయన విశ్రాంతి కొరకు తన పనిని ఇంకొక దేవునికి అప్పజెప్పాడని తెలిసినవారై వారు కూడా దేవుడు సృష్టించిన దేవున్నే ఆరాధించమని చెప్పారు. ఇంకా దేవుని జ్ఞానమును సంపూర్ణముగా తెలిసి జ్ఞానములో సంపన్నులైన (ధనికులైన) వారు కూడా సృష్టికర్తయైన దేవుడు ఇక పనిని చేయనివాడని, ఆయన కేవలము సాక్షిభూతుడేయని తెలిసి, తన స్థానములో దేవుని అధికారమును ఇచ్చి నియమించిన దేవున్నే అందరూ ఆరాధించమని చెప్పారు.

దేవుడు (అల్లాహ్) తనను గౌరవించినట్లే తాను నిర్ణయించిన తన వారసుడైన తన కుమారున్ని కూడా దేవునివలె గౌరవించవలెనని, తనను గొప్పగ తలచి ఆరాధించినట్లే తన స్థానములో తన ఆత్మను ఆరాధించవలెనని తన ఆత్మనే తన కుమారునిగా, తన వారసునిగా ప్రకటించాడు. "ఒకవేళ ఎవరయినా తన కుమారున్ని గౌరవించకపోతే, గౌరవ భావముతో ఆరాధించకపోతే తనను గౌరవించనట్లేయనీ, తనను ఆరాధించనట్లే లెక్కింతునని" స్వయముగా సృష్టికర్తయైన అల్లాహ్‌యే ద్వితీయ దైవ గ్రంథములో హెచ్చరిక చేసి చెప్పియున్నట్లు తెలియుచున్నది. ద్వితీయ దైవ గ్రంథములో ఏమి చెప్పినది తెలియాలంటే ఇంజీలు గ్రంథములో యోహాన్ సువార్త ఐదవ అధ్యాయములో 21వ వాక్యము నుండి 26వ వాక్యము వరకు చూడండి.

(యోహాన్ 5-21) "తండ్రి మృతులను ఏలాగు లేపి బ్రతికించునో అలాగే కుమారుడును తన ఇష్టము వచ్చిన వారిని బ్రతికించును."

(యోహాన్ 5-22) "తండ్రి ఎవనికిని తీర్పు తీర్చడుగానీ"

(యోహాన్ 5-23) "తండ్రిని ఘనపరచునట్లుగా అందరూ కుమారున్ని ఘనపరచ వలెనని తీర్పు తీర్చుటకు సర్వాధికారము కుమారునికి అప్పగించి యున్నాడు. కుమారున్ని ఘనపరచనివాడు ఆయనను పంపిన తండ్రిని ఘనపరచడు".

(యోహాన్ 5-24) "నా మాట విని నన్ను పంపినవాని యందు విశ్వాసముంచువాడు నిత్య జీవము గలవాడు. వాడు తీర్పులోనికి రాక మరణములోనుండి జీవములోనికి దాటి యున్నాడని మీతో నిశ్చయముగా చెప్పచున్నాను."

(యోహాన్ 5-25) "మృతులు దేవుని కుమారుని శబ్దము విను గడియ వచ్చుచున్నది, ఇప్పడే వచ్చియున్నది, దానిని వినువారు జీవింతురని మీతో నిశ్చయముగా చెప్పచున్నాను".

(యోహాన్ 5-26) "తండ్రి ఏలాగు తనంతట తానే జీవము గలవాడై యున్నాడో, అలాగే కుమారుడును తనంతట తానే జీవము గలవాడై యుండుటకు కుమారునికి అధికారము అనుగ్రహించెను. మరియు ఆయన మనుష్య కుమారుడు గనుక తీర్పు తీర్చుటకు తండ్రి అధికారము అనుగ్రహించెను."

ఇదే విషయమును పోలిన సమాచారమును అంతిమ దైవగ్రంథము ఖుర్ఆన్‌లో (3-18) లో చెప్పడమైనది. అయితే చాలామంది ఈ విషయములో సూక్ష్మగ్రాహిత శక్తి లేనివారు దేవుడు తనను గురించి చెప్పుకొన్నాడని అనుకోవడము జరుగుచున్నది. ఇక్కడ బాగా ఆలోచిస్తే జ్ఞానులు, దేవదూతలు ఆ విషయమును చెప్పియుంటే అందరూ అనుకొన్నట్లు సరిపోవును. స్వయానా దేవుడు చెప్పిన విషయమును దేవ దూతలు మరియు జ్ఞానసంపన్నులు చెప్పియున్నారు. ఏకేశ్వరోపాసనను **'తౌహీద్'** అని అందురు. దేవుడు మనుషులు ఆరాధించవలసిన దేవున్ని గురించి చెప్పుటకు కారణము గలదు. మనుషులు శరీరము కల్గియున్నారు. అనగా జీవాత్మయను వారు శరీరములలో నివాసము చేయుచున్నారు. శరీరములో ఏ పనిని చేయని వాడు పరమాత్మ. ప్రపంచమును సృష్ఠించిన సృష్ఠికర్త అయిన దేవుడు ఏడు ఆకాశములను, భూమిని వాటి మధ్యలో గల సమస్తమును సృష్ఠించిన తర్వాత తాను విశ్రాంతి తీసుకొనుచూ ఏ కార్యమును చేయనివాడై పోయాడు. శరీరములో జీవున్ని కర్మరీత్యా నడిపించుటకు సంపూర్ణమైన అధికారమును శరీరములోని ఆత్మకే ఇవ్వడమైనది. ఆత్మను సృష్ఠికర్తయైన దేవుడు సర్వ విధముల మానవుల ఎడల దేవునిగా నిర్ణయించడమైనది. అప్పటినుండి ఆత్మ మానవులకు మరియు సమస్త జీవులకు దేవుడుగాయుంటూ మరియు వారి శరీరములో కార్యములు చేయుచూ కార్యకర్తగా కూడా యున్నాడు. ఈ విషయమును అంతిమ దైవ గ్రంథములో సూరా ఆరులో, ఆయత్ 102లో చెప్పడమైనది చూడండి.

**(6-102) "ఆయనే అల్లాహ్, మీ ప్రభువు. ఆయన తప్ప ఇంకొక ఆరాధ్యుడు లేడు. అందరికీ సృష్ఠికర్త ఆయనే కావున మీరు**

**అందరూ ఆయననే ఆరాధించండి. అల్లాహ్ అయిన మీకు దేవుడేకాక ప్రతి పనికి కార్యకర్తగా ఉన్నాడు."**

మనిషి శరీరములో ఆత్మయే అన్ని కార్యములను చేయుచున్నది. శరీరములో దేవుడు ఏమియూ చేయక అనగా పరమాత్మ మౌనముగా సాక్షిగా చూస్తూయున్నాడు. అట్లే జీవుడు కూడా ఏ కార్యములను చేయువాడు కాడు. జీవుడు దేవునివలె అనగా పరమాత్మవలె ఊరక ఉండడమే కాకుండా ఆత్మ ఆడించినట్లు గుణములలో అటూ ఇటూ పరుగెత్తుచూ ఆత్మ చేయగా జరిగిన పనిలోని సుఖ దుఃఖములను అనుభవించుచున్నాడు. జీవుడు శరీరములో పుట్టినది కర్మల ఫలితములను అనుభవించుటకే. అయితే అన్ని కార్యములను చేయుచూ శరీరములో దేవునిగాయున్న ఆత్మయే కార్యకర్తగా కూడా యున్నది. ఆ విషయమును (6-102) వాక్యములో చెప్పడమైనది.

సృష్ఠికర్తయైన దేవుడు తన పాలన సృష్ఠిలో సాగుటకు తనవలె నున్న ఆత్మనే దేవునిగా ప్రకటించి సర్వ అధికారములు ఆయనకు అప్పజెప్పి తనవలె తన ఆత్మను దేవునిగా ప్రకటించినట్లు ద్వితీయ దైవగ్రంథములో యోహాన్ సువార్త ఐదవ అధ్యాయములో 21 నుండి 26 వరకునున్న వాక్యములలో కలదు. అదే విషయమునే ధృవీకరిస్తూ అంతిమ దైవ గ్రంథములో సూరా మూడు ఆయత్ పదునెనిమిదిలో చెప్పడమైనది. అక్కడ కొందరు ముస్లీమ్‌లు సరిగా గ్రహించుకోలేక లేదు అల్లాహ్‌యే తననే ఆరాధించమని చెప్పాడని వాక్యములోయున్నట్లు తమకు అర్థమయినదని సృష్ఠికర్తయైన అల్లాహ్ తప్ప ఇంకొక అల్లాహ్ లేదని చెప్పవచ్చును. శరీరములో దేవునిగా నియమింపబడిన దేవున్ని లెక్కచేయక అటువంటి దేవుడు లేదని చెప్పుచుందురు. అటువంటి వారందరూ సత్యమును గ్రహించునట్లు (6-102) వాక్యము చెప్పబడినది. శరీరములో అన్ని

కార్యములు చేయువాడు జీవునికి కార్యకర్తగా యున్నవాడు మీకు దేవుడుగా యున్నాడు అని చెప్పబడినది. దీనితో దేవుడు కార్యములను చేయువాడు కాదు సాక్షిగా యున్నాడని (50-21) లో చెప్పిన వాక్యము ప్రకారము సర్వ సృష్టికర్తయైన దేవుడు ఏ కార్యము చేయనివాడై సాక్షిగా చూచువాడై యున్నాడు. సృష్టికర్తయైన దేవుడు సృష్టి తర్వాత దేవుడుగా ఆత్మను నియమించి ఈయనే మీకు ఆరాధ్య దైవము అని (3-18)లో చెప్పడమైనది. ఆత్మ సృష్టింపబడిన దేవుడు. అట్లు కాకుండా సర్వమును అనగా ప్రపంచమును సృష్టించిన దేవుడు పరమాత్మయని ఆయన సృష్టి తర్వాత తన స్థానములో ఆత్మను దేవునిగా నియమించి తర్వాత దేనికీ సంబంధము లేక, ఏ కార్యమును చేయక ఊరక ఉండిపోగా, దేవుని స్థానములో ఆత్మే దేవుడుగా ఉంటూ జీవుడు అనుభవించ వలసిన అనుభవముల కొరకు దేవుడు అయిన ఆత్మ కార్యకర్తగా పని చేయుచున్నది. ఈ విషయమంతయూ దైవగ్రంథములలో యున్నా మనుషులు తెలియకున్నారు.

దేవుడు తన గ్రంథములలో మూడు దైవగ్రంథములను చదవనప్పుడు, వాడు ఏ ధర్మము పైనా లేనట్లేయని చెప్పియున్నాడు. అయితే "మేము ముస్లీమ్ ధర్మములలో ఉన్నాము, మేము ఖుర్ఆన్‌ను తప్ప మిగతా భగవద్గీతనుగానీ, బైబిలునుగానీ ఒప్పుకోము" అని అంటున్నారు. అలాగే మిగతా మతముల వారు కూడా మేము ఏమి తక్కువ తిన్నాము అన్నట్లు "మా గ్రంథమును తప్ప ఇతర గ్రంథములను చదవము" అని అంటున్నారు. అంతేకాక మా మతమే గొప్ప, మా మత జ్ఞానమే గొప్పయను భావము అందరిలోయున్నది. వారందరికీ కనువిప్పు కల్గునట్లు దేవుడు తన గ్రంథములో మూడు గ్రంథములను చదవనివాడు మూడు గ్రంథములలో దేవుడు చెప్పిన జ్ఞానమును ఆచరించనివాడు, తన గ్రంథమును గొప్పగా

చెప్పుకొనుచుండినా అట్టివాడు ఏ మత ధర్మములో లేనట్లే, వాడు ఏ కోవకూ చెందినవాడు కాదు అన్నట్లు అంతిమ దైవగ్రంథములో సూరా ఐదు, ఆయత్ 68లో చెప్పియున్నారు చూడండి.

**(5-68) "ఓ గ్రంథవాహకులారా! మీరు తౌరాతును, ఇంజీలును, (భగవద్గీత, బైబిలును) మరియు మీ ప్రభువు తరఫున మీవద్దకు పంపబడిన దానిని (ఖుర్ఆన్ గ్రంథమును) చదివి మీ జీవితము లలో నెలకొల్పు వరకు మీరు ఏ ధర్మముపైనా లేనట్లే."**

ఈ వాక్యమును చూచిన తర్వాత అయినా ఇతర గ్రంథములను సహితము గౌరవిస్తూ మూడు గ్రంథములలోని వాక్యములను సహితము దేవుని వాక్యములుగానే లెక్కించి చూచినవాడు ఏ మతములోయున్నా వాడు దేవుని ధర్మములో యున్నట్లే. అలా ఇతర గ్రంథములలోని దైవవాక్కును లెక్కించనివాడు ఏ మతములోయున్నా వాడు దేవుని ధర్మములో లేనట్లే యగును. దీనిప్రకారము బైబిలు గ్రంథములో (యోహాన్ 5-21 నుండి 26 వరకు) గల సందేశమును గ్రహించినవాడు, దానికి అనుగుణముగాయున్న అంతిమ దైవగ్రంథము ఖుర్ఆన్‌లో (3-18) వాక్యమును సమానముగా చూడవచ్చును. అట్లే (6-102) వాక్యమును కూడా దానితో పోల్చి చూచుకోవచ్చును. ఈ విధముగా వేరువేరు గ్రంథములలో యున్న విషయములను ఒక్కచోట చేర్చి చూచుకోవడము వలన దేవుని మాటలలోని సత్యము తెలియును. ఇప్పుడు ఈ మూడు వాక్యముల వలన సృష్టికర్తయైన అల్లాహ్ మరో సృష్టికర్తయైన అల్లాహ్‌ను స్వయముగా తన అధికారమిచ్చి నియమించాడని చెప్పుటకు పూర్తి సాక్ష్యము దొరుకును. సర్వలోకములను అనగా మొత్తము ప్రపంచమును సృష్టించిన వాడు అల్లాహ్ ఆయనే మొదటి దేవుడు. తర్వాత దేవుడుగా నియమింపబడిన

ఆత్మ, దేవుని చేత సృష్ఠింపబడినవాడు, అందువలన ఆత్మదేవునికి ధర్మములు గలవు. మొదట దేవునికి ధర్మములు లేవు. ఆయన ధర్మాలకు అతీతుడు, ధర్మముల వలన తెలియబడునని చెప్పలేము. ఎందుకనగా! ఆయనకు ధర్మములు లేవు. సృష్ఠింపబడిన దేవునికి ధర్మములు కలవు. ఆయన ధర్మముల వలన తెలియబడును.

మనము గ్రంథ ప్రారంభములోనే ధర్మములుగల దేవుడు, ధర్మములు లేని దేవుడు అని రెండు రకముల చెప్పుకొన్నాము. మూడు దైవ గ్రంథములలో చెప్పిన ప్రకారము మనుషులకు ఆరాధ్య దైవము దేవుడు ఒక్కడే. అయితే ధర్మములు గల దేవుడే మానవులందరికీ దేవుడని మూడు దైవ గ్రంథములు చెప్పాయి. భగవద్గీతలో దేవుని ధర్మములు సంపూర్ణముగా గలవు. ఒక్క భగవద్గీతయందే కాకుండా మిగతా రెండు దైవ గ్రంథములయిన బైబిలులో, ఖుర్‌ఆన్‌లో ధర్మములుగల దేవున్ని గురించి చెప్పారు. ధర్మముల ప్రకారమే దేవుడు తెలియునని, ధర్మముల ప్రకారము ఆచరించినప్పుడు కర్మ నశించి కర్మరహితుడగుననీ, కర్మరహితమైన తర్వాత దేవుడు తెలియబడునని చెప్పారు. మనిషి ధర్మములను తెలిసి ఆచరించగలిగినప్పుడు కర్మ అంటక పోయి కర్మయోగమగునని, ధర్మముల ద్వారా యోగము లభ్యము కాగా కర్మ నాశనమవుతూ పోయి చివరకు జీవునికి మోక్షము లభించునని చెప్పబడియున్నది. కర్మయోగమునకు సంబంధించిన జ్ఞానము భగవద్గీతలో మూడు నాలుగు వందల శ్లోకములలో కలదు. ధర్మముల వలననే లభించు బ్రహ్మయోగము కొన్ని శ్లోకములలోనే చెప్పబడియున్నది. ధర్మముల వలన ఆచరించబడు కర్మయోగము ఎట్లు కలదో ఉదాహరణకు మోక్ష సన్న్యాస యోగము అను అధ్యాయములో 17వ శ్లోకమును చూస్తాము.

శ్లో॥ యస్య నాహంకృతోభావో బుద్ధి ర్యస్య న లిప్యతే।
హత్వాపి స ఇమాన్ లోకాన్న హన్తి ననిబధ్యతే॥

**భావము :- "ఎవని భావములో అహంకారము లేదో, ఫలితము మీద ఎవనికి ఆసక్తి లేదో వాడు ఈ లోకములోయుండే వారినందరిని చంపినా అతడు హంతకుడు కాడు. హత్యా పాపము వానికి అంటదు".**

దేవుని ధర్మము ప్రకారము మనిషి భావములో నేను చేయుచున్నానని అహంకారము లేకుండా యుండడము కర్మయోగమగును. అట్లే మనస్సు పని చేయకపోతే బ్రహ్మయోగమగును. ఈ రెండు ధర్మయుక్త యోగములే. దేవుని ధర్మము ప్రకారము ఈ రెండు యోగములు కలవు. శరీరములోని జీవున్ని నడుపు ఆత్మే జీవునికి దేవుడుగాయున్నాడు. జీవునికి స్థానము శరీరము. అందువలన శరీరములో అధిపతియైన ఆత్మే జీవునికి దేవునిగా నియమింపబడియున్నది. ధర్మములులేని దేవుడు, ధర్మములున్న దేవున్ని శరీరములో నియమించాడు. ప్రపంచమును సృష్ఠించిన దేవుడు తాను సృష్ఠించిన ఆత్మను దేవునిగా నియమించాడు. **"సృష్ఠించబడిన ప్రతి దానికి ధర్మములుండును"** అను సూత్రము ప్రకారము శరీరములలో మనుషులకు, జీవరాసులకు శరీరము ధరించిన సమస్త ప్రాణులకు ఆత్మే దేవుడుగా యున్నాడు. ఆత్మకు ఆత్మ ధర్మములంటూ కొన్ని గలవు. వాటినే దైవ ధర్మములు, దేవుని ధర్మములు అని అంటున్నాము. శరీరములోని దైవ ధర్మముల ప్రకారము కర్మయోగము, బ్రహ్మయోగము అనునవి కలవని చెప్పాము.

దేవున్ని తెలియుటకు ధర్మములతో కూడిన యోగములు రెండు గలవు. అలాగే ధర్మములేని యోగము కూడా ఒకటి గలదు. ధర్మయుక్తమైన యోగములు రెండు వరుసగా కర్మయోగము, బ్రహ్మయోగము కాగా ధర్మ

రహిత యోగము భక్తి యోగము గలదు. యోగములు మొత్తము మూడు గలవు. ధర్మములు గల యోగము వలన సృష్టింపబడిన శరీరములోని దేవున్ని తెలియవచ్చును. ఈ రెండు యోగములు తెలియగలిగిన వానికి భక్తి యోగము అంటే ఏమిటో తెలియును. భక్తి యోగము ధర్మరహిత యోగము అని చెప్పాము కదా! దానిని గురించి భగవద్గీతలో మోక్ష సన్యాస యోగమున అరవై ఆరవ (66) శ్లోకములో ఏమి చెప్పారో చూడండి.

శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః ॥

**భావము :- "సర్వ ధర్మములను సంపూర్ణముగా విడచిపెట్టి నీవు నన్ను మాత్రమే నమ్ముకొనుము. నిన్ను కర్మలనుండి బయటపడవేస్తాను. నీ బాధలన్నీ వదలి నీవు మోక్షమును పొందగలవు".**

ఈ భక్తియోగమునకు సంబంధించిన శ్లోకములు భగవద్గీతయంతా వెదకినా రెండే గలవు. ఒకటి భక్తియోగము అను అధ్యాయములో పదవ శ్లోకము, మోక్షసన్యాస యోగములో అరవై ఆరవ శ్లోకము రెండేగలవని చెప్పవచ్చును. భగవద్గీతలో అధిక భాగము కర్మయోగమునకు సంబంధించిన శ్లోకములు గలవు. కొన్ని పదులలో మాత్రము బ్రహ్మయోగమునకు సంబంధించిన శ్లోకములు గలవు. అట్లే భక్తియోగమునకు సంబంధించినవి రెండే గలవని చెప్పవచ్చును. ధర్మములతో కూడిన కర్మ, బ్రహ్మ యోగములు తెలిసిన వానికే తదుపరి భక్తియోగము తెలియగలదు. ధర్మయుక్తమైన కర్మ, బ్రహ్మయోగములు తెలియనిదే భక్తియోగము తెలియబడదు. ఏమాత్రము అవగాహనకు రాదు. అట్లే ధర్మయుక్తమైన ఆత్మదేవుడు తెలియనంతవరకు సృష్టికర్తయైన పరమాత్మ తెలియడు.

**ప్రశ్న :- సర్వ ప్రపంచమును సృష్టించినవాడు దేవుడు. ప్రపంచమును సృష్టించిన దేవుడు ఎవరి చేత సృష్టింపబడలేదు. ఆయన ఆత్మనే దేవునిగా నియమించి జగత్తు జరుగునట్లు చేశాడు. ఆత్మ దేవుడుగా సృష్టింపబడినాడు. దేవుడు ఒక్కడే సృష్టికర్త, ఆత్మ సృష్టికర్త కాదు కదా! సృష్టికర్త అయినవాడే కార్యకర్తగా యున్నాడని (6-102) లో చెప్పినట్లు కలదు. సృష్టికర్త ఒక్కడే కదా! ఇద్దరు సృష్టికర్తలు లేరు కదా! (6-102) వాక్యములో "ఈయన తప్ప వేరే ఆరాధ్యుడు లేడు. ఈయనే సర్వులకు సృష్టికర్తయైన దేవుడు మరియు ఈయనే కార్యకర్తగా యున్నాడు". అని చెప్పబడియున్నది కదా! మనుషులు ఆరాధించవలసిన దేవుడు శరీరములో కార్యకర్తయైతే ఆయనను సృష్టికర్తయని వాక్యములో చెప్పియుండుటను బట్టి ఈ వాక్యమును మీరే తప్పుగా అర్థము చేసుకొని ఉంటారని మేము అనుకొంటున్నాము. దీనికి మీరేమంటారు?**

**జవాబు :-** ఆత్మను దేవునిగా సృష్టించినవాడు ఒక్కడే సృష్టికర్త అనుమాట సత్యమే అయినా మనిషి ఎంతో గ్రాహితశక్తితో అర్థము చేసుకోవలసి యున్నది. దేవుడు ఆదిలో సమస్త ప్రపంచమును సృష్టించిన మాట వాస్తవమే. అయితే సృష్టి జరిగిన తర్వాత ఆత్మను దేవునిగా నియమించి దేవుడు అనగా పరమాత్మ మొదట సృష్టి తర్వాత ఏ పనిని చేయక ఊరక ఉండి పోయాడు. అప్పటినుండి తాను చేయవలసిన పనినంత తన ఆత్మకు అప్పజెప్పి తన ఆత్మనే దేవునిగా, అధిపతిగా నియమించి తాను ఎవరికీ తెలియనట్లు శరీరము లోపల, బయట సాక్షిగా యుండిపోయాడు. అప్పటినుండి సృష్టి కార్యమును ఆత్మయే చేయుచున్నది. సకల జీవరాసుల చావుపుట్టుకలను ఆత్మ ప్రకృతితో కూడి చేయుచున్నది. ఆత్మ నిత్యము పుట్టువారికి తండ్రిగా యున్నాడు. అయితే పరమాత్మ అయిన దేవుడు

మొదట పంచభూత ప్రపంచమును సృష్టించాడు. తర్వాత జీవరాసుల సృష్టిని ఆత్మకే అప్పజెప్పాడు. అప్పటినుండి ఆత్మే సకల జీవరాసులను సృష్టించుచున్నది. ప్రకృతి సకల జీవుల శరీరములకు తల్లికాగా బీజదాతయైన ఆత్మ అందరికీ తండ్రిగా యున్నాడు. ఈ విషయము భగవద్గీతలో గుణత్రయ విభాగ యోగము అను అధ్యాయమున 3, 4 శ్లోకములలో చెప్పారు చూడండి.

శ్లో॥ 3. మమ యోని ర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధామ్యహమ్ ।
సంభవ స్సర్వ భూతానాం తతో భవతి భారత ॥

శ్లో॥ 4 . సర్వయోనిషు కౌంతేయ! మూర్తయః సంభవంతి యాః ।
తాసాం బ్రహ్మ మహద్యోనిః అహం బీజప్రదః పితా ॥

**భావము :- ప్రకృతి గర్భము కలదిగా ఉండగా నేను దానికి బీజదాతగా యున్నాను. అందువలన సమస్త జీవరాసులు నా వలననే పుట్టుచున్నారు. సర్వ గర్భములయందు జన్మించు ఏ జీవరాసికయినా తల్లి ప్రకృతికాగా నేను తండ్రిగా ఉన్నాను.**

ఆత్మను సృష్టించిన పరమాత్మ ప్రపంచమును సృష్టించగా తర్వాత జీవరాసులను సృష్టించు బాధ్యత ఆత్మకు అప్పజెప్పబడినది. అప్పటినుండి ఆత్మ జీవరాసుల విషయములో సృష్టికర్తగా మారిపోయినది. పరమాత్మ పంచభూత ప్రపంచమును తయారు చేశాడు. తర్వాత ఆయన కార్యములు చేయువాడుగా కాకుండా దృశ్యములు చూచేవాడుగా నిలచిపోయాడు. తర్వాత దేవుడుగా బాధ్యతలను స్వీకరించిన ఆత్మ జీవరాసులను సృష్టించినది. శరీరములను ప్రకృతి తయారు చేయగా అందులో జీవాత్మలను

నింపుచూ  శరీరములో స్వయానా ఆత్మయే కార్యకర్తగా ఉండిపోయినది. ఆత్మ అలా ఉండుట వలన “ఆయనే సృష్ఠికర్త, ఆయనే తండ్రి, ఆయనే దేవుడు” అని ఆత్మనే చెప్పవలసి వచ్చినది.  అందువలన (6-102) వ వాక్యములో ఆత్మే దేవుడని చెప్పడమేకాక **“ఆయన సర్వులకు సృష్ఠికర్తగా యున్నాడనీ, అంతేకాక కార్యకర్తగా కూడా ఉన్నాడని”** చెప్పడమైనది.  దైవ గ్రంథములలో పరమాత్మను, ఆత్మను ఇద్దరినీ సృష్ఠికర్తయని చెప్పారు.  అయితే ఎవరు దేనిని సృష్ఠించినది కూడా సూచాయగా చెప్పియున్నారు.  మేము గ్రంథములోని విషయమును అర్థము చేసుకొన్నాము.  కావున ఎవరు దేనిని సృష్ఠించారో చెప్పుచున్నాము.  దేవుడు చెప్పిన వాక్యము అర్థము కాకపోతే  దేవుని జ్ఞానము సరిగా అర్థము కాదు.  అందువలన ముందు దేవుడు తన గ్రంథములలో ఏమి చెప్పాడో జాగ్రత్తగా చూడవలసియున్నది. అలా చూచిన పరమాత్మదేవుడు, ఆత్మదేవుడు ఇద్దరుండగా పరమాత్మదేవుడు మానవులు ఆరాధించవలసిన దేవుడు ఆత్మదేవుడని చెప్పి,  ఆత్మను దైవముగా కొనసాగునట్లు చేసి,  తాను ఎవరికీ తెలియని వానిగా కార్యమును చేయక స్థబ్దతగా ఉండిపోయాడు.

పరమాత్మ దేవుడు  ఆత్మ దేవున్ని నియమించాడని అన్ని అధికారములు ఆత్మకు ఇచ్చి ఆయనే (ఆత్మనే) మీకు ఆరాధ్యదైవమని చెప్పియుండగా ఇద్దరు దేవుళ్ళలో మనుషులమయిన మనము  ఆరాధించవలసిన దేవుడు ఆత్మేనని ఇంతవరకు ఎవరికీ తెలియకుండా పోయినది.  అందరికీ దేవుడు ఒక్కడేయను మాట వాస్తవమే అయినా  ఆ దేవుడు ఎవరో ఎవరికీ తెలియదు. ప్రస్తుత కాలములో ముస్లీమ్‌లు ఒక్క దేవున్నే విశ్వసించారు. ఒక్క దేవున్నే నమాజ్ చేస్తున్నారు.  అంతవరకు అన్నీ బాగున్నాయి.  ఆ ఒక్క దేవున్నే పని చేయువాడు కాదని చెప్పుచున్నారు.  తర్వాత కొన్ని

సమయములలో దేవుడే అన్నీ చేయుచున్నాడని చెప్పుచున్నారు. దానితో వారికే దేవుడు పని చేయువాడా? పని చేయనివాడా!యని పూర్తి తెలియకున్నది. ఖుర్ఆన్ గ్రంథములో కూడా రెండవ సూరా 117వ ఆయత్‌లో **"దేవుడు పనిచేయడు ఆయనది సంకల్పము మాత్రమే గలదని"** చెప్పబడియున్నది. దానికి వ్యతిరేఖముగా సూరా 32 ఆయత్ 4 (32-4) లోనూ మరియు (2-255) ఆయత్‌లోనూ **"దేవుడు పని చేయును"** అని వ్రాయబడియున్నది. దైవగ్రంథములో ఇద్దరు దేవుళ్లను చెప్పియున్నారు కావున ఒక దేవుడు పనిచేయడనీ, ఒక దేవుడు పనిని చేయుననీ చెప్పడమైనది. అయితే భూమిమీద మనుషులకందరికీ దేవుడు రెండుగా యున్నాడని మాత్రము తెలియదు. అంతో ఇంతో జ్ఞానము తెలుసును అన్నవారందరూ దేవుడు ఒక్కడేయనీ ఒక్కనినే ఆరాధించవలెనని చెప్పుచుందురు. ఒక్కనినే ఆరాధించ వలెననునది సత్యమే అయితే దానిని ఆధారము చేసుకొని దేవుడు ఒక్కడేయని చెప్పడము పూర్తి అసత్యమగును.

దైవగ్రంథములో దేవుడు రెండు విధముల ఉన్నాడని చెప్పబడినది. అట్లే ధర్మములుగల దేవుడు, ధర్మములు లేని దేవుడు అని రెండు రకముల దేవుడున్నాడని మూడు దైవ గ్రంథములలో వ్రాయబడియున్నది. అట్లే కార్యములు చేయుచూ కార్యకర్తగాయున్న దేవుడు, ఏ కార్యము చేయక కొన్ని సందర్భములలో మాత్రము **'అయిపో'** యని సంకల్పము చేయగా కొన్ని పనులు జరుగునని దేవుడు క్రియాశీలుడు, క్రియారహితుడని రెండు రకముల చెప్పబడినది. అయితే దేవుడు ఒక్కడేయను మాట మాత్రము కొందరు చెప్పగలుగుచున్నారు తప్ప దేవుడు ఇద్దరని ఏమాత్రము ఎవరికీ తెలియదు. మాకు జ్ఞానము తెలియును అనువాడు దేవుడు ఒక్కడేయని అంటున్నాడు. అట్లే మేము ఒకే దేవున్ని ఆరాధిస్తున్నామని చెప్పువారు

కూడా రెండవ దేవుడున్నాడని తెలియకున్నారు. జ్ఞానము తెలియని వారికి ఒకడు ఇద్దరు అని లెక్కలేదు వారికి ఎందరయినా ఉండవచ్చును. దేవుడు కాని వారినందరినీ దేవుడని తలచుచుందురు. చివరికి దయ్యాలను కూడా దేవుళ్లని పూజించువారు కలరు. హిందువులలో బహుదేవతారాధన కలదు. ముస్లీమ్‌లలో ఏకేశ్వరోపాసన గలదు. క్రైస్థవులలో కూడా ఒకే దేవుని నినాదమే గలదుగానీ ప్రపంచములో ఏ మతస్థులుగానీ, ఎంత జ్ఞానులుగానీ దేవుడు రెండు విధముల ఉన్నాడనీ, అయితే మనము ఆరాధించవలసినది ఒక్క దేవున్నేయని చెప్పలేకపోవుచున్నారు.

ఇంతకుముందు దేవుడు ధర్మములు గలవాడు, ధర్మములు లేనివాడని చెప్పుకొన్నాము. ధర్మములు గల వానికి సంబంధించిన శ్లోకమును మోక్ష సన్న్యాస యోగములో 17వ శ్లోకములో చెప్పుకొన్నాము. అట్లే దేవుడు ధర్మములు లేనివాడని చెప్పుటకు మోక్షసన్న్యాస యోగములోనే 66వ శ్లోకమును చెప్పుకొన్నాము. ఇప్పుడు మేము చెప్పితే క్రొత్తగా దేవుడు ధర్మయుక్తుడు, ధర్మరహితుడు అని తెలియుచున్నది. అట్లే మేము చెప్పితే దేవుడు క్రియాశీలుడు, క్రియారహితుడని తెలియుచున్నది. దేవుడు క్రియారహితుడు అని తెలియుటకు ఖుర్‌ఆన్ గ్రంథములో సూరా రెండు, ఆయత్ 117లో ఇలా చెప్పబడినది చూడండి.

**(2-117) "భూమి ఆకాశమును ప్రప్రథమముగా సృష్టించినవాడు దేవుడే. ఆయన ఏ పనినయినా చేయదలచుకొన్నప్పుడు దానిని అయిపో అంటే అయిపోతుంది."**

ఈ వాక్యములో దేవుడు పనిని చేయువాడు కాడు. ఏదయినా అవసరమొస్తే దానిని చేయదలచుకొన్నప్పుడు **'అయిపో'** అంటే అదే జరిగి

పోతుంది. దీనినిబట్టి **"ఒక దేవుడు పనిని చేయడు"** అని తెలిసిపోవుచున్నది. సృష్టిని మొదట సృష్టించిన పరమాత్మయనబడు దేవుడు పనులు చేయువాడు కాదనీ, క్రియారహితుడనీ చెప్పుకొన్నాము. ఏ సందర్భములో అయినా ఆయన ఏ కార్యమునయినా చేయవలసివస్తే ఆయన ప్రత్యక్షముగా పనిని చేయక, పరోక్షముగా చేయువాడై దానిని 'అయిపో' అని సంకల్పించుకోగా అది జరిగిపోవును. పరమాత్మ అయిన దేవుడు సంకల్పములతోనే చేయును గానీ ప్రత్యక్షముగా చేయువాడు కాదని తెలిసిపోయినది. మరొక దేవుడు శరీరములో ఒక్క సెకండు కూడా ఊరక ఉండక పనిని ప్రత్యక్షముగా చేయుచున్నాడు. ఆ విషయమును అంతిమ దైవగ్రంథము ఖుర్ఆన్‌లో సూరా 32 ఆయత్ 4లో చూడండి.

**(32-4) "అల్లాహ్‌యే (దేవుడే) ఆకాశాలను, భూమిని వాటి మధ్యనున్న సమస్తమును ఆరు రోజులలో సృష్టించాడు. తర్వాత సింహాసనాన్ని (అర్ష్‌ను) అధిష్ఠించాడు. ఆయన తప్ప మీకు ఏ సహాయకుడు, మరి ఏ సిఫారసు చేసేవాడు లేడు. అయినా మీరు హితబోధను గ్రహించరేమిటి?"**

అదే గ్రంథములో సూరా 2, ఆయత్ 255లో ఎల్లవేళల పనిని చేయుచున్నాడని అయినా ఆయనకు అలసట లేదని చెప్పియున్నారు. అంతేకాక శరీరము మొత్తము ఆయన ఆధీనములో ఉన్నదని కూడా చెప్పారు చూడండి.

**(2-255) "అల్లాహ్ మాత్రమే నిజానికి ఆరాధ్యదైవము. ఆయన తప్ప మరో ఆరాధ్యుడు లేనేలేడు. ఆయన సజీవుడు, అన్నిటికీ**

**మూలాధారము. ఆయనకు కునుకుగానీ, నిద్రగానీ పట్టదు. భూమి ఆకాశములలో ఉన్న సమస్తము ఆయన ఆధీనములో ఉంది. ఆయన అనుమతి లేకుండా ఆయన సమక్షములో సిఫారసు చేయగలవాడెవడు? వారికి ముందు ఉన్న దానిని వెనుక ఉన్నదానిని కూడా ఆయనకు తెలుసు. ఆయన కోరినది తప్ప ఆయనకున్న జ్ఞానములోని ఏ విషయము వారి గ్రాహ్యపరిధిలోనికి రాదు. ఆయన కుర్చీ వైశాల్యము భూమ్యాకాశాలను చుట్టుముట్టి యుంది. వాటిని రక్షించటానికి ఆయన ఎన్నడూ అలసిపోడు. ఆయన సర్వోన్నతుడు, గొప్పవాడు."**

ఈ ఆయత్ పనిచేయు దేవున్ని గురించి చెప్పినదని తెలియుచున్నది. పనిని చేయు దేవుడే ఆరాధ్య దైవము అని మాటిమాటికి చెప్పబడినది. ఈ ఆయత్‌లో **"ఆయన సజీవుడు"** అనే పదము వాడబడినది. సజీవుడు అనగా జీవము గలవాడైయున్నాడు అని చెప్పవచ్చును. వాస్తవానికి ఆయన జీవునికంటే వేరుగా యున్నాడు. అంతేకాక జీవుని కొరకు జీవునితోపాటు శరీరములో యున్నాడు. అందువలన 'జీవునితో సహా ఉన్నాడు' అని చెప్పుటకు **'సజీవుడు'** అను పదమును వాడారు. 'సవాసి' అంటే వానితో పాటు ఉండేవాడు అని అర్థము. అలాగే సజీవుడు అనగా జీవునితో పాటు ఉండేవాడని గ్రహించుకోవాలి. జీవునితో పాటు శరీరములో గలది ఆత్మయే. జీవాత్మ ఎక్కడ ఉండునో ఆత్మ అక్కడ ఉండును. జీవున్ని కర్మ ప్రకారము నడుపువాడు ఆత్మయే. జీవుడు శరీరములో తలయందు ఒక చోట గుణచక్రమందు ఉండగా, జీవుడు కర్మలను అనుభవించుటకు కావలసిన పనిని ఆత్మ చేయుచూ అందులో వచ్చిన సుఖదుఃఖములను అనుభవింప జేయుచున్నది. శరీరములో ఆత్మ అంతటా వ్యాపించియున్నది. శరీరమంతా

వ్యాపించిన ఆత్మ శరీరములోని ప్రతి భాగమును తన ఆధీనములో ఉంచుకొన్నది. ఆత్మ అనుమతి లేకుండా ఏ శరీర భాగము పని చేయదు. ఆత్మ జీవుడున్న ప్రతి శరీరములోనూ జీవునితోపాటు జీవునికి జోడు ఆత్మగా, స్నేహితుడుగా, పొరుగువానిగా, ప్రక్కనే గలవానిగా ఉన్నది కావున ముందు జీవుడున్న జన్మను తెలిసియున్నది. అట్లే రాబోవు జన్మను కూడా తెలిసియున్నది. జీవునికున్న కర్మ ఆత్మకు తలలోని కర్మ చక్రములో కనిపించుచున్నది. కావున రాబోవు జన్మ కూడా తెలియుచున్నది. అందువలన వాక్యములో "ముందు ఉన్న దానిని, వెనుక ఉన్నదానిని కూడా ఆయనకు తెలుసునని" చెప్పారు. దేవుడయిన ఆత్మయే శరీరములోని బుద్ధికి బలమునిచ్చి ఏ విషయమునయినా గ్రహించునట్లు చేయుచున్నాడు. అందువలన ఆత్మ అనుకొంటేనే ఏదయినా అర్థము కాగలదు. ఆత్మ అనుకోకపోతే **ఏదీ** చిన్న విషయము కూడా అర్థము కాదు. అందువలన వాక్యములో "ఆయన జ్ఞానములో ఆయన కోరినది తప్ప ఏదీ గ్రాహ్యపరిధి లోనికి రాదు" అన్నారు. ఆయన అనగా ఆత్మ నివాసము శరీరములో పాదములు మొదలుకొని తలవరకు అంతటా వ్యాపించియున్నది. ఆయన శరీరములో అంతటా వ్యాపించియున్నాడు కావున "ఆయన కుర్చీ భూమ్యాకాశాలను చుట్టుముట్టియున్నదని" అన్నారు. ఇక్కడ భూమి అనగా పాదములుయనీ, ఆకాశము అనగా తలయనీ అర్థము చేసుకోవాలి. పాదములు మొదలుకొని తలవరకు ఆత్మ వ్యాపించియుండుట వలన భూమ్యాకాశాలను చుట్టుముట్టియుంది అని చెప్పడమైనది. శరీరములో అంతటా వ్యాపించిన ఆత్మ, పుట్టింది మొదలు చనిపోవువరకు ఒక క్షణ కాలము కూడా ఊరకయుండక శ్వాసను, గుండెను ఆడించుచున్నాడు. అట్లే అప్పుడప్పుడు మెలుకువలో బయట కార్యములను కర్మేంద్రియములతో

చేయించుచున్నాడు. శ్వాస ఆడించి శరీరమును రక్షించడములోనూ బయటి పనులు చేయించుచూ, జీవనోపాధి కల్పించుటలోనూ ఆత్మ ఎల్లవేళలా కార్యకర్తగా ఉండడమేకాక ఆయన ఎప్పుడూ అలసిపోలేదు. అదే విషయమునే వాక్యములో "ఆయన ఎప్పుడూ అలసిపోడు" అని చెప్పారు. శరీరములో నున్న సమస్త అవయవములకంటే మరియు జీవాత్మకంటే గొప్పవాడు అయినందున వాక్యము చివరిలో "ఆయన మహోన్నతుడు, గొప్పవాడు" అని చెప్పారు.

ఈ విధముగా పనిని చేయు దేవున్ని గురించి చెప్పారు. పనిని చేయని దేవుడు సాక్షిగాయున్నాడని ముందే చెప్పుకొన్నాము. ధర్మములుగల దేవున్ని, ధర్మములు లేని దేవునికి సంబంధించిన భగవద్గీత శ్లోకములను మోక్ష సన్న్యాస యోగములోని 17, 66వ శ్లోకములలో చెప్పాము. ఇప్పుడు పని చేయని దేవున్ని ఖుర్ఆన్ గ్రంథములో (2-117) ఆయత్‌లో ఉన్నట్లు చెప్పాము. పని చేసే దేవున్ని (32-4) లోను, (2-255) లోను ఉన్నట్లు చెప్పాము. అట్లే సృష్టింపబడని దేవుడు సృష్టించిన దేవుడు ఇద్దరుగల సమాచారమును బైబిలులో యోహాన్ సువార్త 5వ అధ్యాయమున 21వ వాక్యమునుండి 26వ వాక్యము వరకు ఉన్న దానిని విపులముగా చెప్పాము. ఈ విధముగా మూడు దైవగ్రంథములలోని నిరూపణలను సాక్ష్యముగా చూపాము. మేము చూపినా చూపకున్నా మూడు దైవగ్రంథములలోను ఇద్దరు దేవుళ్ళను గురించి చెప్పిన విషయము అందరివద్ద వారివారి మత గ్రంథములుగా చెప్పుకొంటున్న గ్రంథములలో కలదు. మేము ప్రత్యేకము, మా గ్రంథము ప్రత్యేకము. మాకంటే నిజమైన జ్ఞానులు, భక్తులు లేరు అనువారు వారి గ్రంథములలో యున్న సత్యమును ఎందుకు తెలియలేక పోయారు? అని అడిగితే సమాధానము చెప్పలేని స్థితిలో ఉన్నారు.

ప్రశ్న :- నేడు భూమిమీద ఎందరో జ్ఞానులు, జ్ఞాన సంపన్నులైన స్వామీజీలు, యోగులు, మహర్షులు అయిన గొప్పవారున్నారు. మీరు చెప్పు ఇద్దరు దేవుళ్ళ విషయము ఎవరూ చెప్పలేదు, ఎవరికీ తెలియదు. ముస్లీమ్‌లు కొందరు అల్లాహ్ మీద భక్తితో ఐదుపూటల నమాజ్ చేస్తున్నారు. ఎన్నో నియమాలు పాటిస్తున్నారు. దేవుడు అంటే ఎంతో భయముతో నిజమైన భక్తికల్గి అల్లాహ్‌ను విశ్వసించి యున్నారు. అటువంటి వారికి దేవుని సన్నిధానము దొరుకును. వారికి దేవుడు ముక్తిని కల్గించును. మనుషులకు దేవుని మీద ఎంత శ్రద్ధయుందో దేవునికి కూడా మనుషుల మీద అంతే శ్రద్ధయుండును. సక్రమమైన భక్తి, సక్రమమైన నమాజ్ చేయువారికి ముక్తి లభించును. పరలోక ప్రాప్తి (ముక్తి) కొరకే కదా! మానవుడు దేవుని మార్గములో ప్రయాణించుచున్నది. దేవుని మార్గములో పయణించు వానికి తప్పక ముక్తి లభించునని అనుకొంటున్నారు. మీరు చెప్పిన ఇద్దరు దేవుళ్ళ విషయము తెలియకపోయినా నష్టము ఏమీ లేదు కదా! దేవుడు "నన్నే మ్రొక్కు, నన్నే పొందుదువు, ఏమాత్రము సంశయము లేదు" అని చెప్పిన మాట వ్యర్థమగునా? ముస్లీమ్‌లు దేవుడు (అల్లాహ్) చెప్పిన మాట ప్రకారమే ఆచరించుచూ దేవుని మార్గములో ప్రయాణించుచున్నారు కదా! వారు దేవుడు ఒక్కడేయను విశ్వాసముతో యున్నారు. దీనికి మీరేమంటారు?

**జవాబు :-** గ్రంథములో ఒకే దేవుడు ఆరాధ్య దైవముగా ఉండవలెననీ, రెండవ వానిని ఎవరినీ ఆరాధించకూడదని చెప్పారు. దానిప్రకారము ఉండడము మంచిదే అయితే మోక్షమునకు అధికారి ఎవరు? అన్న విషయము తెలుసునాయని అడుగుచున్నాను. ఇక్కడ విషయము అర్థమగుటకు ఒక చిన్న ఉపమానమును చెప్పుకొందాము. ఒక పెద్ద

భవనములో నేను లేక నీవు నివశించుచున్నామనుకో. ఆ భవనమునకు అధిపతి O (ఒ) అనే వాడు అనుకొనుము. అతడు భవన బాధ్యతలన్నీ C (సి) అనే వానికి అప్పజెప్పి ప్రక్క దేశమునకు పోయాడు. O లో C అనేవాడు సగమే ఉన్నాడని చూపుకే తెలియుచున్నది. O ఇంటికి యజమాని అయితే C అనువాడు ఇంటి బాధ్యతలన్నీ చూచువాడు. ఆ ఇంటిని శుభ్రము చేయు పనిమనిషిగా కూడా C అనేవాడే యున్నాడు. ఇంటికి తాత్కాలిక యజమానిగా ఉంటూ ఇతరులకు ఇంటిని కిరాయికి ఇవ్వడమేకాక అదే ఇంటిలో పని మనిషిగా యుంటూ ఇంటిలోని పనులన్నీ C అనే వ్యక్తి బాధ్యతగా చేసుకోవడము జరిగెడిది. ఇంటిలో కిరాయికి సి లో సగమే ఉన్న I (ఐ) కి మాత్రమే ఇచ్చెడివాడు. ఇల్లు కిరాయికి ఇచ్చినవాడు అప్పటికి యజమాని మరియు పని మనిషికాగా, I అనువాడు కిరాయికి ఉంటూ తనదే ఇల్లు అన్నట్లు ప్రవర్తించుచుండెను. అదంతయూ ఇంటిలోనే పనిచేయుచున్న C చూస్తూయున్నా, I అనేవాడు ఏమనుకుంటే మనకేమి, వాడు అన్యాయముగా అనుకొన్నా, మాట్లాడినా వానికే పాపము వస్తుందిలేయని అనుకొన్నాడు. అంతేకాక నేను ఇంటిలోనే ఉన్నాను కదా! నా ఇష్టమొచ్చినప్పుడు వానిని నేను ఇల్లు వదలి బయటికి పొమ్మనగలనని అనుకొన్నాడు. O (ఒ) ఇంటికి శాశ్విత యజమానికాగా, O (ఒ) లో సగముగా యున్న C (సి) తాత్కాలిక యజమానిగా ఉన్నాడు. ఇంటిలో బాడిగకు (కిరాయికి) ఉన్నవాడు C (సి) లో సగముగా యున్న I (ఐ) అనేవాడు.

శాశ్విత యజమాని అయిన O తో తాత్కాలిక యజమాని C అప్పుడప్పుడు ఫోన్‌లో మాట్లాడుచూ తాను ఇంటిలో అన్ని పనులు చేయుచున్నాను. ఇంటిలో కిరాయికున్నవాడు తనదే ఇల్లన్నట్లు, తానే

నిజమైన యజమాని అను భావముతో యున్నాడని చెప్పుచుండెను. O కు C చెప్పినా, చెప్పకున్నా I అనేవాడు C అనేవాడు ఇద్దరూ ఇంటిలో ఎట్లున్నది O అను యజమానికి ఎప్పటికప్పుడు తెలిసిపోవుచుండెను. ఇంటికి శాశ్విత యజమాని అయిన O తన ఇంటితో సంబంధము లేకుండా దూరముగా యున్నా, తన ఇంటి సమాచారము తెలియునట్లు ఇల్లంతయూ సిసి కెమెరాలు, ఆడియో సౌండ్‌తో సహా తెలియునట్లు అమర్చి పెట్టుకోవడము వలన తన ఇంటి సమాచారము ప్రతి క్షణము తెలిసిపోయేది. తెలియని కొదవలు తాను ఇంటి యజమానిగా నియమించి పెట్టిన C (సి) అనే వాడు చెప్పేవాడు. ఇట్లు పూర్తి యజమాని అయిన O తాత్కాలిక యజమాని అయిన C తో సంబంధము పెట్టుకొనియుండగా I అనేవాడు ఇంటిలో కిరాయికి కాపురమున్నాడు. తనది కాని ఇల్లును తనది అన్నట్లు కిరాయికి ఉండే I అనుకొనేవాడు.

1) ఈ కథలో O అనువాడు **పరమాత్మ** అని గ్రహించుకోవాలి.

2) C అనువాడు శరీరములో దేవునిగా మరియు కార్యకర్తగా యున్న **ఆత్మ**ని తెలియవలెను.

3) I (ఐ) అనువాడు శరీరములో కిరాయికి నివశించు **జీవునిగా** అర్థము చేసుకోవాలి.

4) అద్దె ఇల్లు **శరీరము**గా తలచవలెను. జీవుడు అద్దె ఇల్లయిన శరీరములోనే నివశించుచున్నాడు.

ప్రకృతితో తయారు చేయబడినది ఇల్లుకాగా, శరీరమను ఇల్లుకు యజమాని, ఇల్లు నమూనా చేసి ఇంటిని నమూనా ప్రకారము తయారు

చేసినవాడు ఆత్మకాగా ఇల్లుకు కావలసిన సామాగ్రి ఇచ్చి, ఇల్లు నిర్మాణము నకు పూర్తి ఆర్థిక సహాయము అందించినవాడు పరమాత్మ. పరమాత్మ ప్రకృతియను పంచభూతములను అందించగా ఆత్మ ఇల్లు అను శరీరమును కార్యకర్తగా తయారు చేసి, పరమాత్మయను యజమాని క్రింద ఆత్మయను వాడు ఇంటి యజమానిగా నియమించబడినాడని అర్థమగుచున్నది. పరమాత్మ ప్రకృతి యను శరీరమునకు పూర్తి యజమాని అయినా, పరమాత్మ ఇల్లు అను శరీరమును ఆత్మకు అప్పజెప్పి శరీరమునందు గల జీవుళ్ళకు ఆత్మనే దేవుడుగా ఉండునట్లు చేశాడు. ఆత్మను దేవునిగా ప్రకటించి దేవుని హోదాను కల్గించి దేవునికున్న అధికారములన్నియూ ఆత్మకు కల్గించాడు.

భూమిమీద పుట్టిన మనుషులు ఏ మతములో యున్నా వారికి శరీరములో అధిపతిగాయున్న ఆత్మే దేవుడు. అందరూ ఆయననే ఆరాధించవలెనని స్వయానా పరమాత్మయే తెలియజేశాడు. మనుషు లందరికీ ఆరాధ్య దైవము ఒక్కడేయని ఆ ఒక్కడే శరీరములోని ఆత్మయని తెలియవలెను. మానవులందరూ శరీరములోనే చనిపోవు వరకు ఉండవలెను. అందువలన ఏ మనిషిగానీ తాను ఆరాధించవలసినది, తెలియవలసినది శరీరములో అధిపతిగాయున్న దేవున్నేయని తెలియవలెను. చాలామంది దేవున్ని ఆరాధించుచున్నాము అంటున్నారు. ముస్లీమ్‌లయితే ఒకే దేవున్ని ఆరాధించుచున్నారు, ఒకే దేవున్ని విశ్వసించుచున్నారు. అయితే వారు తమ దేవుడు ఎవరు? ఎక్కడున్నాడు? ఎట్లున్నాడు? అను వివరమును తెలియకుండా విశ్వసించడము, ప్రార్థించడము జరుగుచున్నది. సృష్టికర్త అయిన అల్లాహ్‌ను మేము ఆరాధించుచున్నాము అంటున్నారు. ఇక్కడ మొదట ప్రపంచమును సృష్టించిన దేవున్నా, లేక శరీరములను సృష్టించి అందులో తమను నిలబెట్టి, జీవనము సాగునట్లు చేయు దేవున్నా. ఎవరిని

ఆరాధించుచున్నామని తెలియదు. ఒకవేళ ఇప్పుడు కొంత తెలిసి చెప్పినా 'ప్రపంచమును సృష్ఠించిన దేవున్ని' అని చెప్పగలరు. ప్రపంచమును సృష్ఠించిన దేవుడు మనుషుల కొరకు ప్రత్యేకముగా దేవున్ని తయారు చేసి మీరు ఈయననే ఆరాధించమని చెప్పాడను విషయము ఖుర్‌ఆన్ గ్రంథములో యున్నా అది ఏమాత్రము తెలియదు.

వారికి జ్ఞానమును బోధించు పెద్దలు కూడా దైవ గ్రంథములో (3-18) (6-102) (2-255) వాక్యముల సారాంశము తెలియలేక పోయారు. అందువలన (6-91) లో **"మీకుగానీ మీ పెద్దలకుగానీ దేవుని జ్ఞానము తెలియకుండా పోయినది"**యని చెప్పడమైనది. దేవుడు అద్వితీయుడు. అద్వితీయుడయిన దేవున్ని ఆరాధించమని గ్రంథములో చెప్పియున్నారు. అయితే రెండవ వానిమీద దృష్ఠిలేకుండా ఒకే దేవుడయిన ఆత్మనే ఆరాధించమనీ, తాను అధికారమిచ్చిన వానిని ఆరాధించిన వాడు నన్ను ఆరాధించినట్లేయని దైవగ్రంథములో చెప్పడమైనది. నేను ధర్మాలకు అతీతున్ని, ధర్మముల చేత దేవునిగా యున్న వానిని, దేవుని ధర్మముల ప్రకారమే ఆయనను తెలియవలెనని పరమాత్మ దేవుడు చెప్పిన మాటలను మరచిపోయాడు. మనిషి ఒకే దేవున్ని ఆరాధించుచున్నాడు అయితే ఆ దేవుడు ఎవరు? అనునది తెలియదు. తన దేవుడు విశ్వప్రభువు. విశ్వ సామ్రాజ్యమునకు అధిపతిగాయున్నవాడు అని అంటున్నాడు. అలాగే ఆరాధన చేయుచున్నాడు, సంతోషము. అయితే తాను సృష్ట్యాదిలో దేవున్ని ఆరాధించుచున్నానా? సృష్ఠి తర్వాత దేవున్ని ఆరాధించుచున్నానా? అని తెలియలేక పోవుచున్నాడు. విశ్వప్రభువు అంటే రెండు రకముల అర్థము కలదు. ఒకటి పంచభూత నిర్మితమైన అచర ప్రకృతియనబడు ప్రపంచము. రెండు ప్రకృతి చేతనే నిర్మితమైన చర ప్రకృతియను ప్రపంచము. అనగా

శరీరముల రూపములోయున్న జీవసముదాయమును మొత్తము విశ్వము అని అంటున్నాము. అయితే శరీరములను విశ్వమునకు అధిపతియైన దేవున్నే ఆరాధించమని, ఆయనే మీకు ఆరాధ్యదైవము అని చెప్పబడి యున్నాడు. అచర ప్రకృతి యనబడు విశ్వమునకు అధిపతి పరమాత్మ. పరమాత్మయే శరీరములకు కూడా అధిపతియే అయినా శరీరములలో దేవునిగా ఉండుటకు, తన స్థానములో ఆత్మను నియమించి ఈయనే మీ దేవుడు అని చెప్పాడు. అయితే మనిషి దృష్టి పరమాత్మ మీద పెట్టుకొని ఆరాధించడము వలన ఆ ఆరాధన పరమాత్మకు చేరుచున్నది. అప్పుడు తాను నియమించి ఈయనే మీకు ఆరాధ్య దైవము అని చెప్పగా మీరు నా మాట వినకుండా నేరుగా నన్ను ఆరాధించుచున్నారు. నా ఆత్మను ఆరాధించని వారు నన్ను ఆరాధించనట్లేయగును. అప్పుడు మనిషి ఆరాధన మొత్తానికి వృథా అగుచున్నది అని దేవుడు అనుచున్నాడు. నా కుమారున్ని ఘనపరచని వాడు నన్ను ఘనపరచనట్లేయని చెప్పాడు.

**ప్రశ్న :- అసలయిన సృష్టికర్తయిన దేవున్ని ఆరాధించినప్పుడు ఆ ఆరాధన వృథా ఎట్లు అగును?**

**జవాబు :-** సృష్టికర్తయిన పరమాత్మ తనను ఆరాధించకూడదు తన ఆత్మను ఆరాధించమని చెప్పాడు కదా! అట్లు చెప్పిన తర్వాత కూడా పరమాత్మ మాటలు లెక్కచేయకపోతే ఆయన మాటను అగౌరవపరచినట్లు కాదా? సృష్టి ఆదిలో దేవుడు సృష్టి తర్వాత మనుషులు ఆరాధించవలసిన దేవున్ని నిర్ణయించి ఈయననే ఆరాధించండి, ఈయన ఒక్కడే మీకు ఆరాధ్య దైవము, ఈయనను ఆరాధించితే నన్ను ఆరాధించినట్లేయగును. ఈయనను ఆరాధించకపోతే నన్ను ఆరాధించనట్లే యగును అని చెప్పియుండగా, ఆయన

మాటను కాదని ఆరాధించవలసిన ఆత్మను ఆరాధించక నేరుగా సృష్ట్యాదిలోని దేవున్ని ఆరాధించితే ఆ ఆరాధన వృథాయగును. సృష్ట్యాదిలో దేవుడు ధర్మయుక్తుడు కాదు. అందువలన ఎటువంటి ఆరాధనలు, ఎటువంటి యోగములు ధర్మములతో కూడుకొన్నవి ఏవీ ఆయనను చేరవు. అందువలన వృథాయగునని చెప్పాము. మీరు సృష్ట్యాదిలో దేవున్ని పూజించి (ఆరాధించి) సృష్ఠికర్తయిన దేవున్ని ఆరాధించాము అనడములో ఎంతో తెలియని తనము గలదు. సృష్ఠికర్తలు ఇద్దరు కలరు. ఒకరు అచర ప్రకృతిని సృష్ఠించిన పరమాత్మకాగా, మరొకరు చర ప్రకృతిని అనగా శరీరములతో కూడుకొన్న జీవరాసులను సృష్ఠించిన సృష్ఠికర్త ఆత్మ కలడు. ఇద్దరిలో జీవరాసులను, శరీరములను సృష్ఠించిన ప్రస్తుతము కూడా సృష్ఠిస్తున్న ఆత్మయే జీవులైన వారందరూ ఆరాధింపతగిన దేవుడు. ధర్మములతో కూడుకొన్న దేవుడయిన ఆత్మను కూడా ఆరాధించవలసినవి ధర్మయుక్తముగా రెండే విధానములు కలవు. దేవుని ధర్మములు తెలిసి అనగా ఆత్మ ధర్మములు తెలిసి ఆరాధించవలసిన కర్మ బ్రహ్మయోగములను రెండు విధానములలో ఏదో ఒక విధానము ప్రకారము ఆరాధిస్తే అప్పుడు మనిషి సంపాదించుకొన్న కర్మలు తొలగుటకు ప్రారంభించును. ఆత్మజ్ఞానము తెలియనిదే, ఆత్మను ఆరాధించవలసిన రెండు విధానములు తెలియనిదే, మూడవ ఆత్మయిన సృష్ట్యాదిలోని దేవుడయిన పరమాత్మ ఏమాత్రము తెలియబడదు. ఆయనను ఆరాధించు ఆరాధన ఏమిటో తెలియదు.

అంతిమ దైవగ్రంథము ఖుర్‌ఆన్‌లో 112వ సూరా **'అల్ ఇఖ్లాస్'** లో మొత్తము నాలుగు ఆయత్‌లు (వాక్యములు) కలవు. అందులో మొదటిది **1) ఆయన ఒక్కడే**యని కలదు. మరొక గ్రంథములో తెలుగు అనువాదము ప్రకారము **1) ఆయన అల్లాహ్ ఏకైకుడు. 2) అల్లాహ్ ఎవరి అక్కరా**

**లేనివాడు. 3) ఆయనకు సంతానము లేదు. ఆయన ఎవరి సంతానము కాదు. 4) ఆయనతో సమానుడు ఎవడూ (ఏదీ) లేడు.**

ఈ నాలుగు ఆయత్‌లు సృష్ట్యాదిలోని దేవున్ని గురించి చెప్పిన వాక్యములని చెప్పకనే తెలియుచున్నది. సృష్ఠి తర్వాత నియమించిన దేవునికి సంబంధించినవి కాదు అని సులభముగా తెలిసిపోవుచున్నవి. ఇందులో రెండవ వాక్యమును గురించి ఇప్పుడు చెప్పుకొందాము. **"అల్లాహ్ ఎవరి అక్కరా లేనివాడు"** అని కలదు. దీనినిబట్టి ఎవరి అవసరము లేనివాడు దేవుడు అని తెలియుచున్నది. అటువంటప్పుడు నీ ఆరాధనతో కూడా ఆయనకు పనిలేదు. అందువలన మీరు ఆరాధించవలసిన దేవున్ని ముందే చూపి **ఈయనే మీ ఆరాధ్య దైవము** అని చెప్పాడు. సృష్ట్యాదిలోని దేవునికి ఏ ఆరాధన అవసరము లేదు. సృష్ఠి పూర్వము దేవుడు సృష్ట్యాదిలోనే తన జ్ఞానమును చెప్పినప్పుడు ఎవరి ఆరాధనతోగానీ, ఆప్యాయతతోగానీ నాకు అవసరము (అక్కర) లేదు అని చెప్పాడు. అందువలన మనము ఏ దేవున్ని ఆరాధించాలో ఆ దేవున్నే ఆరాధించమని చెప్పుచున్నాము. అట్లుకాని ఎడల దేవుడు కూడా ఆరాధన అక్కర కలవాడని చెప్పవలసి వచ్చును. సృష్ట్యాదిలోని అనగా సృష్ఠి పూర్వము దేవునికి ఏ అక్కర లేదు. ఏ అవసరము లేనివాడు ఆత్మకంటే వేరయిన పరమాత్మయని చెప్పుచున్నాము.

మూడవ వాక్యములో **"ఆయనకు సంతానము లేదు. ఆయన ఎవరి సంతానము కాదు"** అని ఉన్నది. సృష్ట్యాది దేవుడు స్వయముగా ముందునుండి ఉన్నవాడు, ఆయనకంటే ముందు ఎవరూ లేరు. అందువలన ఆయన ఎవరి సంతానము కాదని చెప్పవచ్చును. ఆకాశము మొదలుకొని గాలి, అగ్ని, నీరు, భూమి వరకు ఏదీ లేనప్పుడు

అది ఎటువంటి స్థితియో ఎవరికీ అర్థము కాదు అటువంటి సమయములో కూడా సృష్టికంటే ముందు నుండి ఉన్న దేవుడు ఉన్నాడు. అప్పుడు ఆయన ఒక్కడు తప్ప ఎవరూ లేరు. ఎవరూ లేనప్పుడు అతనికి తల్లితండ్రులు ఉండరు కదా! అందువలన 112వ సూరాలోని మూడవ ఆయత్‌లో **"ఆయన ఎవరి సంతానము కాదని"** చెప్పారు. అంతేకాక **"ఆయనకు ఎవరూ సంతానము లేరు"** అను వాక్యము కూడా అక్కడే కలదు. దాని ప్రకారము చూస్తే పరమాత్మయనబడు సృష్ట్యాదిలోని దేవుడు మార్పు చెందని అచర ప్రకృతిని సృష్టించిన తర్వాత మార్పు చెందే ప్రకృతిని తయారు చేయలేదు. అచర ప్రకృతి తర్వాత ఆత్మను, జీవాత్మను సృష్టించి తర్వాత మార్పు చెందే ప్రకృతిని, ప్రకృతి నుండి విడదీయడమైనది. అప్పుడు మార్పుచెందని, మార్పు చెందే ప్రకృతులుగా ప్రకృతి విడిపోగా దేవుడు తన స్థానములో ఆత్మను దేవునిగా నియమించి తాను ఊరక ఉండిపోగా దేవుడయిన ఆత్మ చర ప్రకృతి నుండి శరీరములను తయారు చేసి అందులో జీవాత్మలను నివశించునట్లు చేసినది. ప్రకృతి నుండి శరీరము తయారుకాగా అందులో జీవుడు చేరడమైనది. ఈ క్రియలో ఆత్మ బీజదాతగా యుండుట వలన ప్రకృతి గర్భమునుండి పుట్టు జీవాత్మలకు ప్రకృతి తల్లికాగా, ఆత్మ తండ్రిగా యున్నాడు. ఇట్లు సృష్టి తర్వాత ఆత్మకు సంతానము కలదు గానీ పరమాత్మకు సంతానము లేదు. ఆత్మకంటే వేరుగాయున్న పరమాత్మ జీవులు శరీరము ధరించి పుట్టడములో ఎటువంటి పాత్ర పోషించలేదు. కావున 'పరమాత్మకు ఎవరూ సంతానము లేరని' చెప్పవచ్చును. ఈ 112వ సూరాను బట్టి ఆత్మవేరు, పరమాత్మ వేరని తెలియుచున్నది. సృష్టి తర్వాత దేవునికి సంతానముండగా, సృష్టి పూర్వము నుండి ఉన్న దేవునికి సంతానము లేదని చెప్పవచ్చును. ఈ విధముగా దైవ గ్రంథము ప్రకారము ఇద్దరు

దేవుళ్లని అందులో నీవు (మనుషులు) ఆరాధించవలసినది ఒక్క దేవున్నేయనీ ఆయనే సృష్ఠి తర్వాత దేవుడనీ సులభముగా చెప్పవచ్చును.

అంతిమ దైవగ్రంథము 112వ సూరాలో నాలుగు ఆయత్‌లలో మొదటి వాక్యము, నాల్గవ వాక్యము రెండూ ఒకే అర్థమునిచ్చుచున్నవి. రెండు, మూడు వాక్యములలో వేరువేరు భావములున్నా ఒకటి, నాలుగు ఆయత్‌లు ఒకే భావమును తెల్పునట్లు గలవు. ఒకటవ ఆయత్‌లో **ఆయన ఒక్కడే** అని కలదు. నాల్గవ ఆయత్‌లో **ఆయనతో సమానుడు ఎవడూ లేడు** అని ఉంది. ఈ రెండు వాక్యముల సారాంశము దేవుడు ఒక్కడు తప్ప ఎవరూ లేరని అర్థమగుచున్నది. సృష్ట్యాదిలో ఆయన తప్ప ప్రకృతిగానీ, ఏ మానవుడుగానీ లేడు. సృష్ఠి పూర్వము దేవునితో సమానమైనవాడు ఉన్నాడనుటకు అవకాశమే లేదు. ఎందుకనగా! అప్పుడు ఎవరూ లేరు. సృష్ఠి తర్వాత ఒక్కమారుగా ఏదీ తయారు కాలేదు. కాలము గడచుకొలది క్రమేపీ అన్నీ ఒకదాని తర్వాత ఒకటి తయారగుచూ వచ్చాయి. ఆ క్రమములో సృష్ఠించబడిన సృష్ఠికంతటికీ, సర్వమానవులకు స్వయముగా దేవుడే మరొక దేవున్ని తయారు చేశాడు. అప్పుడు అలా తయారు చేయబడిన దేవునికి సర్వ అధికారములు దేవుడే ఇచ్చాడు. అలా దేవుడుగా తయారయినవాడు కూడా మొదటి దేవునికి సమానముగా లేడు. ఎందుకనగా! తయారు చేయబడిన దేవునికి తండ్రి మొదటి దేవుడు అయినందున, కుమారుడు పుట్టించబడినవాడు అయినందున మొదటి పరమాత్మ దేవునికి, రెండవ ఆత్మదేవుడు సమానము కాదు. సృష్ఠి పూర్వము ఉన్నవాడు ఒక్కడేయని మొదటి వాక్యములోనూ, సృష్ఠి తర్వాత కూడా ఆయనకు సమానులు లేరని నాల్గవ వాక్యములోనూ చెప్పబడినది. ఈ నాల్గు ఆయత్‌లు సృష్ఠి పూర్వమున్న దేవున్ని గురించి చెప్పినవి. ఖుర్‌ఆన్‌లోని

మిగతా సూరాలలోని అనేక వాక్యములు సృష్టి తర్వాత దేవున్ని గురించి చెప్పినవి గలవు. 112వ సూరాలోని నాల్గు ఆయత్‌లు (3-18) ఆయత్‌కు దారి చూపుచున్నవి. అక్కడ చెప్పిన విషయము కూడా సృష్టి పూర్వమున్న దేవుడు సృష్టి తర్వాత దేవున్ని గురించి చెప్పుచూ ఆయన ఒక్కడే మీకు ఆరాధ్యదైవము అని చెప్పాడు. అట్లే (2-255) లో రెండవ ఆత్మను గురించి చెప్పినది కలదు.

ఈ వాక్యములలోని జ్ఞానమును గ్రహించుకోలేని ప్రజలు ముఖ్యముగా ఖుర్‌ఆన్ గ్రంథము మాదియను ముస్లీమ్‌లు జ్ఞానము తెలిసినామనుకొనుచూ తప్పుదారిలో పోవుచున్నారు. అజ్ఞాన మార్గములో ప్రయాణించుచున్నారు. ఒక్క దేవున్నే ఆరాధించుచూ మేము సక్రమమయిన మార్గములో ఉన్నామని చెప్పుచున్నా వారు ఏ దేవున్ని ఆరాధించుచున్నారో తెలియడము లేదు. తండ్రి దేవున్నా లేక కుమారుడైన దేవున్నా? అని ప్రశ్నిస్తే సందిగ్ధములో పడిపోవుచున్నారు. ఇంతవరకు దేవుడు తండ్రిగా, కుమారునిగా రెండుగా ఉన్నాడని తెలియని వారికి, జ్ఞానములో మేము గొప్పవారమను వారికి ఒక మెరుపు మెరిసినట్లయినది. దానితో వారు గ్రుడ్డివారుగా తయారయి ఏది సత్యము, ఏది అసత్యము అని చూచుకొను మొదలుపెట్టారు. ఇప్పుడు వినిన విషయము శాస్త్రబద్ధమే అయినదగుట వలన ఒకవైపు పూర్తిగా ఆలోచించవలసి వచ్చినది. కొందరు గ్రుడ్డిగా యుంటూ "ఇంతవరకు దేనిని నమ్మామో దానిని ఇప్పుడు నమ్ముచున్నాము, అది ఇప్పుడు మంచిదా, చెడ్డదాయని చూడవలసిన అవసరము లేదు" అంటున్నారు.

కొందరు మాత్రము ఇందులో ఏదో మనకు తెలియని రహస్యముందని ఇప్పటినుండయినా తెలియగలిగితే మంచిదని తెలుసు

కొనుటకు ప్రయత్నము చేయుచున్నారు. కొందరు "మీరు చెప్పునది సత్యమయినా మేము మీ మాటను వినము. మా పెద్దలు ఎలా చెప్పితే అలా వినగలము" అని చెప్పుచున్నారు. కొందరు "మా పెద్దలు చెప్పినట్లు మేము జకాత్ ఇస్తున్నాము, నమాజ్ చేస్తున్నాము. అంతకంటే మించినది లేదని ఖుర్ఆన్ గ్రంథములోనే కలదు. అటువంటప్పుడు ఒకే దృష్టికల్గి దేవుని మార్గములో ముందుకు పోవాలిగానీ, అనుమానములతో వెనక్కి రాకూడదని" అంటున్నారు. మనుషుల వెనుకయుండి నడిపించువాడు దేవుడయిన ఆత్మ అయినందున ఆయన శ్రద్ధయున్న వారిని మంచి మార్గములోనూ, శ్రద్ధ లేనివానిని అజ్ఞాన మార్గములోనూ నడిపించును. శరీరములోని ఆత్మ సర్వ జీవరాసులకు దేవుడుగా యుండుట వలన జీవులనందరినీ వారివారి కర్మప్రకారము మరియు వారి శ్రద్ధ ప్రకారము నడిపించుచుండును. ప్రపంచ విషయములలో కర్మప్రకారము, జ్ఞాన విషయములలో శ్రద్ధ ప్రకారము నడిపించుచుండును. ప్రపంచమంతా వ్యాపించిన పరమాత్మయైన దేవుడు కార్యములను చేయనివాడుగా ఉండగా, శరీరములలో అంతటా వ్యాపించిన ఆత్మ జీవునకు కార్యకర్తగా యుండి ఎల్లవేళలా పనిని చేయుచూ జీవుని కర్మపాలనను చేయుచున్నాడు. శరీరములో ఆత్మ అధిపతిగా ఉండగా, బయట ప్రపంచములో ప్రకృతి అధిపతిగా ఉండి తన పాలకులయిన గ్రహములు, భూతముల చేత బయట జరుగవలసిన కార్యములను చేయించుచున్నది. ఇంతవరకు చెప్పిన విషయములన్నియూ గతములో పది రోజుల క్రిందట విడుదలయైన **"దేవుని ముద్ర"** గ్రంథములో చెప్పబడియున్నవి. అయితే ఇప్పుడు చదవడము వలన ఇదంతయూ క్రొత్తగానే యుండునుగానీ పాత విషయములేనని తెలియవలెను.

ఇప్పుడు **"ధర్మచక్రము"** ను గురించి తెలుసుకొందాము. ధర్మము అంటే ఏమిటో ఎట్లుండునో ముందే గ్రంథ ప్రారంభములోనే చెప్పు కొన్నాము. "చక్రము" అంటే ఏమిటో ఇప్పుడు తెలుసుకొందాము. చక్రము అనగా అందరికీ తెలిసినట్లు దొర్లునదేయని చెప్పవచ్చును. లేకపోతే తిరుగునది యని కూడా చెప్పవచ్చును. ధర్మచక్రములో అర్థమేమి కలదని చూచిన ధర్మచక్రములో ధర్మము తిరుగుచుండును. చక్రములో ఒక చోట గుర్తును పెట్టితే చక్రము తిరుగునప్పుడు ఆ గుర్తు పైకి క్రిందికి తిరుగుచుండును. అట్లే ధర్మచక్రములో ధర్మమును ఒకచోట గుర్తించగలిగితే అది చక్ర గమనములో ఒకచోట ఉండక పైకి క్రిందికి తిరుగుచుండును. ధర్మము విశ్వములో ఎవరికి కలదు? అనునది ముఖ్యమైన ప్రశ్న. సృష్ట్యాదిలో నున్న దేవునికి తప్ప సృష్టి తర్వాత పుట్టిన ప్రతి దానికి ధర్మము కలదు. ప్రకృతికి ఒక రకమైన ధర్మము. ఆత్మకు ఒకరకమైన ధర్మము గలదు. అట్లే జీవాత్మకు ధర్మము గలదు. జీవరాసులన్నీ శరీరములోనే నివశించు చున్నవి. శరీరము లేని జీవరాసి సామాన్యముగా ఏదీ ఉండదు. పుట్టిన ప్రతి జీవునికి శరీరముండి తీరును. చనిపోయిన వానికి శరీరము నశించి పోవును. అకాల మరణము పొందిన వానికి శరీరముండదు. మరణము పొందనంతవరకు శరీరముండును.

ఒక మనిషి శరీరములో జీవించుచున్నప్పుడు అతనికి ప్రకృతియొక్క శరీరముండును. అట్లే పరమాత్మ చేత దేవునిగా చేయబడిన దేవుడయిన ఆత్మయుండును. జీవాత్మయైన వాడు ప్రకృతి శరీరములోనూ, ఆత్మ దేవునితోనూ నివాసము చేయుచున్నాడు. అట్టి జీవుడు తనకున్న కర్మను అనుభవించు ధర్మమును, కర్మలేకపోతే ముక్తి పొందు ధర్మమును తెలిసిన వాడై యుండవలెను. అయితే నేడు జీవునికంటూ ఒక ధర్మము ఉందను

జ్ఞాపకము కూడా జీవునకు (మనిషికి) లేదు. తన ధర్మముల మీద ధ్యాస కల్గినవాడు, తనను గురించి తాను తెలుసుకొను ప్రయత్నము చేయును. నేడు తన ధర్మము మీద ధ్యాస లేనివారే ఉన్నారు. అటువంటివాడు తనను తాను తెలుసుకొను ప్రయత్నము చేయడు.

తన ధర్మములను గురించి తాను తెలియనివాడు తన మీద తనకే ధ్యాస లేనివాడైయుండును. అట్టివాడు తాను నివశించు ప్రకృతి ధర్మములను గానీ, తనను ఆధీనములో ఉంచుకొన్న ఆత్మ ధర్మములను గురించిగానీ తెలియవలెనను ప్రయత్నము చేయడు. అసలుకు తాను తప్ప ఆత్మ యున్నదనిగానీ, ప్రకృతి యున్నదనిగానీ తెలియనివాడై మనిషి ప్రకృతి యొక్క, ఆత్మ యొక్క ధర్మములను తెలియలేకున్నాడు. తనకంటూ ఒక ధర్మముందని ధ్యాసలేనివారు జీవితమును జంతువులవలె ఏమీ తెలియకుండా గడుపుచుందురు. అటువంటి వారికి ఆత్మజ్ఞానము తెలుపు నిమిత్తము ఆత్మకు తండ్రియైన పరమాత్మ, మనకు తాతయైన దేవుడు మనిషికి ధర్మములను గుర్తు చేయవలసియున్నది. దేవుని ధర్మములు దేవునికి తప్ప ఇతర మనుషులకు ఎవరికీ తెలియదు. అట్లే ప్రకృతి ధర్మములు, ఆత్మ ధర్మములు, జీవాత్మ ధర్మములన్నీ పరమాత్మకు తెలుసు. అందువలన మనకు తాతయైన దేవుడు బయట ప్రపంచములో మనిషివలె శరీరము ధరించి పుట్టి ఆత్మ ధర్మములు, పరమాత్మ ధర్మములు, ప్రకృతి ధర్మములు, జీవాత్మ ధర్మములు అన్నిటినీ శాస్త్రబద్ధముగా తెల్పును. అప్పుడు పరమాత్మ యైన దేవుడు, ఏ కార్యము చేయని దేవుడు సాధారణ మనిషివలె భూమిమీద ఉండి, ధర్మములను తెలియజేయుచున్నాడని ఎవరికీ తెలియదు.

శరీరములోనున్న ఆత్మదేవుడు మనిషిని వాని కర్మప్రకారమే నడుపు చుండును. ఆత్మ శరీరమునకు అధిపతిగా, దేవుడుగా యున్నా తన

స్వతంత్రముగా ఆత్మ ప్రవర్తించక జీవుని కర్మనుబట్టి వానికి కష్టసుఖములను అనుభవింపజేయుచుండును. అట్లే వాని శ్రద్ధనుబట్టి వానికి జ్ఞానమును తెలియజేయును. అజ్ఞానము మీద చింత కలవానికి అజ్ఞానమునే ఆత్మయిన దేవుడు బోధించును. దేవుడయి వుండి అజ్ఞానమును బోధించునా? అని ప్రశ్నిస్తే అవుననే చెప్పాలి. శరీరములోని ఆత్మ అధిపతిగా జీవునికి ఆరాధ్య దైవముగా యుండి మనిషికి జ్ఞాన అవసరమునుబట్టి జ్ఞానమును బోధించుచున్నది. అట్లే మనిషియొక్క అజ్ఞాన చింతనుబట్టి వాని అశ్రద్ధను బట్టి వానికి అజ్ఞానమును కూడా ఆత్మ బోధించుచున్నది. అలా జరగడము వలన కాలక్రమములో ఆత్మ ధర్మములు మనిషికి పూర్తి తెలియకుండా పోయి మనిషి ఆత్మను పూర్తిగా మరచిపోవును. ఆత్మంటే ఏమిటో తెలియని స్థితిలో ఉండిపోవును. అప్పుడు దేవుని ధర్మములు పూర్తి నశించి పోయినవనీ అధర్మములు అభివృద్ధియైనవని చెప్పవచ్చును. ఆత్మకు ధర్మములు తెలిసియున్నా తాను స్వయముగా చెప్పుటకు వీలులేదు. శరీరములోని జీవున్నిబట్టే ఆత్మ ప్రవర్తన యుండును. అజ్ఞానికి అజ్ఞానమును, జ్ఞానికి జ్ఞానమును బోధించడము ఆత్మయొక్క విధానము. ఆత్మ స్వయముగా ఏదీ చేయదు. మనిషి కర్మను, శ్రద్ధను అనుసరించే చేయునని ముందే చెప్పుకొన్నాము. జీవుడు ఆరాధించుటకు ఆత్మ ఆరాధ్య దైవముగాయున్నా మనిషి విధానమును బట్టి కార్యకర్తగా పనిని చేయుచుండుట వలన మనిషి కర్మను, శ్రద్ధను బట్టి ఆత్మ పని చేయవలసి యున్నది. అందువలన ఆత్మ తన ధర్మములను కూడా తన ఇష్ట ప్రకారము బోధించదు. ఆత్మ ధర్మములకు ముప్పు ఏర్పడినప్పుడు, అధర్మములు పెరిగిపోయినప్పుడు పరమాత్మ తనకు సంబంధము లేకుండా దూరముగా యున్నా, తన ప్రతినిధి ద్వారా ఆత్మ ధర్మములను తిరిగి భూమిమీద మనుషులకు తెలియునట్లు చేయును.

అప్పుడు ఆత్మ ధర్మములు మనుషులకు తెలియును. ఇట్లు కాలగమనములో ధర్మముల సాంద్రత తగ్గిపోవడము, పరమాత్మ జోక్యము ద్వారా తిరిగి పెరగడము జరుగుచుండును. ఈ రకముగా ధర్మములు ఆరోహణ, అవరోహణ ఉండుట వలన, చక్రమువలె ధర్మములు అధర్మములుగా, అధర్మములు తిరిగి ధర్మములుగా భూమిమీద మారుచుండుట వలన ఈ విధానమును **"ధర్మచక్రము"** అని అన్నారు.

చక్రము అనగా క్రిందిది పైకి, పైది క్రిందికి తిరుగుచుండునని, ధర్మములు పెరగడము తరగడము ఉండుట వలన ధర్మచక్రము అని అన్నారు. ధర్మములు కల దేవుడు శరీరములో ఉన్నాడు. ధర్మముల గల దేవుడు శరీరములో గల దేవుడేయని చెప్పాము. మనిషి తెలుసుకోవలసిన దేవుడు, ఆరాధించవలసిన దేవుడు శరీరములోని ఆత్మనేనని దైవగ్రంథము లలో చెప్పబడియున్నది. తెలుసుకోవలసిన జీవుడు శరీరములోనే ఉన్నాడు. తెలియబడవలసిన దేవుడు శరీరములోనే ఉన్నాడు. తెలియవలసిన ధర్మములు ఆత్మవద్దనే ఉన్నాయి. తెలుసుకోవలసిన జీవుడు, తెలియబడు దేవుడు, తెలియవలసిన ధర్మములు ముగ్గురు శరీరములోనే ఉండుట వలన ధర్మముల అవరోహణ, ఆరోహణ రెండూ దేహములోనే జరుగుచున్నప్పుడు ధర్మచక్రము శరీరములోనే ఉన్నదని తెలియుచున్నది. శరీరము లోపల గల ధర్మచక్రమును సూచన నిమిత్తము వ్రాశాము చూడండి. ఈ ఆకారము ఎక్కడా లేదు. అయినా మీరు అర్థము చేసుకొనుటకు శరీరమును చక్రముగా చూపి అందులోనే ఆత్మ, పరమాత్మ, ధర్మ అధర్మములు, గుణములు, శరీర భాగములు చివరికి జీవాత్మను చూపడమైనది. ఇది తెలియుటకు దృశ్యరూపమేగానీ వాస్తవముగా లేదు. ధర్మచక్రమును తర్వాత పేజీ పటములో చూడవచ్చును.




# ధర్మచక్రము

మనుషులలోనే దేవుని ధర్మములు తెలియడము, తెలియకుండా పోవడము జరుగుచున్నది. మనిషి శరీరములోనున్న విధానమును ఉదాహరణ నిమిత్తము చిత్రపటముగా చూపుకొన్నాము. చక్రము ఏదయినా తిరుగుచుండును లేక దొర్లుచుండును. చక్రము తిరుగుటకు ఏదయినా శక్తి ఉపయోగపడవలసి యున్నది. మనకు కనిపించు చక్రములను త్రిప్పుటకు యంత్రశక్తి లేక శరీర బలమో ఉపయోగపడవలసియున్నది. రిక్షా చక్రము తిరుగుటకు మనిషి శక్తి, ఎద్దులబండి చక్రము తిరుగుటకు

ఎద్దుల బలము, పిండిమిషన్ చక్రము తిరుగుటకు మోటారులోని విద్యుశ్చక్తి ఉపయోగపడుచున్నది. అట్లే ధర్మచక్రము తిరుగుటకు పరమాత్మశక్తి ఉపయోగపడుచున్నది. ఆత్మ ధర్మములు ఎప్పుడు భూమిమీద అడుగంటి పోవునో అనగా దైవ ధర్మములు ఎప్పుడు మనుషులకు తెలియకుండాపోయి ధర్మముల స్థానములో అధర్మములు వచ్చి చేరునో అప్పుడు తిరిగి ధర్మ ప్రతిష్టాపన నిమిత్తము పరమాత్మ శక్తి ఉపయోగపడితే అధర్మములు చక్రములో తిరిగి ధర్మములు వచ్చును.

**ప్రశ్న :- ధర్మచక్రములో అనగా మనుషులలో అధర్మములు పోయి ధర్మములు వచ్చుటకు పరమాత్మశక్తి ఉపయోగపడుట వలన అధర్మములు పోయి ధర్మములు మనుషులలో కనిపించుచున్నవి. అధర్మములు పోవుటకు ధర్మములు రావుటకు తాతయైన పరమాత్మ శక్తి ఉపయోగపడినప్పుడు ధర్మములు పోయి అధర్మములు వచ్చుటకు కూడా ధర్మచక్రము తిరుగ వలసి యున్నది. అప్పుడు ఎవరి శక్తి ఉపయోగపడుట వలన అధర్మములు తిరిగి వచ్చాయి అను ప్రశ్న వచ్చుచున్నది? దీనికి మీరేమంటారు?**

**జవాబు :-** ధర్మములు అధర్మములు చక్రమువలె తిరుగుచున్నవని చెప్పుటకు భగవద్గీత జ్ఞానయోగములో ఎనిమిదవ శ్లోకము ఆధారముగా యున్నది. ఆ శ్లోకములో **"ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే"** అని చెప్పి యుండడము వలన ధర్మ సంస్థాపన నిమిత్తము నేను యుగ యుగములోను అవతరించవలసి వచ్చుచున్నది అని స్వయనా పరమాత్మయే అన్నట్లు కలదు. ప్రతి యుగములోను అంతో ఇంతో అధర్మములు వస్తున్నవి, ధర్మములు పోతున్నవి. పోయిన ధర్మములను తిరిగి తెచ్చుటకు వచ్చియున్న అధర్మములు లేకుండా చేయుటకు సృష్ట్యాదిలోని దేవుడు సంభవించ వలసి

వచ్చుచున్నదని శ్లోకములో చెప్పియున్నారు. ఈ విషయమును భగవద్గీత జ్ఞాన యోగములో ఏడు, ఎనిమిది శ్లోకములలో చెప్పియున్నారు చూడండి.

శ్లో॥ 7. యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత ।।
అభ్యుత్థానమధర్మస్య తదా త్మానం సృజామ్యహమ్ ॥

శ్లో॥ 8. పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చదుష్కృతామ్ ।
ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే ॥

**భావము :- "భూమిమీద ఎప్పుడెప్పుడు ధర్మములకు ముప్పుగలిగి అధర్మములు వృద్ధి చెందునో అప్పుడప్పుడు నేను భూమిమీద అవతరించ వలసి వచ్చుచున్నది."**

**భావము :- "మంచివారిని అభివృద్ధి చేయుటకు దుష్ట జనులను లేకుండా చేయుటకు సకల ధర్మములను సంస్థాపన చేయుటకు ప్రతి యుగము అయినా, ఏ యుగములో అయినా ఉద్భవించుచుండును".**

ఈ విధముగా ధర్మ అధర్మముల విషయమై పరమాత్మ సృష్ట్యాదిలోనే ఈ విషయమును చెప్పియున్నాడు. దీనిని పరమాత్మ దేవుడు ధర్మములను తెలియజేస్తే తెలియుచున్నప్పుడు అధర్మములను ఎవరు చెప్పితే మనుషుల మధ్యలోనికి వచ్చుచున్నవి? ధర్మచక్రము తిరిగి ధర్మములు తెరమీదికి రావుటకు పరమాత్మ శక్తి ఉపయోగపడినది. అదే విధముగా ధర్మచక్రము తిరిగి అధర్మములు తెరమీదికి వచ్చుటకు ఎవరి శక్తి ఉపయోగపడినది అని కొందరి ప్రశ్నగా యున్నది. అయితే ఈ విషయమై ముందే మేము జవాబు చెప్పియున్నాము. ఇప్పుడు మరొకమారు చెప్పుదుము చూడండి.

పరమాత్మ తన ఆత్మను దేవునిగా నియమించి జీవుని పాలించుటకు శరీరములోనే పెట్టాడు. శరీరములోని జీవునికి దేవుడు మరియు ఆరాధ్య దైవము శరీరములోని దేవుడేయని చెప్పుకొన్నాము. శరీరములోని జీవుని కర్మను బట్టి కష్టసుఖములు, భావమును బట్టి పాపపుణ్యములు, అజ్ఞానమును బట్టి అధర్మములు కలుగజేయువాడు శరీరములోని దేవుడేయని చెప్పాము. దీనినిబట్టి మనిషికి లభించునది ఏదయినా మరొకదాని ఆధారము వలననేయని తెలియుచున్నది. కష్టసుఖములకు కర్మ కారణముకాగా, పాప పుణ్యములకు భావము కారణము కాగా, ధర్మ అధర్మములకు మనిషిలోని జ్ఞాన అజ్ఞానముల శ్రద్ధ కారణమని తెలియుచున్నది. కర్మ పరిమితిని బట్టి కొద్దిగ కూడా ఎక్కువ తక్కువ కాకుండా ఖచ్చితమైన కొలత ప్రకారము కష్ట సుఖ అనుభవములు వచ్చుచుండును. కర్మప్రకారము ఏది ఎప్పుడు జరుగ వలసియుండునో అప్పుడే జరుగునట్లు శరీరములోని దేవుడు చేయుచున్నాడు. దీని నిరూపణ నిమిత్తము చూస్తే ద్వితీయ దైవ గ్రంథము ఇంజీలు (బైబిలు)లో లూకా సువార్త 12వ అధ్యాయమున ఏడవ వచనము ఇలా కలదు చూడండి. **(లూకా 12-7) "మీ తల వెంట్రుకలన్నియూ లెక్కించబడియున్నవి భయపడకుడి."**

ఈ వాక్యమును బట్టి కర్మ విషయములో దేవుడు చాలా సున్నితమైన దృష్టితో యున్నాడని ఎప్పుడు కర్మప్రకారము తలలోని వెంట్రుక ఊడిపోవలెనో అప్పుడు దానిని ఊడిపోవునట్లు దేవుడు చేయుచున్నాడు. ఇట్లు కర్మలను ఖచ్చితమైన కొలతలతో పాలించడము, అమలు చేయడము చేయుచున్నాడు. కర్మల విషయములో ఏమాత్రము అలసత్వము లేకుండా ఎప్పుడువప్పుడు జరుగునట్లు చేయుచున్నాడు. కర్మల విషయములో దేవుడు (ఆత్మ) ఎంత జాగ్రత్త కల్గియున్నాడో అట్లే భావము విషయములో పాప

పుణ్యములను అంటగట్టడములోగానీ, శ్రద్ధ విషయములో జ్ఞాన అజ్ఞానములు కల్గుటకు ధర్మ అధర్మములు కలుగజేయడములోనూ ఆలస్యము చేయకుండా పనిని చేయుచున్నాడు. మీరు అడిగినట్లు అధర్మములు కల్గుటకు కూడా శరీరములోని దేవుడే కారణమని చెప్పవచ్చును. దేవుడు అయినందుకు ధర్మములు కలుగజేయవలెనని మీరు అనుకోవచ్చును. అయితే శరీరములో దేవుడు పరమాత్మ చేత నియమింపబడిన దేవుడు మనుషులు ఆరాధించుటకు ఈయన దేవుడుగా యున్నాడు. మనుషులను పాలించుటకు కార్యకర్తగా ఎల్లవేళలా పనిని చేయువాడుగా యున్నాడు. మనుషుల ఆరాధన విషయములో ఆత్మే నిజమైన ఆరాధకుడు, అట్లే శరీర పాలనలో ఖచ్చితమైన పరిపాలకుడు. ఒక్క సెకను కాలము కూడా ఊరక ఉండక పని చేయుచున్నాడు. పరమాత్మ మనుషుల ఆరాధన నిమిత్తము ఆత్మను దేవునిగా నియమించగా మనిషి భక్తి భావమును దేవుడయిన ఆత్మ అన్ని కోణములలో చూస్తున్నాడు. మనిషి శ్రద్ధనుబట్టి అతనికి జ్ఞానమును అందజేయవలెనో లేక అజ్ఞానమును అందజేయవలెనో దేవుడయిన ఆత్మ నిర్ణయించును. ఖచ్చితమైన లెక్క ప్రకారము ఆ మనిషిని అజ్ఞానములోనికో, జ్ఞానములోనికో నడుపుచున్నది. శరీరములో దేవునిగా యున్న ఆత్మ తన దేవుని పాత్రను సమర్థవంతముగా నిర్వర్తించుచున్నది. మనిషి కోర్కెలను బట్టి, వాని కర్మలనుబట్టి, వాని జ్ఞానమునుబట్టి ఆత్మ కర్మను క్షమించనూ గలదు లేక కర్మను మూటగట్టనూ గలదు. కర్మను అనుభవింపజేయడములో కఠినాతికఠినముగా వ్యవహరించి అనుభవింపజేయును. ఆత్మకు ఏమాత్రము దయ దాక్షిణ్యము లేదు. జ్ఞానముగల వాని జ్ఞాన సాంద్రతనుబట్టి, జ్ఞానశక్తిని బట్టి వాని కర్మలను దహించివేయునది కూడా ఆత్మయే. శరీరములో కర్మలను (పాపములను) అనుభవింపజేయడములో యమధర్మరాజుగా

యున్నాడు. అందువలన భగవద్గీత విభూతియోగములో 29వ శ్లోకము చివరిలో **"యమస్సం యమతా మహమ్"** అన్నాడు.

దేవున్ని, దేవుని జ్ఞానమును అనగా ఆత్మను, ఆత్మజ్ఞానమును ఏ విధముగా అజ్ఞానముతో వాడు నమ్మనప్పుడు, దేవున్ని ఆరాధించనప్పుడు వానిని అజ్ఞాన మార్గములోనే, అధర్మములలోనే పోవునట్లు లోపల దేవుడే చేస్తున్నాడు. అదే విషయమునే అంతిమ దైవగ్రంథము ఖుర్ఆన్‌లో సురా 6, ఆయత్ 110, 111లలో ఈ విధముగా చెప్పాడు చూడండి.

**(6-110) "తొలిసారి ఏ విధముగానైతే వీళ్ళు దీనిని విశ్వసించలేదో అదే విధముగా మేము కూడా వారి హృదయాలను, వారి చూపులను త్రిప్పివేస్తాము. వారిని వారి తలబిరుసుతనములోనే దేవుని మార్గము విడచి దూరముగా తిరిగేలా చేస్తాము."**

**(6-111) "మేము వారి దగ్గరకు దూతలను పంపినా, మృతులు వారితో మాట్లాడి ఇది మంచిమార్గము, ఇది చెడుమార్గము, ఇది దేవుని మార్గము, ఇది మాయ మార్గము అని చెప్పినా, సమస్త వస్తువులూ, సమస్త జ్ఞానమునూ వారి ఎదుట తెచ్చి పెట్టినా వారు విశ్వసించేది మాయా జ్ఞానమునే, వారు దేవుని జ్ఞానమును విశ్వసించరు."**

ఇక్కడ 110వ వాక్యములో "మొదట ఎవడయితే దేవున్ని, దేవుని జ్ఞానమును సక్రమమైన మార్గములో శ్రద్ధ కల్గి నమ్మడో, అట్లు శ్రద్ధలేని వానిని వాని అభీష్టము మేరకు నేను కూడా వాని అంతరంగములోనే వాని చూపును అధర్మముల వైపు త్రిప్పుతాను. వానిని జ్ఞానమార్గము వదలి అజ్ఞాన మార్గములో పోవునట్లు చేస్తానని" చెప్పాడు. శరీరములోని

దేవుడు మనిషిని ఒకమారు అజ్ఞానములోనే వుండి అధర్మములలోనే పోవునట్లు చేసినప్పుడు వానికి దేవదూతలుగానీ, చనిపోయిన వారు వచ్చిగానీ ఇది మంచి, ఇది చెడు, ఇది దేవుడు, ఇది మాయ, ఇది ధర్మము, ఇది అధర్మము అని చెప్పినా వాడు అజ్ఞానమునే ఆశ్రయించును. ఈ విధముగా ఖుర్‌ఆన్‌లో చెప్పిన దానిని బట్టి శరీరములోని దేవుడే మనిషిని వాని ఇష్టమునుబట్టి ఏ దారిలో పంపాలో ఆ దారిలో పంపునని తెలియుచున్నది. అట్లు మానవున్ని మంచి మార్గములో అయినా, చెడు మార్గములో అయినా పంపువాడు దేవుడేయని తేలిపోయినది. శరీరములోని దేవుడు వాని ఇష్టాయిష్టమును బట్టి చెడు లేక మంచి మార్గములో పంపు అధికారము గలవాడై యున్నాడు. అజ్ఞానము చూపు, అజ్ఞాన భావము, అజ్ఞానము మీద ఇష్టము గలవానిని అజ్ఞాన మార్గములోనే పంపుటకు వానికి అధర్మములను దేవుడే తెచ్చి పెట్టుచున్నాడు. అప్పుడు ధర్మముల స్థానములో అధర్మములుండి పోవుచున్నవి. అధర్మములను మనిషి అజ్ఞాన భావమును బట్టి ఆత్మదేవుడు తెచ్చుచున్నాడు.

ఇట్లు కొన్ని వేల, కొన్ని లక్షల సంవత్సరములు గడచిపోగా ఒక దానికొకటి అప్పుడప్పుడు అధర్మములు పెరుగుచూరాగా ధర్మములు తెలియకుండా పోవుచుండును. చివరకు అధర్మములు ఎక్కువయి ధర్మములు పేరుకు మాత్రము మిగిలినప్పుడు తిరిగి ధర్మములు ఆరోహణ జరుగవలసియున్నది. అప్పుడు తెలియకుండా పోయిన ధర్మములు తెలుపుటకు, భూమిమీద అధర్మములను లేకుండా చేయుటకు తాతయైన దేవుడు, పరమాత్మయైన దేవుడు మనిషివలె అవతరించి మనుషులకు ధర్మములను తెలియజేయవలసి యున్నది. తన చట్టము ప్రకారము లేక తన నియమము ప్రకారము ఖుర్‌ఆన్ గ్రంథములో (6–110) లో చెప్పినట్లు

"తండ్రియైన దేవుడే అధర్మములను తెరమీదికి, మనుషుల హృదయాల మీదికి తెస్తున్నాడు". అట్లు జరుగగా జరుగగా కొంత కాలమునకు అధర్మముల సాంద్రత పెరిగిపోయి ధర్మముల సాంద్రత తగ్గిపోవును. అప్పుడు తాను నియమించిన దేవుడు తన పద్ధతి ప్రకారము అధర్మములను పెంచగా పరమాత్మ తన స్థానములో తాను ఉంటూ, ప్రత్యేకమయిన మానవున్ని తయారు చేసి అతనిలో తన ఆత్మను (తన శక్తిని) నింపి తన ప్రతినిధిగా భూమిమీదికి మనుషుల మధ్యలోనికి పంపును. అప్పుడు మానవ ఆకారముతో వచ్చినవాడు పరమాత్మ శక్తి గలవాడని, దేవుని పాలనలోని గ్రహములు, భూతములు గ్రహించి వచ్చిన ఆయనకు సాష్టాంగ నమస్కారము చేయును. మానవులు కూడా అలాగే సాష్టాంగ నమస్కారము చేయవలసి యుండగా అధర్మములతో నిండిన మనుషులు మాయతో ఉన్నవారై వచ్చిన వానిని సాధారణ మనిషిగా లెక్కింతురు. ఆయనకు నమస్కరించరు. ఆయన ఎవరో కూడా మనుషులకు తెలియదు. ఈ విషయమును అంతిమ దైవగ్రంథము ఖుర్ఆన్‌లో సూరా 15లో 28, 29, 30, 31లలో ఇలా కలదు చూడండి.

**(15-28) "మట్టితో నేను ఒక మానవ్వున్ని తయారు చేయబోతున్నాను అని నీ ప్రభువు దూతలతో అన్నాడు".**

**(15-29) "నేను అతనిని పూర్తిగా తయారు చేసి అతనిలో నా ఆత్మను ఊదినప్పుడు మీరంతా అతని ముందు సాష్టాంగ పడండి".**

**(15-30) "దూతలందరూ సాష్టాంగపడ్డారు."**

**(15-31) "ఒక్క ఇబ్లీసు తప్ప సాష్టాంగ పడేవారితో చేరటానికి వాడు నిరాకరించాడు".**

ఈ విధముగా వాక్యములో గల దానిని విశ్లేషించుకొని చూస్తే పరమాత్మ పరమాత్మగానే ఉంటూ తన శక్తి చేత ఒక మనిషిని తయారు చేసిపంపును. ఇంకోరకముగా చెప్పాలంటే స్వయముగా పరమాత్మయే మారువేషమున భూమిమీదికి మనిషిగా వచ్చును. అయితే అట్లు వచ్చినప్పుడు ఆయన దేవునిగా కొన్ని సమయములలో మాత్రమే ఉంటూ మిగతా సమయమంతా అనగా మిగతా జీవితమంతా కర్మగల జీవునిగా, కర్మ అనుభవించుచుండును. అట్లుండుట వలన ఆయనను దేవుని అవతారమనీ, పరమాత్మ వచ్చాడని ఎవరూ తెలియలేరు. అటువంటి పరిస్థితిలో కొందరు ఆయన అనగా భగవంతుడు చెప్పు జ్ఞానమును వ్యతిరేఖించుచూ తమకు తెలిసిన జ్ఞానమే గొప్పదని చెప్పుచుందురు. అంతటితో ఆగక సాధారణ మనిషిని హేళనగా మాట్లాడినట్లు మాట్లాడడమే కాక ఆయనను అవమానింతురు. అయినా అన్నిటినీ ఓర్చుకొని తాను ఏ ఉద్దేశ్యముతో వచ్చాడో ఆ ఉద్దేశ్యమును ఎవరికీ తెలియకుండా నెరవేర్చి తన స్థానములోనికి తాను పోవును. ఈ విషయమై భగవద్గీతలో రాజవిద్యా రాజగుహ్య యోగము అను అధ్యాయములో పదకొండవ శ్లోకములో ఇలా అన్నారు చూడండి.

శ్లో॥ అవజానన్తి మాం మూఢా మానుషీం తనుమాశ్రితమ్ ।
పరం భావ మజానన్తో మమ భూత మహేశ్వరమ్ ॥

**భావము :- "సర్వ జీవరాసులకు దేవుడయి వుండి మానవ శరీరము ధరించి వచ్చిన నన్ను చూచి నా గొప్పతనము తెలియని మనుషులు అజ్ఞానులగుచూ నన్ను అవమానించుచున్నారు."**

జ్ఞానయోగము 6వ శ్లోకము...

శ్లో॥ అజోపి సన్నవ్యయాత్మా భూతానా మీశ్వరో పిసన్।

ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మ మాయయా ॥

**భావము :- "నాశనము లేని వానిని, పుట్టుక లేని వానిని సకల జీవరాసులకు దేవుడనయ్యూ నా ప్రకృతితో శరీరమును తయారు చేసుకొని నేను పుట్టుచున్నాను."**

ఖుర్ఆన్ గ్రంథములో సూరా 89, ఆయత్ 22లో దేవుడు వస్తాడని దేవదూతలు బారులు తీరియుండగా వస్తాడని చెప్పియున్నారు. ఆ విషయమును చూస్తాము.

**(89-22) "దేవదూతలు వరుసగా నిలబడి యుండగా, దేవుడు స్వయముగా ఏతెంచినప్పుడు"**

ఇట్లు పరమాత్మ స్వయముగా వచ్చుచున్నాడని భగవద్గీత మరియు ఖుర్ఆన్ గ్రంథము చెప్పుచున్నది. దేవుడు మనిషిగా వస్తే ఆయన మనుషుల వలె యున్నా ఆయనను సాధారణ మనిషియని అనకూడదు. ఆయన ఎవరి చేత గుర్తింపబడకున్నా ఆయన వచ్చిన విధానమునుబట్టి, ఆయన పుట్టిన పద్ధతినిబట్టి భగమునుండి పుట్టిన వాడని భగవంతుడు అని చెప్పుచున్నాము. భగవంతుడను పేరులో విశేష అర్థము గలదు. దేవుని రాకగా వచ్చిన మనిషిని భగవంతుడని అనవచ్చును. అంత తప్ప ఆ పేరు ఎవరికీ సరిపోదు.

పరమాత్మ మానవ శరీరమును ప్రకృతితో తయారు చేసుకోవడము వలన ఖుర్ఆన్ గ్రంథములో **(15-28) లో "దేవుడు మట్టితో బొమ్మను చేసి మానవున్ని సృష్టించబోతున్నానని"** చెప్పాడు. ప్రకృతిలోని ఒక భాగము మట్టియని ప్రకృతిని గుర్తు చేయుటకు అలా చెప్పాడు. ఖుర్ఆన్

గ్రంథములో పంచభూతములను గురించి ఎక్కడా చెప్పియుండలేదు. అందువలన ప్రకృతియని అర్థమగుటకు మట్టితో బొమ్మను చేయడము అని చెప్పాడు. భగవద్గీతలో జీవరాసులకు దేవుడయినవాడే మనిషిగా వచ్చి పుట్టితే అతను దేవుడని తెలియక, ఆయన గొప్పతనము తెలియక జీవరాసులన్నిటికీ పెద్దయనీ, అధిపతియనీ తెలియక మనిషిగానున్న దేవున్నే అవమానించుచున్నారని కూడా చెప్పారు.

తండ్రియైన ఆత్మదేవుడు అధర్మములను అభివృద్ధి చేయగా, తాతయైన పరమాత్మదేవుడు తిరిగి ధర్మములను స్థాపించుచున్నాడు. అందువలన ధర్మములు అధర్మములుగా, అధర్మములు ధర్మములుగా చక్రమువలె తిరుగుచున్నవి. సృష్టి, సృష్ట్యాది దేవుడు, సృష్టి తర్వాత దేవుడు అని చెప్పుచున్నాము. ప్రపంచము పుట్టినప్పటినుండి అందులో జీవరాసులు పుట్టినప్పటినుండి పరమాత్మ, ఆత్మ, జీవాత్మ మూడు ఆత్మలు ఒకటి ప్రకృతి ఉన్నదని జ్ఞానము ప్రకారము తెలియగలిగాము. అయితే ధర్మములు అధర్మములుగా మారినప్పుడు మనుషుల మధ్యలో తిరిగి ధర్మములను పునరుద్ధరించడానికి తెరమీదికి పరమాత్మ అవతరించవలసి వచ్చుచున్నది. పరమాత్మ మనిషి శరీరము ధరించి వచ్చినా పరమాత్మ స్థానము ఖాళీ కాకుండా అలాగే ఉండును. అలాగే పరమాత్మ ఉంటూ తానే తన ప్రతినిధిగా మారువేషములో భూమిమీదికి వచ్చుచున్నాడు. అయితే భగవంతుడను పేరుగల పరమాత్మ జన్మ, అవసర నిమిత్తము వచ్చి తిరిగి లేకుండా పోవుచున్నది. అలా రావడము కొన్ని లక్షల సంవత్సరములకో, వేల సంవత్సరములకో జరుగుచుండును.

భగవద్గీతలో జ్ఞానయోగములోనూ, రాజవిద్యా రాజగుహ్య యోగము లోనూ నేను సర్వజీవరాసులకు, సర్వ ప్రపంచమునకు దేవుడనయ్యు

మనిషిగా పుట్టుచున్నాను అని రెండుచోట్ల చెప్పగా  ఖుర్‌ఆన్ గ్రంథములో (15-29), (89-22) వాక్యములలోనూ దేవుడు అవతరిస్తాడని ఉన్నది. అట్లే బైబిలు గ్రంథములో యోహాన్ సువార్త 14వ అధ్యాయము 26వ వాక్యములో **(యోహాన్ 14-26) "ఆదరణకర్త అనగా  తండ్రి నా నామమున పంపబోవు పరిశుద్ధాత్మ సమస్తమును  మీకు బోధించి నేను మీతో చెప్పిన సంగతులన్నిటిని మీకు జ్ఞాపకము చేయును"** అని చెప్పి యున్నారు.  పరిశుద్ధాత్మయనగా పరమాత్మయని అర్థము చేసుకోవలెను.  పరమాత్మ అవతారమును 'ఆదరణకర్త' అని చెప్పియున్నారు. ఆదరణకర్త యనగా  భగవంతుడని అర్థము చేసుకోవలెను.  **"తండ్రి నా నామమున"** అన్నప్పుడు  "ఏసుప్రభువు నామమున" అని అందరూ అనుకోవచ్చును.  అలా అక్కడ చెప్పియుండలేదు.  పరమాత్మ అవతరించినప్పుడు  ప్రత్యేకించి సజీవముగా భగమునుండి పుట్టినవాడగుట చేత 'భగవంతుడు' అని పిలువడము జరుగుచున్నది.  అందువలన 'నా పేరుతో' అని చెప్పారు.  'నా పేరు' అనగా భగవంతుడని అర్థము. భగవంతుడు అనగా 'ఆదరణకర్త' అని కూడా అందురు.  కావున ఆదరణకర్త అనగా 'నా నామమున' అని వాక్యములో చెప్పడమైనది.  ఈ విధముగా మూడు దైవగ్రంథములలో దేవుడు మనిషివలె జన్మిస్తాడని, జన్మించి ధర్మములను బోధిస్తాడని చెప్పియున్నారు.  మూడు దైవ గ్రంథములలో దేవుడు వచ్చి ధర్మములను తెలియజేస్తానని ఉండగా  ముస్లీమ్‌లు గ్రంథములో వ్రాసిన దానిని గ్రహించలేక దేవుడు పుట్టడు అని గీత గీచుకొన్నారు.  దేవుని ధర్మములు దేవునికి తప్ప ఇతర మానవులకు ఎవరికీ తెలియవని ఖుర్‌ఆన్ గ్రంథములో సూరా మూడు ఆయత్ ఏడులో (3-7) చెప్పిన మాటను మరచిపోయారు.  సూక్ష్మజ్ఞానముతో కూడుకొన్న విషయములు అనగా

ధర్మములను దేవుడే మనుషులకు చెప్పవలసి యుండును. దేవుడు చెప్పకపోతే మనుషులు తెలియుటకు అవకాశమే లేదు.

**ప్రశ్న :- ఏసుగా వచ్చిన వ్యక్తి మాకు తెలిసినంతవరకు మనిషనే చెప్పుదుము. అయితే ఆయన పరమాత్మను తండ్రియని అనేకచోట్ల చెప్పడమయినది. మీరేమో పరమాత్మ సృష్టి తర్వాత సృష్ఠించిన ఆత్మకు తండ్రియని చెప్పారు. మనిషికి ఆత్మ తండ్రియని చెప్పారు. ఏసు తండ్రియని శరీరములోని ఆత్మను అంటున్నాడా? లేక ప్రపంచమంతా వ్యాపించి శరీరములో కూడా సాక్షిగా యున్న పరమాత్మను తండ్రియని అంటున్నాడా? కొంత వివరముగా చెప్పండి.**

**జవాబు :-** శరీరములోని ఆత్మ శరీరముతో జన్మించు ప్రతి జీవరాసికి బీజదాతగా యున్నది. తల్లి శరీరముగా యున్న చర ప్రకృతి లేక చేతన ప్రకృతి యనబడు దానిచేత క్రొత్త శిశు శరీరమును తయారగునట్లు చేయుచున్నది. స్త్రీ శరీరములో కూడా ఆత్మేయున్నది. అట్లే పురుష శరీరములో కూడా ఆత్మే దేవుడుగా, అధిపతిగా, కార్యకర్తగా యున్నది. ఒక మనిషి ఎక్కడ పుట్టినా వాని కర్మను అనుసరించి కర్మప్రకారము పుట్టును. జీవుని కర్మ ప్రకారము నడిపించునది ఆత్మే అయినందున స్త్రీ శరీరము నుండే ఎవడయినా శరీరమును ధరించి పుట్టవలసి యున్నది. అందరికీ పైకి తెలియు విషయమింతే అయినా తెలియని విషయమేమనగా! జీవుడు తల్లి గర్భమునుండి పుట్టలేదు. జీవుడు ధరించు శరీరము మాత్రము పుట్టుచున్నది. జీవుడు క్రొత్తగా తయారయి ప్రసవింపబడిన శరీరములో ప్రవేశించుచున్నాడు. జీవుడు ఒకచోట మరణించి శరీరమును వదలి వచ్చి మరొకచోట క్రొత్త శరీరమును చేరుచున్నాడు. దానినే పుట్టుక

అంటున్నాము. పుట్టుకలో ఏ జీవుడు తల్లి గర్భము నుండి పుట్టలేదు. స్త్రీ శరీరములో శిశువు తయారగుటకు స్త్రీకి బీజదాత అయిన పురుషుడు అవసరము. అయితే ప్రపంచములో పురుషులు ముగ్గురే ఉన్నారు. ముగ్గురు పురుషులను మూడు దైవ గ్రంథములలో చెప్పినా 'పురుషులు' అను పేరుతో భగవద్గీతలోనే చెప్పారు. భగవద్గీత పురుషోత్తమప్రాప్తి యోగము అను అధ్యాయమున 16, 17 శ్లోకములను చూచిన పురుషుల విషయము అర్థమగును.

శ్లో॥ 16. ద్వా విమౌ పురు షౌ లోకేక్షర శ్చాక్షర ఏవచ ।
క్షర స్సర్వాణి భూతాని కూటస్థో క్షర ఉచ్యతే ॥

శ్లో॥ 17. ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మే త్యు దాహృతః ।
యో లోకత్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః ॥

**భావము :- "లోకములో పురుషులు రెండు విధములు గలవారు కలరు. ఒకరు క్షరుడు (నాశనమగువాడు). రెండవవాడు అక్షరుడు, నాశనము కానివాడు. సర్వ జీవరాసులయందు జీవునిగా జీవించువాడు క్షరుడు అనబడుచున్నాడు. జీవునితో పాటు శరీరములోనే ఉండువానిని అక్షరుడని చెప్పుచుందురు."**

**"వీరు ఇరువురు కాకుండా ఉత్తముడగు పురుషుడు ఇంకొకడు గలడు. ఆయననే పరమాత్మయని చెప్పుచున్నాము. ఆత్మకంటే వేరుగా పరమాత్మగా యున్నవాడు మొత్తము ప్రపంచమంతా వ్యాపించిన అధిపతియైన దేవుడైయున్నాడు. అతడే అన్నిటినీ భరించు దేవుడు".**

ఈ రెండు శ్లోకముల వివరములో ప్రపంచములో ముగ్గురే పురుషులున్నారని అందులో ఒకడు జీవాత్మకాగా, రెండవ వాడు ఆత్మ

అనియూ చెప్పారు. మూడవ పురుషున్నే పరమాత్మయని చెప్పాము. ఇంతకుముందు ఆత్మను, పరమాత్మను గురించి చెప్పుకొన్నాము. అయితే జీవాత్మను గురించి తక్కువే చెప్పుకొన్నాము. ఇప్పుడు సందర్భమొచ్చినది కావున జీవాత్మను గురించి కొద్దిగా తెలుసుకొందాము. జీవాత్మ పురుష సంబంధమైనవాడే అయినా జీవుడు కూడా సృష్ఠింపబడినవాడే. సృష్ఠింపబడినవాడు ఎవడయినా, ఏదయినా వానికి కొన్ని ధర్మములుండును. సృష్ఠింపబడిన ఆత్మకే ధర్మములున్నప్పుడు జీవాత్మకు కూడా ధర్మములు గలవు. జీవాత్మకున్న ధర్మము ప్రకారము అతను ఏమీ చేయువాడు కాడు, ఏ పనీ చేతకాదు. ఎప్పటికయినా నశించి లేకుండా పోవువాడే. జీవాత్మ పురుషుడే అయినా పురుషత్వముతో ప్రకృతి లక్ష్యణములు కలిసియుండుట వలన పూర్తి పురుషుడని చెప్పక సగము మగతనము గలవాడేయని నపుంసకుడని చెప్పవచ్చును. నపుంసకుని శరీరమంతా పురుష ఆకృతిలో ఉండినా పూర్తి పురుష లక్ష్యణములుండక స్త్రీ లక్ష్యణములు కూడా కొన్ని కలిసి యుండును. అందువలన జీవునికి సంతతి లేదు. జీవుడు బీజదాత కాడు. జీవుడు దేనినయినా అనుభవిస్తూ శరీరములో నివశించుచున్నాడు. అతని కర్మప్రకారము లభించుదానిని అనుభవించు చున్నాడు. శరీరములో యున్న జీవుడు ఎట్టి పరిస్థితిలోనూ స్వయముగా చూచువాడు కాదు, వినువాడు కాదు. జీవుడు పూర్తి గ్రుడ్డివాడు, చెవిటివాడు. అంతేకాక ఏ జ్ఞానేంద్రియములు గానీ, కర్మేంద్రియములుగానీ లేని అవిటి వాడని చెప్పవచ్చును. గుండ్రని మొద్దులాంటివాడు జీవుడు. జీవునికి అందించబడేవాడు ఏదయినా అందిస్తే దానిని అనుభవించు వాడేగానీ స్వయముగా దేనినీ అందుకోలేడు. జీవాత్మ శరీరములో నివశించుచుండుట వలన జీవునికి ఆత్మే దేవుడుగా ఒకవైపు, కార్యకర్తగా పనులు చేసిపెట్టు

గుమస్తాగా మరొకవైపు ఉండుట వలన జీవుడు శరీరములో జీవించు చున్నాడు. ఆత్మ లేనిది జీవుడు మనుగడ సాగించలేడు. అందువలన జీవుడు, ఆత్మ ప్రతి శరీరములోనూ జోడు ఆత్మలుగా యున్నారు. జీవుడు బయట విషయములను తెలియుటకు ముఖ్యముగా బుద్ధిని జీవునికి దగ్గరగా దేవుడు పెట్టడము జరిగినది. అట్లే అతని (జీవుని) ధర్మము ప్రకారము మొదట బుద్ధి తర్వాత చిత్తము ఆ తర్వాత అహము అను మూడు అంతఃకరణములను వాటిని జీవుని చుట్టూ పెట్టగా శూన్యముగా నున్న జీవునికి ఒక ఆకారము వచ్చినది. జీవుని ఆకారమును క్రింద చిత్రపటములో చూడవచ్చును.

సాధ్యమున్నంతవరకు జీవునికి సంబంధించిన విషయమును తెలిపాము. ఇంకా ఏవయినా తెలుపని విషయములుంటే సందర్భాను సారము చెప్పెదము. ఈ చిత్రపటమును చూడడము వలన జీవునికి బుద్ధి, చిత్తము, అహము అవయవములవలె గలవు. ఆ మూడులో బుద్ధి జీవునకు బయట సమాచారములన్నియూ తెల్పుచుండును. జీవుడు




**జీవుని చిత్రపటము**

నపుంసకుడు అయినందున జీవునికి సంతానము ఉండదు. అయితే పుట్టే పిల్లలందరూ ఎవరి సంతతి?యని ప్రశ్న రాగలదు. ఆ విషయమై చెప్పితే శరీరములోని ఆత్మయే సర్వ జీవరాసులకు బీజదాతగా యున్నది. ప్రకృతి చేత శరీరమును తయారు చేసి జీవునికి నివాసయోగ్యముగా తయారయిన తర్వాత ఆత్మయే శరీరమును తల్లిగర్భమునుండి బయటికి తీసుకరాగా అందులోనికి జీవుడు చేరుచున్నాడు (చేర్చబడుచున్నాడు). ఇట్లు జీవుడు క్రొత్త శరీరమును ఆత్మ ద్వారా పొందుచున్నాడు. జీవుని శరీరమునకు ఆత్మే బీజదాత అయినందున ప్రకృతి తల్లిగా యున్నది. ఆత్మ తండ్రిగా యున్నదని చెప్పవచ్చును. ఈ విషయమును ప్రథమ దైవగ్రంథమయిన భగవద్గీతలో గుణత్రయ విభాగ యోగమున మూడు, నాలుగు శ్లోకములలో చూడవచ్చును.

శ్లో॥ 3. మమయోని ర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధామ్యహమ్ ।
సంభవ స్సర్వ భూతానాం తతో భవతి భారత! ॥

శ్లో॥ 4. సర్వయోనిషు కౌంతేయ! మూర్తయః సంభవంతి యాః ।
తాసాం బ్రహ్మ మహద్యోనిః అహం బీజ ప్రదః పితా ॥

**భావము :- "మార్పుచెందే ప్రకృతి నా యొక్క యోని (గర్భము) కాగా దానికి నేను బీజదాతగా యున్నాను. ఇదే కారణము చేత ప్రపంచములో సకల జీవరాసులు ఉద్భవించుచున్నవని తెలియుము."**

**"సర్వ యోనులందు జన్మించు సకల జీవరాసులకు ప్రకృతి తల్లికాగా ఆత్మనయిన నేను తండ్రిగా యున్నాను. శరీరములో బీజదాతగా నేనే యుండుట వలన నేనే జీవుళ్లకు తండ్రిని."**

ఈ విధముగా శరీరములోని ఆత్మ కార్యకర్తగా యుంటూ శరీరములో జీవుల శరీరములు తయారగుటకు కావలసిన బీజమును ఆత్మే అందించుచున్నది. అందువలన ఆత్మను బీజదాతయని అన్నాము. ఆత్మ దేవుడుగా ఉంటూ మరొక ప్రక్క కార్యకర్తగా కూడా ఉన్నాడు. ఈ విషయమును ఖుర్‌ఆన్ గ్రంథములో సూరా ఆరు, ఆయత్ 102 లో చెప్పడమైనది.

**(6-102) "అల్లాహ్‌యే మీకు నిజమైన ఆరాధ్యదైవము. సమస్త జీవులను సృష్టించినవాడు ఆయనే. ఆయన కార్యకర్తగా కూడా యున్నాడు."** ఈ విధముగా చెప్పియుండుట వలన పై విషయమునకు సాక్ష్యముగా ఖుర్‌ఆన్‌లోని ఈ వాక్యము కనిపించుచున్నది. ఈ వాక్యము వలన మూడు గ్రంథములలోనూ దేవున్ని గురించిన సత్యము కలదని తెలియు చున్నది. ఆత్మ శరీరములో దేవుడుగా యుంటూ మరియు కార్యకర్తగా యున్నదను మాటను కొంత అర్థము చేసుకోవలసి యున్నది. ఎందుకనగా! రాజ్యములో రాజుగా యున్నవాడే కూలి పని చేయుచున్నాడు అంటే దానిని ఎవరూ ఒప్పుకోరు. రాజుగా యున్నవాడు ప్రజలందరికీ అధిపతిగా ఉండును. అటువంటివాడు తన హోదాను మరచి కూలి పనికి ఎందుకు పోవును? అను ప్రశ్న రాగలదు. అది అసత్యమని చెప్పుటకు అవకాశము గలదు. అయితే శరీరములో ఆత్మ దేవునిగా, కార్యకర్తగా రెండు విధముల పని చేయుట వాస్తవమేయని చెప్పుటకు ఖుర్‌ఆన్ గ్రంథములోని (6-102) వాక్యము కూడా అదే విషయమునే చెప్పుచున్నది. అందువలన ఇక్కడ అందరూ జాగ్రత్తగా ఆత్మను అర్థము చేసుకోవాలని చెప్పాము. ఆత్మను అర్థము చేయుటకు మేము కొన్నిచోట్ల అసత్యమును కూడా చెప్పవలసి వచ్చినది. కొన్నిపాళ్లు అసత్యము, కొన్నిపాళ్లు సత్యమును స్వయముగా

మేమే తెలిసి చెప్పడము వలన కొందరు కొంత అయోమయ స్థితికి గురి అయిపోయి చివరకు ప్రశ్నించుటకు మొదలుపెట్టుదురు. ఎప్పుడయితే ప్రశ్నించుటకు మొదలుపెట్టుదురో అప్పుడు సత్యమును గ్రహించు శక్తి వచ్చును. ఆత్మ విషయములో కొన్నిచోట్ల అదే జరిగినది. ఆత్మను గురించి చెప్పినా, పరమాత్మను గురించి చెప్పినా భగవద్గీతయందు **'ఆత్మ'**యని సంబోధించి చెప్పియుందురు. అట్లే ఆత్మను గురించి చెప్పినా, పరమాత్మను గురించి చెప్పినా వాక్యములో ఆయత్‌లో **'అల్లాహ్'** అని ఒకే పేరు చెప్పబడి యున్నది. అలాగే బైబిలు గ్రంథములో ఏ వాక్యము ఎవరికి చెప్పుచున్నామని వివరముగా చెప్పకుండా ఆత్మనుగానీ, పరమాత్మనుగానీ ఇద్దరినీ **'తండ్రి'** యని చెప్పడమైనది.

భగవద్గీత గ్రంథములో ఇద్దరినీ కలిపి 'ఆత్మ'యని చెప్పడము, ఖుర్ఆన్ గ్రంథములో ఇద్దరినీ కలిపి 'అల్లాహ్' అని చెప్పడము, బైబిలు గ్రంథములో ఇద్దరినీ కలిపి 'తండ్రి'యని చెప్పడము ప్రత్యక్షముగా యున్నది. అయితే ఆ విషయము మూడు గ్రంథములను చదువుచున్న మూడు మతముల వారికి కొద్దిగా కూడా తెలియదు. అల్లాహ్ అంటే 'ఒక్కడే అల్లాహ్'యని ముస్లీమ్‌లు అనుకోవడము జరుగుచున్నది. అలాగే తండ్రి యంటే దేవుడేయని క్రైస్థవులు అనుకోవడము జరుగుచున్నది. అదే విధముగా భగవద్గీతలో ఆత్మ అన్నచోటంతా హిందువులు ఒక్కటే ఆత్మ కలదని అనుకొంటున్నారు. ఆత్మ రెండు విధముల ఉన్నదని ఒకటి ఆత్మ మరొకటి పరమాత్మయని తెలియదు. అట్లే బైబిలులో తండ్రి అంటే ఇద్దరు కలరని క్రైస్థవులకు తెలియదు. అట్లే ఖుర్ఆన్ గ్రంథములో అల్లాహ్ అంటే ఒకే పదము ఇద్దరిని గురించి చెప్పినదని ముస్లీమ్‌లు తెలియలేకపోయారు. ఈ విధముగా మూడు మతములలోని ప్రజలు తమ గ్రంథములని చెప్పుకొను

వాటియందు గల సత్యమేదో తెలియక ఒకే పేరుతో చెప్పబడిన ఇద్దరిని ఒక్కరిగానే అనుకొంటున్నారు. ఆత్మ అనినా, తండ్రి అనినా, అల్లాహ్ అనినా ఇద్దరున్నారని అనుకొను అవకాశమే లేదు. ఎందుకనగా! దేవుడే అలా చేశాడు. 'ఎవరిని ఏ మార్గములో పంపాలో ఆ మార్గములోనే పంపుదును' అని ఖుర్ఆన్ గ్రంథములో సూరా ఆరు, ఆయత్ 110, 111లలో చెప్పినట్లు **దేవుడు మనుషలను అజ్ఞాన మార్గములో అయినా పంపగలడు, లేక జ్ఞానమార్గములోనయినా పంపగలడు.** అది అంతయూ మనిషి విధానమును బట్టి దేవుడు నిర్ణయించును అని చెప్పుకొన్నాము.

"అల్లాహ్ ఒక్కరే మీ ఆరాధ్యదైవము, ఆయన తప్ప ఇతరులు ఎవరూ లేరు" అని ఖుర్ఆన్ గ్రంథములో (6-102) వాక్యములో గలదు. అక్కడ చెప్పినది పూర్తి సత్యమే. మనిషికి ఆరాధ్యదైవము ఒక్కడే. ఇద్దరు ఎక్కడా లేరు. ఇద్దరు ఉన్నారని ఏ దైవ గ్రంథములో చెప్పలేదు. అయితే మా ప్రశ్న ఏమంటే 112వ సూరాలో వ్రాసినట్లు **"దేవుడు ఎవరి అక్కరా లేనివాడు"** అని గలదు. అంటే ఆరాధన అక్కర కూడా లేనివాడు అని అర్థము. అక్కడ చెప్పిన వాక్యములో అల్లాహ్‌కు ఏ ఆరాధన అక్కర కూడా లేదని అర్థము. అంతేకాక 112వ సూరాలో చెప్పిన మరొక వాక్యము ప్రకారము **"అల్లాహ్‌కు ఎవరూ సంతానము కాదు"** అని వుంది. కొన్నిచోట్ల **"అల్లాహ్ సర్వమును, సర్వమానవులను సృష్టించెను"** అని వుంది. దీని ప్రకారము అందరినీ సృష్టించిన దేవుడు ఒక్కడుండగా, ఎవరిని సృష్టించినా, ఎవరికీ తండ్రి కాని దేవుడు, ఎవరికీ పుట్టని దేవుడు మరొకడు గలడని 112వ సూరాలోని రెండు మూడు వాక్యముల ద్వారా తెలియుచున్నది. ఇక్కడ సృష్టి పూర్వముగల దేవున్ని గురించి చెప్పినారని, అప్పుడు అతను ఒక్కడు తప్ప ఎవరూ లేరని కూడా మొదటి వాక్యములోనే గలదు. సృష్టి

తర్వాత దేవుడు, జీవరాసులు అన్నీ గలవు. సృష్టి పూర్వము దేవుడు ఒక్కడే గలడు. దేవుడు తప్ప ఏ మానవుడు లేడు. ఇట్లు భగవద్గీతలోని ఆత్మ, పరమాత్మలను, బైబిలులోని తండ్రి, పరిశుద్ధాత్మలను గురించి మనిషి ఆలోచించి జ్ఞానమును తెలియవలసియున్నది. గ్రంథములో ఏమి చెప్పారో తెలియనిదే ఎవ్వరూ జ్ఞానులు కాలేరు.

**ప్రశ్న :- దైవగ్రంథములలో ఇద్దరినీ కలిపి ఒకే పేరుతో ఎందుకు చెప్పారు? అలా చెప్పడము వలన ఎవరయినా తెలిసిన పేరు ఒక్కని పేరేయని అనుకొందురుగానీ ఒకే పేరులో ఇద్దరున్నారని అనుకోరు. అట్లుకాకుండా దైవ గ్రంథములలో ఒకే పేరును ఎందుకు చెప్పలేదు? ఆత్మను ఆత్మని, పరమాత్మను పరమాత్మయని చెప్పియుంటే పొరపాటు పడేదానికి అవకాశము ఉండదు కదా! దీనికి మీరేమంటారు?**

**జవాబు :-** దేవుని జ్ఞానము స్థూలముగా బహిర్గతముగా ఎక్కడా చెప్పి యుండలేదు. మూడు గ్రంథముల యందును సూక్ష్మజ్ఞానము చెప్పబడినది. సూక్ష్మజ్ఞానము సామాన్యముగా ఎవరికీ అర్థము కాదు. దేవుడు తన విషయములో అనగా తన పేరు విషయములో విడదీసి చెప్పక ఇద్దరినీ కలిపి ఒకే పేరుతో చెప్పినట్లు దైవగ్రంథములలో గలదు. దేవుడు అర్థము కాకూడదనే అలా చెప్పాడు. తన జ్ఞానము మీద ఆసక్తి కలవానికి మాత్రమే అర్థమగునట్లు మిగతా ఎవరికీ అర్థముకానట్లు ఉండవలెనను ఉద్దేశ్యముతోనే అలా చేశాడు. ఎవనికయితే దేవుని మీద, దేవుని జ్ఞానము మీద ఆసక్తియుండునో వాడు సత్యమును తెలియాలని ప్రయత్నము చేయును. అట్టివానికి దేవుడు స్వయముగా వాని అంతరంగములోనే సత్యము అర్థమగులాగ చేయును. దేవుని మీద పూర్తి ధ్యాస లేనివారు తాము

ఎంత జ్ఞానులవలె నటించినా వారికి దేవుడు సత్యమును తెలియ నివ్వడు. తనమీద ధ్యాస లేకున్నా, ఉన్నట్లు నటించు వారికి తన విధానము తెలియకూడదని, దేవుడు ఉద్దేశ్యపూర్వకముగా ఒకే పేరులోనే ఇద్దరిని చెప్పాడు. దేవుడు అన్నీ తెలిసే చేశాడు. అందువలన ఆయనను **"వివేక వంతుడు"** అని అనవచ్చును. దేవుడు నేరుగా తన జ్ఞానమును తెలియునట్లు ఉంచక అనేక మలుపులు త్రిప్పియుంటాడని తెలియుచున్నది.

**ప్రశ్న :- దేవుని విషయము అటుంచి మీ విషయము అడుగుతాము సమాధానము చెప్పండి. మీరు ఇదే సంవత్సరము పది నెలల క్రితము వ్రాసిన "తెలుగు" అను చిన్న గ్రంథములో 29వ పేజీలో ఇలా వ్రాశారు. "బ్రహ్మవిద్యా శాస్త్రములో ఆత్మ ధర్మములను గురించి వెదకినా ఏ పేజీలో దొరకదు. దేవునికి ధర్మములున్నాయని చెప్పవచ్చును. అయితే ఆత్మకు ధర్మములున్నవని ప్రపంచములో ఎవడూ చెప్పలేదు. ఎందుకనగా! ఆత్మకు ధర్మములు లేవు. ఆత్మ ధర్మములకు అతీతముగా యున్నది." అని వ్రాయడము జరిగినది. ఈ గ్రంథములో ప్రారంభములోనే దేవునికి ధర్మములు లేవు అనీ, ఆత్మకు ధర్మములున్నవని చెప్పారు. తెలుగు గ్రంథములో దానికి విరుద్ధముగా "దేవునికి ధర్మములు గలవు, ఆత్మకు ధర్మములు లేవు" అని చెప్పారు. మీరు ఆ గ్రంథములో చెప్పిన మాటకు ఈ గ్రంథములో చెప్పిన మాటకు పూర్తి విరుద్ధముగా చెప్పారు. రెండుచోట్ల పొందిక లేకుండా రెండు విధముల ఎందుకు చెప్పారు? దీనికి జవాబు ఏమి చెప్పగలరు?**

**జవాబు :-** మీరు అడిగినదాని ప్రకారమే నేను రెండు విధముల కనిపించు నట్లు వ్రాశాను. నేను 29వ పేజీలో ఆ విషయమును వ్రాయక ముందే

28వ పేజీలో భగవద్గీతలోని రెండు శ్లోకములకు అర్థము నాకు తెలిసి మనుషుల దృష్టిని మరల్చి శ్లోకముల భావమును అదే పనిగా దారి తప్పించి వ్రాశాము. అందులో సత్యమును కొద్ది మాత్రము చెప్పి మిగతా భావమును అంతటినీ పరమాత్మ మీదికి మరల్చి వ్రాశాము. అక్కడ మోక్ష సన్న్యాస యోగములోని 61, 62 శ్లోకముల వద్ద ఎంతో జాగ్రత్తగా వ్రాయవలసి వచ్చినది. అట్లే 65, 66 శ్లోకములకు భావమును వ్రాయునప్పుడు మూడు వంతుల సత్యము, ఒక వంతు అసత్యమును కొలత వేసి చెప్పాము. అక్కడ నాలుగు శ్లోకములకు అసలయిన భావము తెలిసి మనిషిని ఇంకా ముందుకు తీసుకపోవుటకు, జ్ఞానమార్గములో ఏ ఆటంకములు తర్వాత కాలములో కలుగకుండుటకు యోచించి అలా చెప్పవలసి వచ్చినది. నిజ భావమును దారిమళ్లించి అక్కడ సత్యమును చెప్పక అసత్యమును తెలిసే చెప్పాను అని అక్కడే 28వ పేజీలో వ్రాసినది చూసియుంటే 29వ పేజీలో వ్రాసినది అతిశయోక్తి కాదు.

ఇప్పుడు నేను ప్రశ్నిస్తాను, మీరు జవాబు చెప్పగలరా? నేను 29వ పేజీలో దేవుడు, ఆత్మయని రెండు పేర్లు చెప్పాను. ఆత్మను దేవుడని కూడా అనవచ్చునని గ్రంథము ప్రారంభములోనే చెప్పాను. నేను అక్కడ దేవునికి ధర్మములున్నవి అన్నప్పుడు **'దేవుడు'** అను పదమును ఆత్మని అర్థము చేసుకోవచ్చు కదా! అట్లే ఆత్మకు ధర్మములు లేవు అన్నప్పుడు **'ఆత్మ'**ను దేవుడని అర్థము చేసుకోవచ్చును కదా! ఆత్మను దేవునిగా, దేవున్ని ఆత్మగా చెప్పుకొంటే ధర్మములుండడము, లేకుండా పోవడము సరిపోవును కదా! ఆత్మకు, దేవునికి తారతమ్యము తెలియనప్పుడు ఆత్మను దేవునిగా దేవున్ని ఆత్మగా చెప్పవచ్చును. ఎప్పుడయితే వాటి రెండింటి భేదము తెలిసినదో, అప్పుడు వేరువేరుగా విడదీసి చెప్పుకోవలసి వచ్చును. అప్పుడు

కూడా ధర్మములున్న వాడు, ధర్మములు లేనివాడని విభజించి చెప్పవచ్చును గానీ, ఆత్మ దేవుడు అను పదములను విడదీసి చెప్పలేము. రెండు పేర్లు ఇద్దరికి వర్తించునవిగా యున్నవి. అయితే మనకు తెలిసిన సత్యము ప్రకారము సృష్టికర్తయినవాడు పరమాత్మయనీ, సృష్టింపబడినవాడు ఆత్మని చెప్పు చున్నాము. ఆత్మకంటే వేరయినది పరమాత్మయను అర్థముతో పిలుస్తున్నాము. సృష్టికర్తయిన పరమాత్మకు ధర్మములు లేవు. అట్లే సృష్టింపబడిన ఆత్మకు ధర్మములు కలవు. తెలుగు గ్రంథములో 29వ పేజీలో నేను చెప్పిన ఆత్మయే దేవుడు అని తెలియవచ్చును కదా!

భగవద్గీతా గ్రంథములో ఆత్మను పరమాత్మను ఇద్దరినీ కలిపి ఆత్మని చెప్పారు. మీరు గమనించవలసిన విషయము ఏమనగా! ఇప్పుడు నేను చెప్పువరకు ఎక్కడ పరమాత్మను చెప్పారో, ఎక్కడ ఆత్మను గురించి చెప్పారో భగవద్గీతలో తేల్చి చెప్పలేదు. అనువాదకులు కూడా దానిని తేల్చి ఇక్కడ ఆత్మను గూర్చి చెప్పారనీ, అక్కడ పరమాత్మను గూర్చి చెప్పారని విడదీసి వ్రాయలేదు. విడమరచి అర్థమును చెప్పలేదు. అట్లే బైబిలు గ్రంథములో తండ్రియని చెప్పిన పదము ఆత్మకు చెప్పబడినది, అట్లే పరమాత్మకు చెప్పబడినది. ఇక ఖుర్ఆన్ గ్రంథములోని జ్ఞానమును చూస్తే అల్లాహ్ అను పదమును చెప్పియున్నా, అల్లాహ్ ఒక్కడేయని ముస్లీమ్‌లు అందరూ ఏకకంఠముతో చెప్పినా అందులో ధర్మములున్న శరీరములోని ఆత్మను, ధర్మములు లేని పరమాత్మను సృష్టిపూర్వము ఏ అక్కర లేనివాడు నిజమైన అల్లాహ్‌నా, లేక మనుషులను సృష్టించిన అందరి ఆరాధనలతో అక్కర గలవాడు అల్లాహ్‌నా? యను ప్రశ్న రాగలదు. గ్రంథములో ధర్మములున్న, ధర్మములు లేని దేవుళ్ళు ఇద్దరు ఉండుట వలన వారి ఇద్దరిలో నిజమైన అల్లాహ్ ఎవరు? అను సంశయము ఏర్పడును. ఈ రెండు విధానములను

మూడు గ్రంథములలో ఇంతవరకు తేల్చి ఎవరూ చెప్పలేదు. దైవ గ్రంథములు వారిని విడదీసి చూపకుండా ఉండుట వలన మనిషి చివరకు దేవుని మీదనే ఆధారపడవలసి యున్నది. చివరకు తేల్చి చెప్పువాడు దేవుడేయని ఎదురు చూడవలసిందే!

భగవద్గీతలో జ్ఞానయోగమున 7, 8 శ్లోకములలో చెప్పినట్లు దేవుడు మనిషిగా పుట్టివచ్చి అణగారిపోయిన దైవ ధర్మములను తెలిపిపోవును. అప్పుడు మనిషి ధర్మముల ప్రకారము నడుచుటకు మొదలుపెట్టును. తర్వాత కొంత కాలమునకు శరీరములోని దేవుడయిన ఆత్మ అధర్మములను పునరుద్ధరించును. దానితో కాలము జరుగుకొద్దీ అధర్మములు ఒక్కొక్కటిగా బయటికి బలపడిపోవును. సృష్ట్యాదినుండి ధర్మములు ఉన్నవి. అట్లే సృష్ట్యాది నుండి అధర్మములు ఉన్నవి. అయితే కొంతకాలము అధర్మములు వృద్ధిచెందగా తర్వాత పరమాత్మ భూమిమీద మనిషివలె అవతరించి తిరిగి ధర్మములను తెలిపిపోవును. ఈ విధానము సృష్ట్యాదినుండి ఇప్పటి వరకు చక్రమువలె జరుగుచూ, తిరుగుచూ వచ్చుచున్నది. దీనినిబట్టి ధర్మములు తెలుపువాడు బయటి దేవుడు, అధర్మములను వృద్ధి చేయువాడు లోపలి దేవుడు అని చెప్పవచ్చును.

శరీరము లోపలగల మూడు ఆత్మలలో మధ్యాత్మ జీవునికి దేవుడై యుండి మరియు కార్యకర్తగా ఉండుట వలన, దేవునిగా మనిషి జీవనమును సాగించుచున్నది. మనిషిలో కార్యకర్తగాయుండి శరీరములోని అన్ని కార్యములను చేయుట వలన జీవుడు బ్రతకగల్గుచున్నాడు. ఆత్మ మనిషి యొక్క భావమును బట్టి వానికి కర్మను, శ్రద్ధనుబట్టి జ్ఞానమును అందించు చుండును. అజ్ఞాన శ్రద్ధ గలవానికి అజ్ఞానమును, అధర్మములను ఆత్మయే బోధించును. సృష్ట్యాదిలో దేవుడు ఆత్మను సృష్టించి, ఆత్మకు పని కల్పించాడు.

సృష్ట్యాదిలో దేవుడు ఆత్మను తయారు చేసి ఆత్మకంటే తాను వేరుగా యుంటూ పరమాత్మయని పిలువబడుచున్నాడు. పరమాత్మ ఆత్మను శరీరములో దేవునిగా నియమించినది. అట్లే కార్యములు చేయునట్లు కూడా నియమించినది. పరమాత్మ ఆజ్ఞప్రకారము ఆత్మ మనిషికి జ్ఞానమును గానీ, అజ్ఞానమునుగానీ అందించును. ఆత్మ శరీరములో దేవుడుగా ఉంటూ తన తండ్రియైన పరమాత్మ అందించిన ఆజ్ఞప్రకారము దేవుడుగా ఉంటున్నది. ఆత్మను దేవున్ని చేసి పరమాత్మ ఎవరికీ తెలియకుండా పోయాడు. దైవగ్రంథములలో ఆత్మజ్ఞానము విశేషముగా కలదుగానీ, పరమాత్మ జ్ఞానము చాలా తక్కువగా యున్నది.

పరమాత్మ సృష్ట్యాదిలో చేయవలసినదంతా చేసి తర్వాత తాను ఏమీ చేయకుండా, ఎవరికీ తెలియకుండా, ధర్మములకు దొరకకుండా స్థబ్దతగా ఉండిపోయాడు. అప్పటినుండి శరీరములో ఆత్మే జీవునికి దేవునిగా ఉంటూ వాని శ్రద్ధనుబట్టి వానికి జ్ఞానమును, అట్లే అజ్ఞానమును అందించు చుండుట వలన, మనుషుల శ్రద్ధ అజ్ఞానము మీద ఉండుట వలన, శరీరములోని దేవుడు అధర్మములను కూడా బోధించి పెంచి పోషిస్తున్నాడు. అటువంటి స్థితినుండి మానవుడు బయటపడి, తిరిగి ధర్మముల వైపు పోవుటకు పరమాత్మ అంశనుండి మానవ అవతారము పుట్టుకొస్తున్నది. అతనినే **"భగవంతుడు"** అని అంటున్నాము. అలా వచ్చిన వాడు మనిషి అయినా అతనిలో దైవ అంశ ఉండుట వలన దేవదూతలయిన దేవుని పాలకులందరూ ఆయనకు నమస్కరించుచున్నారు. భగవంతుడు అనగా దేవుడు ప్రత్యేకముగా పంపిన మానవుడు అని తెలియవలెను. భగవంతుడు కొన్ని వేల సంవత్సరములకో, లేక లక్షల సంవత్సరములకో భూమిమీదికి రావడము జరుగును. అప్పుడు శరీరములో ఆత్మదేవుడు, శరీరముతో

వచ్చిన దేవుడు, సృష్ట్యాదినుండి తెలియకుండా యున్న పరమాత్మ **ముగ్గురు** దేవుళ్ళుగా యున్నారు.

భగవంతునిగా వచ్చిన వాడు మనిషే అయినా ఆయనను 'తాత్కాలిక దేవుడు' అని అనవచ్చును. భగవంతునిగా వచ్చినవాడు ఎవడో ఎవరికీ తెలియదు. భగవంతునిగా వచ్చినవాడు బయటి దేవుడు అయినందున ఫలానావాడు భగవంతుడని తెలిస్తే కూడా మోక్షము లభ్యమగును. ఇదే విషయమునే భగవద్గీత జ్ఞానయోగము అను అధ్యాయములో తొమ్మిదవ శ్లోకములో చెప్పియున్నారు ఒకమారు చూడండి.

శ్లో॥ 9. జన్మ కర్మచ మే దివ్య మేవం యో వేత్తి తత్త్వతః ।
త్యక్త్వా దేహం పునర్జన్మనైతి మామేతి సోఽర్జున! ॥

**భావము :- "కొద్దిమాత్రమున నేను ఫలానా చోట పుట్టానని నా జన్మను, నేను ఫలానా పనులు చేయుచున్నానని తెలిసిన మనిషి మరణించిన తర్వాత వేరు జన్మలో పుట్టడు. అతడు నేరుగా నాలోనికి ఐక్యమగును."**

ఒక మనిషి మోక్షము పొందుటకు ముందు వాడు చేసుకొన్న కర్మలన్నీ లేకుండా పోవలెను. మనిషి క్రొత్త కర్మలు కాకుండా పాత కర్మలనే అనుభవించినా అవి ఇంకా కొన్ని జన్మలకు సరిపడు కర్మలను మనిషి సంపాదించుకొన్నాడు. మనిషి తన కర్మలన్నిటినీ లేకుండా చేసుకున్నప్పుడు ముక్తి (మోక్షము) లభించును. కర్మలన్నీ పోవుటకు రెండే అవకాశములు గలవు. ఒకటి కర్మలను క్రొత్తవి రాకుండా చేసుకొని పాతవి అనుభవించితే, అవి ఎప్పుడు అయిపోతే అప్పుడు మనిషికి ముక్తి వచ్చును. మనిషి కర్మ యోగము ద్వారా కర్మలను అంటకుండా చేసుకోవచ్చును. అయితే మనిషికి కర్మయోగము అంటే ఏమిటో తెలియదు. మనిషి ఎంత జ్ఞానము తెలిసినా

యోగము అంటే ఏమిటో, ఎట్లు ఆచరించవలెనో తెలియని స్థితిలో ఉన్నాడు. అప్పటికి మంచి గురువు లభించి కర్మయోగము తెలిసి, కర్మయోగిగా మారితే కొంత కాలానికిగానీ, కొన్ని జన్మలకుగానీ వాని కర్మ అయిపోవును. అప్పుడు వాడు ముక్తి పొందుటకు అవకాశముండును.

భగవద్గీతలో దేవుడు రెండు యోగములను చెప్పాడు. ఆత్మ ధర్మముల ప్రకారము లేక దైవ ధర్మముల ప్రకారము కర్మయోగము, బ్రహ్మ యోగము అని రెండు యోగములు గలవు. మూడవది భక్తియోగము అనునది కలదు. అది ధర్మములకు అతీతమైనది. భక్తియోగము చాలా ప్రత్యేకమైనది. ఎందుకనగా! కర్మయోగములో ఒక సంవత్సరము కాలములో కాలిపోవు కర్మ **భక్తియోగము**లో ఒకే దినము కాలిపోవును. చాలా వేగముగా కర్మనాశనమగు యోగము భక్తి యోగము. మన శరీరములోని మనస్సును అణచివేస్తే మనస్సు పని చేయని కాలములో బ్రహ్మయోగము అగును. మనస్సును పని చేయకుండా చేయడము చాలా కష్టమైనది. ఎందుకనగా! మనస్సు చాలా బలమైనది, అది మనిషి ప్రయత్నమునకు లొంగక ఇబ్బంది పెట్టును. అందువలన వేమన యోగి తన పద్యములలో మనస్సును గురించి ఒక పద్యమును చెప్పాడు. ఆ పద్యమును దాని భావమును క్రింద చూడండి.

**కుక్కను తిన్నవాడు గురులింగ జంగడు**
**పందిని తిన్నవాడు పరమయోగి**
**ఏనుగును తిన్నవాడు ఎంత సుజ్ఞానో**
**విశ్వదాభిరామ వినురవేమా.**

**భావము :-** మన శరీరములో మనస్సు కుక్కవలె అతి చంచలమైనది. ఒక్క క్షణము కూడా స్థిరముగా ఉండక కుక్క ఇల్లిల్లు తిరిగినట్లు మనస్సు

కూడా విషయముల మీదికి చరించుచుండును. కుక్కమాదిరి చంచలమైన మనస్సును ఎవడు జయించునో వాడు నిజముగా గురువుతో సమానమే. గురువు మనస్సును జయించి ఉన్నవాడను విషయమును 'కుక్కను తిన్నవాడు గురులింగడని' పై పద్యములో చెప్పారు.

మనస్సు చంచలమైనదియేకాక పరమనీచమైన విషయముల మీదికి కూడా పోవుచుండును. అందువలన దీనిని పందితో సమానముగా పోల్చి దానిని జయించిన పరమయోగి అని తెల్పుచూ 'పందిని తిన్నవాడు పరమ యోగి' అని వర్ణించారు.

మనస్సు చంచలమైనది, నీచమైనదియేకాక దృఢమైనది, బలమైనదిగా కూడా ఉన్నది. దానిని జయించవలయునని ప్రయత్నము చేసిన వారికి సులభముగా లొంగదు. ఎంత బలముగా మనస్సును నిలుపవలయునని ప్రయత్నము చేసినా అది బలమైనది కనుక పోవుచునే ఉండును. ప్రయత్నమను పగ్గములకు నిలబడక మనలను సులభముగా లాగుకొని పోవు మనస్సు బలమైనదిగా వర్ణించుచూ దానిని ఏనుగుగా పోల్చి చెప్పినారు. అటువంటి బలమైన మనస్సును జయించినవాడు సుజ్ఞాని అని చెప్పుచూ 'ఏనుగును తిన్నవాడు ఎంతో సుజ్ఞాని' అని అన్నారు.

మనస్సు చంచలమైనది కనుక కుక్కగను, నీచమైనది కనుక పందిగను, బలమైనది కనుక ఏనుగుగా వర్ణించి దానిని జయించుటను తిని లేకుండా చేయడమని వర్ణించి చెప్పినారు.

మనిషి శరీరములో అంతఃకరణములలో ఒకటయిన అహమును అణచివేస్తే అప్పుడు కర్మయోగమగును. కర్మయోగము మనుషులకు తెలియక చాలామంది సన్యాసత్వము తీసుకొని కాషాయగుడ్డలు ధరించారు.

కర్మయోగము పనులను చేయుటయందే కలదు. ప్రపంచములో కార్యములను చేయుచూ యోగము చేయు విధానము చాలామంది జ్ఞానులకు తెలియదు. కర్మయోగము గానీ, బ్రహ్మయోగము గానీ రెండూ నియమములతో కూడుకొన్నవై యుండును. భక్తియోగము నియమములు లేనిదై యుండును. మనిషి భక్తి యోగములో జీవితమంతా అనుభవించవలసిన కర్మను కొన్ని రోజులలోనే లేకుండా చేసుకోగలడు. వాడు చేసుకోవడము ఏమీ లేదు అదే భస్మమైపోవును. అటువంటి భక్తి యోగము వలన సులభముగా ముక్తి పొందవచ్చును. పరమాత్మ ధర్మసంస్థాపన కొరకు భూమిమీద మనిషి అవతారములో వచ్చినప్పుడు ఆయన ఎవరికీ తెలియకుండా ఉండును. అయితే ఆయన బోధించు ధర్మములను బట్టి, జ్ఞానమును బట్టి అతను ఫలానావాడని గుర్తించుటకు అవకాశము గలదు. జ్ఞానము, ధర్మముల ఆధారముతోనే ఆయనను గుర్తించవచ్చును. అయితే మాకు తెలిసి భారతదేశములో ఐదువేల సంవత్సరముల పూర్వము ఒకమారు, ఇజ్రయేల్ దేశములో రెండువేల సంవత్సరముల పూర్వము ఒకమారు దేవుడు భగవంతునిగా వచ్చి పోయినట్లు కొన్ని ఆధారములు లభించాయి. అయితే ఆయన వచ్చిపోయిన తర్వాత ఫలానావాడు భగవంతుడు అని తెలిసినా ప్రయోజనము లేదు. ప్రస్తుత కాలములో అనగా వ్యక్తమాన కాలములో (వర్తమాన కాలములో) భగవంతుని జన్మను గురించి తెలియగల్గితే అటువంటి వాని జన్మ సార్థకమయినట్లే. వాడు సులభముగా మోక్షము పొందును. వానికంటే అదృష్టవంతుడు ఇంకొకడుండడు.

నాకు తెలిసి ఐదువేల సంవత్సరముల పూర్వము కృష్ణుడు భగవంతునిగా భూమిమీదికి వచ్చాడు. అప్పుడు 126 సంవత్సరములు బ్రతికినా ఏనాడు ఆయన జ్ఞానమును బయటికి చెప్పలేదు. ఆయన

జీవితములో మంచి చెడు అన్ని కార్యములు చేయుచూ జీవించాడు. ఆయన జీవితమును చూస్తే ఆయనను భగవంతుడు అనే దానికి ఏమాత్రము అవకాశము లేదు. ఎలా బ్రతికినా దానిని వదలి చూస్తే ఆయన తన జీవితములో ఒక్కమారు తప్ప ఎప్పుడు దైవజ్ఞానమును చెప్పలేదు. అదియూ ఆయన చెప్పినట్లు అర్జునుడు చెప్పితే విన్నాము, అంతేగానీ ఆయన జ్ఞానము చెప్పినది మనుషులు ఎవరూ చూడలేదు. ఆయన ఉన్న రోజులలో కృష్ణుడు యుద్ధరంగములో అర్జునకు జ్ఞానము చెప్పాడని కూడా ఎవరికీ తెలియదు. తర్వాత కొంత కాలమునకు వ్యాసుడు భగవద్గీతను గ్రంథరూపముగా వ్రాసినప్పుడు అది కృష్ణుడు చెప్పిన జ్ఞానమని తెలిసినది. అప్పటికి కృష్ణుడు చనిపోయాడు కావున ఆయనను గురించి తర్వాత తెలుసుకొనినా ప్రయోజనము లేదు. ఆయన బ్రతికియున్నప్పుడు కృష్ణున్ని గురించి తెలియుటకు ఆయన జీవితములో జ్ఞానము ఏ కోణములో చూచినా ఎవరికి కనిపించలేదు. ఆయన జ్ఞానము చెప్పాడు అని విన్నాము తప్ప చూచినది లేదు. అంతేకాక ఆయన ఇతరులకు ఎవరికీ చెప్పలేదు తనకు బంధువు అయిన అర్జునునికి మాత్రమే చెప్పాడు. ఎవరికీ తెలియకుండా రహస్యముగా రెండవ మనిషికి కూడా తెలియకుండా చెప్పాడు. ఇదంతయూ చూస్తే ఆయన చెప్పాడో లేదో అర్జునుడు, వ్యాసుడు ఇద్దరు కలిసి కృష్ణుడు చెప్పాడని పుకారు లేపారో అని అనుమానము రాకతప్పదు. భగవద్గీతను కృష్ణుడు చెప్పాడా? లేక కృష్ణుడు చెప్పాడని అర్జునుడే చెప్పాడా? ఇదంతయు కాక వ్యాసుడే జ్ఞానమును చెప్పి అర్జునుని మీద, కృష్ణుని మీద చెప్పుచున్నాడా? అని అనుమానము వచ్చుటకు అవకాశము గలదు. ఇవి అనుమానములే తప్ప వాస్తవములు కాదు.

కృష్ణుడు వచ్చినప్పుడు ఆయన వయస్సు దాదాపు 90 సంవత్సరముల తర్వాత జ్ఞానమును అర్జుననకు చెప్పడము జరిగినది.

చెప్పిన కూడా నెలలో, సంవత్సరములో కాదు  కేవలము పది నిమిషముల లోపే  అయిదు లేక ఆరు నిమిషములలో చెప్పడము జరిగినది.  కృష్ణుడు చెప్పినా అర్జునుని ద్వారా వినిన వ్యాసుడు  దానిని గ్రంథ రూపములో వ్రాసి 'భగవద్గీత'యని పేరు పెట్టాడు.  అలా పేరు పెట్టడము వలన కృష్ణుడు భగవంతుడని తెలియుటకు అవకాశము గలదు.  అది కృష్ణునికి ఇష్టము లేదు.  భగవద్గీత గ్రంథరూపముగా కృష్ణుడు చెప్పిన రెండు సంవత్సరములకే తయారయినది.  అప్పుడు ఇతర దేశములో గల 'మోషే' అను ప్రవక్తకు  కృష్ణుడు స్వప్నములో కనిపించి తన గ్రంథమును ఆయనకు ఇచ్చి దాని పేరు "తౌరాత్" యని చెప్పడము జరిగినది.  ఈ విధముగా భగవద్గీత పేరును స్వయముగా కృష్ణుడే భగవద్గీత యని చెప్పక  తౌరాత్ అని అర్థముతో కూడుకొన్న పేరును చెప్పడమైనది.  భగవద్గీతలో భగవంతుడుయని ఉండుట వలన భగవంతుడు చెప్పినది భగవద్గీతయని అందరూ అనుట వలన  తన విషయము బయటకు వచ్చు అవకాశము కలదని  ఇతర దేశములలో అదే భగవద్గీతనే ఇతర పేరుతో పిలుచునట్లు చేశాడు.  అది దేవుని సంకల్పమయిన దానివలన  తౌరాతు అంటే భగవద్గీతయని ఇంతవరకు మాకు తప్ప ఎవరికీ తెలియదు.  మోషే ఆనాడు భగవద్గీత (తౌరాతు) గ్రంథములోని జ్ఞానమును బయటికి చెప్పినా  అది భగవద్గీత జ్ఞానమని ఎవరికీ తెలియదు.  ఆనాడు మోషే చెప్పిన జ్ఞానమును ధర్మశాస్త్రములోనిది అని అన్నారు తప్ప  అది భగవద్గీతయని తెలియదు. నేడు క్రైస్థవ మతము వారికి మోషే పేరు పరిచయయినదే అయితే వారు మోషే చెప్పిన దానిని 'మోషే ధర్మశాస్త్రము' అని అంటున్నారు తప్ప అది మోషేకంటే ముందు ఎవరి నుండి వచ్చినదని తెలియదు.  మోషే ధర్మశాస్త్రమే తౌరాత్‌యనీ, తౌరాత్‌యే భగవద్గీతయని తెలియుటకు అవకాశముండుట

వలన మోషే తర్వాత తౌరాత్‌ను ఎవరు చూడలేదు. మోషే యున్నప్పుడు కూడా మోషే తప్ప తౌరాత్ గ్రంథమును ఎవరు చూడలేదు. అందువలన భగవద్గీతే తౌరాత్‌యని, తౌరాత్‌యే మోషే ధర్మశాస్త్రమని తెలియుటకు అవకాశమే లేకుండా పోయినది. మోషే ధర్మశాస్త్రము అను పేరు తప్ప అది ఏదో క్రైస్థవులకు తెలియదు. అట్లే తమకు పరిచయమున్న పేరు తౌరాత్‌యని ముస్లీమ్‌లు చెప్పినా అది ఏదో ముస్లీమ్‌లకు ఎవరికీ తెలియదు. అందువలన భగవద్గీత జ్ఞానము అన్ని మతముల వరకు ప్రాకినా భగవద్గీత పేరు మాత్రము హిందువుల వద్దనే నిలిచిపోయినది. హిందువులకు కూడా తౌరాత్ అంటే భగవద్గీతయని తెలియదు.

**ప్రశ్న :- భగవద్గీత జ్ఞానము ఇతర దేశములలో కొందరికి వారి గ్రంథములు బయటికి రాకనే ధర్మశాస్త్రముగా తెలిసియుంటే ఆ కాలములో జ్ఞానులయిన వారిలో కూడా భగవద్గీత జ్ఞానము కనిపించలేదు. ఏసుదేవున్ని భగవద్గీత ప్రకారము ఆత్మనో, పరమాత్మనో చెప్పక ఆత్మను తండ్రియనీ, దేవున్ని పరిశుద్ధాత్మయని ఎందుకు చెప్పాడు? దీనికి జవాబు చెప్పండి.**

**జవాబు :-** మోషే ఏసు పుట్టకనే తనకు తెలిసిన తౌరాత్ గ్రంథము యొక్క జ్ఞానమును చెప్పియున్నాడు. ఏసుకంటే మూడు వేల సంవత్సరముల ముందు మోషే చెప్పిన ధర్మశాస్త్రము వెలుగులోనికి వచ్చినది. ఏసు పుట్టిన తర్వాత ఏసు జీవితము పేదరికములోనే గడచినది. ఏసుకు ముప్పై సంవత్సరముల వయస్సు వచ్చు వరకు తల్లివద్దనే తన కుటుంబములో కలిసియున్నాడు. ముప్పై సంవత్సరముల తర్వాత ఏసు ఇల్లు వదలి వచ్చి ప్రజల మధ్యలో మూడు సంవత్సరములుండి జ్ఞానమును బోధించాడు. ఏసు తన ముప్పై సంవత్సరముల జీవితములో ఎప్పుడు జ్ఞానమును గురించి

నేర్వలేదు. ఏసు తల్లిని సోదరులను వదలిపెట్టి బయటికి వచ్చి స్వయముగా దేవుని జ్ఞానమును ప్రజలకు బోధించను మొదలుపెట్టాడు. ఆయన బోధించిన జ్ఞానము ఆయన నేర్చినది కాదు. ఆయన పుట్టకముందే ఆయనకు జ్ఞానము తెలియును. ఆయన బోధించిన జ్ఞానము భగవద్గీత జ్ఞానమునకు సమానమైనది. కృష్ణుడు చెప్పిన భాషకు, ఏసు చెప్పిన భాషకు తేడాయుండవచ్చును గానీ జ్ఞానములో ఏమి తేడా లేదు. చెప్పిన జ్ఞానము వేరుగాయున్నట్లు కనపించినా రెండు జ్ఞానముల భావము మాత్రము ఒక్కటే యుండును.

ఉదాహరణకు చెప్పితే భగవద్గీతలో పురుషోత్తమ ప్రాప్తి యోగమున 16, 17 శ్లోకములలో **క్షరుడు, అక్షరుడు, పురుషోత్తముడు** అని మూడు పేర్లు చెప్పాడు. దేవుడు మూడు ఆత్మలుగా విభజింపబడియున్నాడని విభజనలోని మూడు ఆత్మల పేర్లను క్షర, అక్షర, పురశోత్తములుగా చెప్పాడు. అదే విషయమునే ఏసు కూడా బైబిలు గ్రంథములో మత్తయి సువార్త 28వ అధ్యాయమున 19వ వచనమున **"తండ్రి, కుమారుడు, పరిశుద్ధాత్మ"** యని మూడు పేర్లను చెప్పాడు. భగవద్గీతలో చెప్పిన మూడు ఆత్మల పేర్లు వేరుగాయుండగా అదే మూడు ఆత్మలనే ఏసు చెప్పాడు. అయితే భాష వేరువేరుగా యుండుట వలన భగవద్గీతలోనిదే బైబిలులో ఉన్నదని, కృష్ణుడు చెప్పినదే ఏసు చెప్పాడని ప్రజలు గ్రహించలేకున్నారు. కృష్ణుడు చెప్పినది వరుసగా క్షరుడు, అక్షరుడు, పురుశోత్తముడు అని గలదు. అయితే ఏసు చెప్పినది వరుస క్రమములో ముందు వెనుక ఉండడము తప్ప వేరు ఏమీ లేదు. **క్షరుడు** అను పదమునకు సమానమైనది **కుమారుడు.** అలాగే **అక్షరుడు** అను పదమునకు సమానమైనది **తండ్రి. పురుశోత్తముడు** అను పదమునకు సమానమైనది **పరిశుద్ధాత్మయని** చెప్పవచ్చును. భగవద్గీత

ప్రకారమైతే మొదట కుమారుడు, తండ్రి తర్వాత పరిశుద్ధాత్మయని చెప్పవలెను. అయితే మొదట తండ్రియని చెప్పి తర్వాత కుమారుడని చెప్పడమైనది. ఎలా చెప్పినా కుమారునికంటే తండ్రి పెద్దవాడు, తండ్రి కంటే పెద్దవాడు పరిశుద్ధాత్మ. అందువలన మొదట కుమారుడు, తర్వాత తండ్రి ఆ తర్వాత పరిశుద్ధాత్మయని చెప్పవచ్చును. వరుస క్రమములో తండ్రి, కుమారుడు, పరిశుద్ధాత్మ యని గ్రంథములో చెప్పారు. అయితే మనము జ్ఞానరీత్యా కుమారుడు, తండ్రి, పరిశుద్ధాత్మయని అర్థము చేసుకోవలెను.

భగవద్గీతలో చెప్పినట్లు క్షరుడు అనగా నాశనమగువాడని అర్థము. నాశనమగు వాడు శరీరములోని జీవాత్మయే. బైబిలులో చెప్పిన కుమారుడు కూడ జీవాత్మయే. అక్షరుడు అనగా నాశనము కానివాడు. నాశనము చెందనివాడు ఆత్మయని తెలియవలెను. శరీరములోని దేవుడుగాయున్న ఆత్మ నాశనము కాదు. అలాగే బైబిలులో శరీరములోని ఆత్మదేవున్ని తండ్రియని చెప్పారు. జీవుడు నాశనమయిన దేవుడు నాశనము కానివాడని క్షర, అక్షరులని జీవాత్మ, ఆత్మలను ఉద్దేశించి చెప్పారు. అదే విధముగా కుమారుడు నాశనమయినా తండ్రి దేవునిగా ఉండుట వలన నాశనము కానివాడని చెప్పవచ్చును. భగవద్గీతలో చెప్పినట్లు పరమాత్మ సృష్ట్యాది దేవుడనీ, సృష్టి తర్వాత సృష్టింపబడిన దేవుడు ఆత్మయనీ, ఆత్మయే శరీరములో దేవునిగా నియమించబడియున్నాడని తెలుసుకొన్నాము. పరమాత్మ అయిన సృష్ట్యాది దేవుడు సృష్టి తర్వాత ఆత్మయను దేవునిగా నియమించి తనకున్న అధికారములన్నీ ఆత్మకు ఇచ్చాడని చెప్పినట్లు పరిశుద్ధాత్మ తన కుమారుడయిన ఆత్మకు అధికారములిచ్చెను అని యోహాన్ సువార్త ఐదవ అధ్యాయమున 21 నుండి 28వ వాక్యము వరకు చెప్పియున్నారు.

పరమాత్మ ప్రపంచమును సృష్ఠించిన తర్వాత ఆత్మను సృష్ఠించి తనకు పని లేకుండా సృష్ఠి విధానమునంతటినీ ఆత్మకు అప్పజెప్పి తాను ఊరక ఉండిపోగా ఆత్మ జీవున్ని మనిషిగా సృష్ఠించి మొత్తము ప్రపంచమును తయారు చేసినది. ఆత్మను స్త్రీ లింగముగా, పులింగముగా రెండు విధముల చెప్పవచ్చును. అందువలన చేసినది అని అన్నారు. ఇంకా చెప్పితే చేశాడు అని చెప్పవచ్చును. జీవులను శరీరములతో సృష్ఠించినది ఆత్మయిన దానివలన ఆత్మను తండ్రియని చెప్పవచ్చును. ఇంతకుముందు కూడా చాలామార్లు అందరికి తండ్రి ఆత్మేననీ, ఆయనే అందరికి బీజదాతయని అందువలన కనిపించే భౌతిక తండ్రి వలన ఎవరూ పుట్టలేదని చాలామార్లు చెప్పాము. అందువలన జీవులకు తండ్రి ఆత్మయని చెప్పవచ్చును. మనిషికి బీజదాత ఆత్మయగుట వలన మనిషి ఆత్మను తండ్రి అనవచ్చును. ఆత్మను పరమాత్మ సృష్ఠించిన దానివలన ఆత్మకు తండ్రి పరమాత్మయని చెప్పవచ్చును. అయితే వారిలో దేవుడు ఎవరు? అను ప్రశ్న వచ్చుచున్నది. సృష్ఠికి పూర్వము సృష్ఠికర్త అయినవాడు నిజమైన దేవుడు అయినా ఆయన సృష్ఠి తర్వాత తన పదవికి రాజీనామా ఇచ్చినట్లు తాను దేవునిగా ఉండక తన చేత సృష్ఠింపబడిన ఆత్మను దేవునిగా నియమించి తన అధికారము లన్నిటిని తన కుమారుడైన ఆత్మకు అప్పగించి, తన కుమారుడు ఒక్కడే మీకు ఆరాధ్యదైవము అనియు, తన కుమారుడే దేవుడనీ, ఆయన తప్ప భూమిమీద ఇంకొక ఆరాధ్య దైవము లేదని ఇంజీలు గ్రంథములోనూ (బైబిలులోనూ), ఖుర్ఆన్ గ్రంథములోను చెప్పియున్నాడు. ఈ విషయములు ఇంతకుముందే చెప్పియున్నాము. దేవుడు తన కుమారుడైన ఆత్మను దేవునిగా ప్రకటించిన తర్వాత తనను ఆరాధించక తన కుమారున్నే ఆరాధించమని ఎప్పటికయిన మనుషులందరికీ ఆరాధ్య దైవము ఒక్కడే ఉండవలెననీ,

తన కుమారున్ని ఆరాధిస్తే తనను ఆరాధించినట్లేననీ, తన కుమారున్ని ఆరాధించకపోతే తనను ఆరాధించనట్లేయని చెప్పియున్నాడు.

దీనిని బట్టి దేవుడు ఒక్కడేయని ఆయనే శరీరము లోపల యుండే ఆత్మని భగవద్గీతలో కూడా చెప్పబడినది. ఏ మనిషి అయినా దేవుడు ఒక్కడేయని చెప్పాలి. ఒక్క దేవున్నే ఆరాధించాలి. మానవులందరికీ దేవుడు మరియు తండ్రి శరీరములోని ఆత్మేకాగా, శరీరములోని ఆత్మకు తండ్రి పరమాత్మయని చెప్పవచ్చును. బైబిలు గ్రంథములో పరమాత్మను పరిశు ద్ధాత్మయని అంటున్నారని కూడా చెప్పాము. పరమాత్మ పరిశుద్ధాత్మగా పిలువబడగా ఆత్మను తండ్రియని కూడా అంటున్నాము. బాగా గమనిస్తే మనిషికి ఆత్మ తండ్రికాగా, ఆత్మకు తండ్రి పరమాత్మకాగా, మనిషికి పరమాత్మ తాతయగుచున్నాడని కూడా ముందే చెప్పాము. ఇదే విషయమునే భగవద్గీత యందు రాజవిద్యా రాజగుహ్య యోగమున 17వ శ్లోకములో చూడండి.

శ్లో॥ 17. పితాహ మస్య జగతో మాతా ధాతా పితామహః ।
వేద్యం పవిత్ర మోంకార ఋక్సామ యజురేవచ ॥

**భావము :- "ప్రపంచమునకు ఆత్మ రూపములో నేనే తల్లి, తండ్రిగా యున్నాను. పరమాత్మ రూపములో తాతగాయున్నాను".**

ఇట్లు భగవద్గీతలో చెప్పినట్లు పరమాత్మ జీవులకు తాతగా యున్నాడు. ఆత్మ తండ్రిగా యుండుట వలన పుట్టిన ప్రతి జీవి ఆత్మను తండ్రియని చెప్పవలసి యున్నది. అయితే జ్ఞానము తెలియని మనుషులు ఆత్మతో తమకున్న సంబంధము తెలియనివారై ఆత్మను దేవునిగాగానీ, తండ్రిగా గానీ చెప్పుకోవడము లేదు. హిందువులు దేవుడెవరో తెలియనివారై ప్రకృతియైన చెట్టుకు, గుట్టకు మ్రొక్కుచున్నారు. మిగతా మతముల

విషయానికి వస్తే వారు దేవుడు ఒక్కడేయని అంటున్నారుగానీ ఆ ఒక్కడు ఎవరో ఖచ్చితముగా చెప్పలేకున్నారు. క్రైస్థవులను అడిగితే తండ్రియైన ఆత్మ దేవుడా? లేక తాతయైన పరిశుద్ధాత్మ దేవుడా? యని తేల్చి చెప్పలేకున్నారు. అలాగే ముస్లీమ్‌లను అడిగితే అల్లాహ్ ఒక్కడే దేవుడు అంటున్నారు. ఆ ఒక్కడు సృష్ఠి పూర్వమున్న వాడా? లేక సృష్ఠి తర్వాత యున్న వాడా? అని అడిగితే ఇద్దరు ఎక్కడున్నారు? ఉన్నది ఒక్కడే కదా!యని అంటున్నారు. తమ గ్రంథమయిన ఖుర్‌ఆన్ గ్రంథములో (3-18) వ ఆయత్‌లోను, (6-102), (2-255) ఆయత్‌లలోనూ సృష్ఠి తర్వాత దేవుడున్నాడని, 112వ సూరాలోని నాలుగు ఆయత్‌లలోనూ సృష్ఠి పూర్వమున్న దేవుడున్నాడని వారికి తెలియకుండా పోయినది. సృష్ఠి పూర్వమున్న, సృష్ఠి తర్వాతగల దేవుళ్ళకు గల వ్యత్యాసమునే గ్రంథములో చెప్పియున్నా గ్రహించలేకపోవుచున్నారు. అంతిమ దైవగ్రంథములో సృష్ఠి తర్వాత దేవుడొక్కడేయని స్వయముగా సృష్ఠి పూర్వమున్న దేవుడు నిర్ణయించి చెప్పిన మాట (3-18) లో యున్నా దానిని తెలియకున్నారు. అదే విషయమునే అంతకు ముందు వచ్చిన దైవ గ్రంథమయిన ఇంజీలు గ్రంథములో (యోహాన్ 5-21 నుండి 26) వాక్యములలో యున్నట్లు చెప్పినా కూడా అర్థము చేసుకోలేకున్నారు. అందరికీ అల్లాహ్ ఒక్కడే దేవుడు అని, ఆయనే సృష్ఠి తర్వాత వచ్చినవాడనీ, సృష్ఠి పూర్వమున్న దేవునిచే ఈయనే మీ దేవుడు అని చెప్పబడిన వాడని గ్రంథములో యున్న జ్ఞానమును గ్రహించలేకపోవుచున్నారు. (2-117) దేవుడు పని చేయడనీ, ఆయన అయిపో అంటే అయిపోతుందని చెప్పారు. పని చేయని దేవుడు పని చేసే దేవున్ని సృష్ఠించి మనకు ఈయననే ఆరాధించమని చెప్పాడని (3-18) లో చెప్పాడు. దేవుడు పని చేసేవాడని ఆయన ఎప్పుడూ అలసిపోడనీ

నిద్ర, కునుకు లేకుండా పని చేయుచున్నాడని (2-255) లో చెప్పారు. దైవ గ్రంథములలో ఇద్దరు దేవుళ్ళున్నారనీ అందులో మనము ఆరాధించవలసిన దేవుడు గ్రంథము సాక్షిగా ఒక్కడే గలడని ముస్లీమ్‌లు తెలియకుండా పూర్తి జ్ఞానమును తెలియకుండా గ్రుడ్డిగా ఒక్కడే దేవుడని ఊత పదములాగ చెప్పుచున్నారు. ఒకే దేవుడని చెప్పుటకు శాస్త్రబద్ధత ఇట్లుందని ఉన్న విషయమును కూడా చెప్పలేకపోవుచున్నారు. మూడు దైవ గ్రంథములలోనూ ఒక్కడే దేవుడనీ, ఒక్క దేవున్నే ఆరాధించవలెనని చెప్పియున్నా ఆ విషయమును వివరముగా గ్రహించలేకున్నారు. ఎవరి గ్రంథము వారిదే, ఎవరి జ్ఞానము వారిదే, ఎవరి మతము వారిదే, ఎవరి దేవుడు వారికే అను భేదాభిప్రాయము కల్గియున్నారు. మూడు గ్రంథముల లోని సత్యమును తెలియకున్నారు.

ఇంతవరకు మనుషులకు దేవునికి గల సంబంధమును గురించి చెప్పాము. దేవుడు తనను సృష్ఠించినందుకు మనిషి దేవున్ని తండ్రియని అనవచ్చును. అలాగే సృష్ఠి పూర్వమున్న దేవున్ని తాతయని అనవచ్చును. అయితే మనిషిని పాలించుచున్న మనిషికి దేవుడైన ఆత్మ శరీరములో మనిషి కర్మనుబట్టి పాలించుచూ, భావమునుబట్టి కర్మలను అంటగట్టుచూ శ్రద్ధను బట్టి ధర్మములనో, అధర్మములనో కల్గించుచూ జ్ఞానములోనో, అజ్ఞానము లోనో ప్రయాణించునట్లు చేయుచుండును. ఆ విధానములో శరీరములోని ఆత్మే అధర్మములను అభివృద్ధి యగునట్లు చేయుచున్నది. శరీరములోని దేవుని వలన అధర్మములు, అజ్ఞానము అభివృద్ధికాగా అంతకుముందున్న జ్ఞానము, ధర్మములు తెలియకుండా పోవుచున్నవి. అధర్మములు మనుషులలో అభివృద్ధి అయ్యేకొద్దీ ధర్మములు లేకుండా పోవుచుండును. శరీరములో దేవుడు తన నియమము ప్రకారము జీవున్ని నడుపుచూ తన ధర్మము

ప్రకారము తాను నడుచుచుండును. ధర్మములు అడుగంటి పోయినా అధర్మములు చెలరేగి పోయినా శరీరములోని ఆత్మ ఏమీ చేయుటకు అవకాశము గానీ, అధికారముగానీ లేదు. శరీరములో ఒకటి దేవునిగా, రెండు కార్యకర్తగా ఉండునట్లు సృష్ట్యాదిలోనే తనను సృష్ఠించిన దేవుడు నియమించి ఉండుట వలన ఆ నియమము ప్రకారమే ఆత్మ పని చేయుచున్నది.

అధర్మములు చెలరేగి పోయినప్పుడు ధర్మములకు ముప్పు కల్గినప్పుడు తిరిగి ధర్మములను ప్రతిష్ఠించవలసిన బాధ్యత విశ్వమును సృష్ఠించిన సృష్ఠికర్తయిన మొదటి దేవునికి గలదు. సృష్ఠి తర్వాత విశ్రాంతి తీసుకొంటున్న దేవుడు అధర్మములను అణచివేసి ధర్మములను తిరిగి ప్రతిష్ఠించవలసి యున్నది. ఆ పని చేయడము మనకు తాతయైన పరమాత్మకే సంబంధమయి ఉన్నది. అయితే సృష్ఠికర్తయైన పరమాత్మ ఎవరికి తెలియకుండా రూపములేని వాడై, పని చేయనివాడై, పేరులేనివాడై యుండుట వలన ధర్మ ప్రతిష్టాపనకు తానే మానవ శరీరము ధరించి పుట్టుచున్నాడు. ఈ విషయమును భగవద్గీత జ్ఞానయోగములో ఆరవ శ్లోకములో చెప్పియున్నారు చూడండి.

శ్లో॥ 6. అజోపి సన్నవ్యయాత్మా భూతానా మీశ్వరో పిసన్ ।
ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మ మాయయా ॥

**భావము :- "చావు పుట్టుకలు లేనివాడు అయివుండి సర్వజీవరాసులకు ఈశ్వరుడైయుండి ప్రకృతితో కూడిన భౌతిక శరీరమును ధరించి సృష్ట్యాదిలోని దేవుడు మనిషివలె పుట్టుచున్నాడు".**

ఈ విషయమును ఇంతకుముందు కూడా చెప్పాము. పరమాత్మ యైన దేవుడు మానవ శరీరముతో పుట్టినప్పుడు అందరిలాగ ప్రసవింపబడిన శరీరములో జీవుడు చేరినట్లు చేరక తల్లి శరీరములోని శిశువులోనే జీవము కల్గి ప్రాణముతో సహా పుట్టును. అట్లు పుట్టడము ఒక్క దేవునికే (పరమాత్మకే) సాధ్యమగును. పరమాత్మ అయిన దేవుడు మనుషుల ఆరాధ్య దైవము కాకున్నా మనము ఆయనను దేవుడనియే పిలువవచ్చును. పరమాత్మ మొదటినుండి దేవుడే అయితే ఆరాధ్య దైవము మాత్రము సృష్ఠింపబడిన దేవుడయిన ఆత్మని తెలియవలెను. పరమాత్మ శిశువుగా పుట్టి సాధారణ మనిషి పెరిగినట్లే పెరుగును. దేవుడయిన పరమాత్మ ధర్మ ప్రతిష్టాపనకు అవతరించినా ఆయన సాధారణ మనిషివలె జీవితమును గడుపవలసి యుండును. మనిషి జీవితము గడచుటకు కర్మయను గణితము అవసరము. ప్రతి మనిషి కర్మ ప్రకారమే జీవితమును గడుపవలసియుండును. అందువలన తాను నియమించిన నియమముల ప్రకారము దేవుడు మనిషిగా వచ్చినా జీవించవలసియున్నది. కావున తాను పుట్టిన జీవితము గడుచుటకు సృష్ఠికర్తయిన దేవుడే కర్మను సృష్ఠించుకొని తాను బ్రతుకవలసిన విధానమును నిర్ణయించుకొని పుట్టుచున్నాడు.

సర్వ లోకములను సృష్ఠించిన దేవుడు తానే తన సంకల్పము చేత సామాన్య మానవుడువలె సృష్ఠింపబడినాడు. మనుషులకు ధర్మములను తెలియజేయు నిమిత్తము తాతయైన దేవుడు మనువని వేషములో పుట్టి మనువడు ఏడ్చినట్లు ఏడ్చి, మనువడు ఆడుకొనునట్లు ఆడుకొని, మనువడు పాలు త్రాగినట్లు పాలు త్రాగుచూ జీవితమును గడుపుచున్నాడు. ఎప్పుడో కొన్ని సంవత్సరముల తర్వాత చెప్పవలసిన జ్ఞానము కొరకు ప్రతి దినము మనిషివలె దేవుడు జీవించుచున్నాడు. కృష్ణుడు పది నిమిషములు చెప్పు

జ్ఞానము కొరకు సుఖదుఃఖమయమైన ఎంతో పొడవాటి జీవితమును 90 సంవత్సరములు గడిపి తన కార్యము అయిపోతూనే పోతే ఆ పని కొరకే వచ్చినట్లు ఇతరులు అనుమానపడకుండా తర్వాత కూడా 36 సంవత్సరములు బ్రతికి అసాధారణ మరణము పొందాడు. చివరిలో తన మరణము లోకమునకు కనువిప్పు అగునట్లు సంచలన వాక్యములు చెప్పి చనిపోయాడు. ఆయన మరణము తర్వాత కృష్ణుడు సాధారణ మనిషి కాదు అని అనుమానము వచ్చినది. వచ్చిన వాడు రాజు అయినా కూలి వాని వేషములో మన కొరకు వచ్చి పోవడము చూస్తే దేవుడు మనుషుల మీద ఎంతో శ్రద్ధకల్గి యున్నాడని తెలియుచున్నది. దేవుడు మన మీద శ్రద్ధతో మన కొరకు, మనకు ధర్మములను తెలుపు నిమిత్తము సాధారణ మనిషివలె వచ్చి జీవించడము ఎంతో బాధకరమైన విషయమైనా మనము మాత్రము దేవునిమీద శ్రద్ధ చూపకున్నాము. ఆయన చేసిన మేలును మరచినవారమై దేవుడంటే సులకన భావము కల్గియున్నారు.

సృష్ట్యాది దేవుడు సర్వ ప్రపంచమును సృష్ఠించిన దేవుడు ప్రకృతియను ముసుగు కప్పుకొని మారువేషములో తనను ఎవరూ గుర్తించనట్లు శరీరమును ధరించి వచ్చుచున్నాడు. శరీరమును ధరించితే సజీవమైన శరీరములో ఏమి ఉండునో అవన్నియు దేవుడు ధరించిన శరీరములో కూడా ఉండును. సర్వము వ్యాపించి, సర్వమును చూడగల్గిన దేవుడు సాధారణ కన్నుతో చూస్తున్నాడు అంటే ఎవరయినా నమ్మగలరా? నమ్మకూడదనే, తాను ఎవరయినది తెలియకూడదనే దేవుని ఉద్దేశ్యము. అలా ఎందుకు అంటే ఆయనను గుర్తించితే, ఆయన జన్మనుగానీ, పనులనుగానీ గుర్తుపట్టగలిగితే పుట్టినవాడు దేవుడేయని తెలియగలిగితే వాడు తిరిగి పుట్టడు, వానికి ఏ యోగము తెలియకున్నా సులభముగా

మోక్షము లభించును. అంత సులభముగా మోక్షము లభించుట దేవునికి ఇష్టము లేదు. మనిషి తన ధర్మములను తెలిసి అలాగే దేవుని ధర్మములను తెలియగలిగినప్పుడు ధర్మములు లేని దేవునిలోనికి ఐక్యమగునట్లు దేవుడు మోక్షము నిర్మించాడు. ధర్మముల ప్రకారమే మోక్షము పొందవలెనని దేవుడు అనుకొనుట వలన తనను, తన జన్మను రహస్యముగానే ఉంచుకొన్నాడు. అందువలన దేవుడు కృష్ణునిగా మనుషుల మధ్యలోనికి వచ్చినా ఎవరూ ఆయనను గుర్తించలేదు. అంతేగాక ఆయన మనుషుల చేత జారుడు,చోరుడు అని ఆరోపింపబడినాడు. అలా అరోపణలు పొందడము వలన కృష్ణుడు దేవుడని మేము చెప్పినా ఎవరూ నమ్మని స్థితి ఏర్పడినది.

సృష్ఠికర్తయైన దేవుడు ధర్మములు లేనివాడయినా, ధర్మములకు అతీతుడైనా తాను ధర్మచక్రమయిన దేహమును ధరించి రావడము జరుగు చున్నది. మనిషి శరీరములో నివసించుచూ కొంతకాలము ధర్మములను, కొంతకాలము అధర్మములను పొందుచుండుట వలన శరీరమును ధర్మచక్రమని పేరుపెట్టి చెప్పవలసి వచ్చినది. కనిపించే శరీరమును యంత్ర రూపముగా శరీరములోని ప్రతి భాగమును గుర్తించి చూస్తే అది ఒక చక్రమువలె కనిపించుచున్నది. ధర్మచక్రమును వెనుక పేజీలలో చిత్రించి చూచుకొన్నాము. ధర్మచక్రములో గల చెడు గుణములవైపుగల అధర్మములను శరీరములోనే అణచివేసి, మంచి గుణములవైపు గల ధర్మములను మంచి గుణముల సత్‌ప్రవర్తన ద్వారా అభివృద్ధి చెందునట్లు దేవుడే చేయుచున్నాడు. దేవుడు తెల్పు ధర్మములు శరీరములో సజీవమై పోవుచున్నవి. అంతకుముందు గల అధర్మములు నిర్జీవములై పోవుచున్నవి. అప్పుడు ధర్మముల బరువు ఎక్కును, అధర్మముల బరువు తగ్గును. అలా ధర్మముల బరువు మారుట వలన బరువున్న భాగము క్రిందికి, బరువులేని భాగము

పైకి తిరుగుచున్నది. అందువలన శరీరములో జరుగు మార్పును బట్టి శరీరమును ధర్మచక్రము అన్నాము.

ధర్మచక్రములో శరీరములోని అన్ని భాగములు ఉండుటయేకాక జీవాత్మ, ఆత్మ, పరమాత్మ ముగ్గురు కలరు. శరీరమను ధర్మచక్రములో ఆత్మ శరీరమంతటా అనగా చక్రమంతటా వ్యాపించి యున్నది. ఆత్మ స్థానము చక్రములో ఒకచోట ఉండినా చక్రమంతా వ్యాపించియున్నది. శరీరమంతా చూపుకల్గి యున్నది. పరమాత్మ చక్రములోనూ, చక్రము బయట అణువణువున కలదు. ఆత్మ చక్రములో మాత్రమున్నది. మిగతా జీవుడు ఒక్కచోట ఉన్న తాను శరీరమంతా యున్నట్లు 24 భాగములు తనవే అయినట్లు 24 భాగములుగా శరీరమంతా తానే ఉండునట్లు తలచు చున్నాడు. సృష్టికర్త అయిన దేవుడు తాను సృష్ఠించిన ప్రపంచములో తన ఆత్మ సృష్ఠించిన శరీరములో అంతటా యుండి తాను ప్రపంచమును అంతటిని చూస్తూ శరీరములోని ఆత్మను, జీవాత్మను చూస్తున్నాడు. దేవుడు నివసించు శరీరములో కూడా అన్ని శరీరములలో యుండునట్లు ఆత్మ, జీవాత్మ రెండూ ఉండును. దేవుడు శరీరములో కొన్ని సంవత్సరములు నివశించుచూ సమయ సందర్భమునుబట్టి మనుషలకు ధర్మములను తెలియ జేయుటకు ప్రయత్నించును.

కృష్ణుడుగా ధర్మచక్రమును ధరించినప్పుడు భగవద్గీతను చెప్పి పోయాడు. అలాగే ఏసు శరీరమును ధరించి వచ్చినప్పుడు బైబిలులో నాలుగు సువార్తల జ్ఞానమును చెప్పి పోయాడు. అలాగే ఖుర్ఆన్ జ్ఞానము కూడా చెప్పబడినది. మూడు దైవ గ్రంథములను చెప్పిన వారిలో ఇద్దరు మాత్రమే మానవ శరీరమును ధరించి వచ్చిన భగవంతులు కాగా, ఖుర్ఆన్‌ను చెప్పినవాడు 'జిబ్రయేల్' అను గ్రహము. జిబ్రయేల్ గ్రహమే

సూర్యగ్రహమని కూడా ఈ మధ్య కాలములో మనము చెప్పుకొన్నాము. 'ధర్మచక్రము' అను శరీరమును ధరించి వచ్చినవారు ఇద్దరు, అయినా మూడు దైవ గ్రంథములు చెప్పబడినాయి. అంతిమ దైవ గ్రంథము ఖుర్ఆన్‌లోని జ్ఞానము దానికంటే ముందు వచ్చిన తౌరాతు, ఇంజీలు (భగవద్గీత, బైబిలు) గ్రంథములలో ఉన్నదే అయినప్పటికీ ఖుర్ఆన్ గ్రంథములోని జ్ఞానము చాలా ప్రత్యేకముగా చెప్పబడినది. వాస్తవముగా ఖుర్ఆన్ గ్రంథములోని జ్ఞానము యొక్క రుచిని ముస్లీమ్‌లు గ్రహించలేదనీ, దానిలోని జ్ఞానము యొక్క విశేషతను ముస్లీమ్‌లకు తెలియదనియే చెప్పవచ్చును. అంత విశేషత గల జ్ఞానమున్న గ్రంథమును జిబ్రయేల్ అనునతడు చెప్పడము, భగవంతులు దానికంటే ముందు వచ్చిన తౌరాత్, ఇంజీలును చెప్పియుండడమును మరచి పోకూడదు.

ఒకే దేవుని జ్ఞానమును మూడు దైవ గ్రంథములలో యున్నా మొదటి దైవ గ్రంథమందు "ఎప్పుడు అధర్మములు పెరుగునో అప్పుడు అవతరిస్తాను" అని స్వయముగా పరమాత్మ చెప్పినట్లు గలదు. అలాగే రెండవ గ్రంథము చెప్పిన తర్వాత రెండు గ్రంథములలోనూ సంపూర్ణ జ్ఞానమున్నప్పటికీ, అంతకంటే మిగిలిన జ్ఞానము ఏమీ లేకపోయినప్పటికీ తర్వాత వచ్చు ఆదరణకర్త మీకు అర్థముకాని జ్ఞానమును అంతా విశదముగా తెలుపునని ఏసు చెప్పాడు. పరిశుద్ధాత్మ ఆదరణకర్తగా వచ్చునని చెప్పడమైనది. పరిశుద్ధాత్మయనగా సృష్ట్యాదిలోని దేవుడయిన పరమాత్మయని మరువకూడదు. మూడవవాడు తమవలె వచ్చు అవతారమేయని చెప్పబడియున్నది. ఆ మాటను చూచిన తర్వాత భగవద్గీత, బైబిలు అను రెండు గ్రంథములలో లేని జ్ఞానమున్నప్పుడే కదా! దేవుడు వచ్చి చెప్పేది అని అనుకొన్నాము. తర్వాత ఖుర్ఆన్ గ్రంథము వచ్చినది. అందులో

భగవద్గీతను బైబిలును ధృవీకరించుటకేయని వ్రాయబడి యున్నది. అది దైవగ్రంథములలో చివరి గ్రంథమని కూడా చెప్పబడి యున్నది. మూడు రకములుగా దేవుడు జ్ఞానమును తెలియజేస్తానని ఖుర్‌ఆన్ గ్రంథములో 42వ సూరా 51వ ఆయత్‌లో చెప్పియున్నాడు. దానిని ఒకమారు చూస్తాము.

**(42-51) "దేవుడు ఏ మానవునితోనూ ప్రత్యక్షముగా మాట్లాడడు. దేవునితో మాట్లాడడము మనిషికి సాధ్యమయ్యే పని కాదు. దేవుడు తన జ్ఞానమును వాణి ద్వారా (వహీ ద్వారా) లేక తెరవెనుక నుండి మనిషికి చేరవేస్తాడు లేదా తాను కోరినది తన ఆజ్ఞతో సూచించటానికి తన ప్రతినిధిని పంపుతాడు. ఆయన మహోన్నతుడు, వివేకవంతుడు."**

ఈ వాక్యమును బట్టి మనిషికి దేవుని జ్ఞానము మూడు విధముల తెలియజేయునని అర్థమగుచున్నది. దాని ప్రకారము తెలియజేయబడిన విధానములనుబట్టి దైవ గ్రంథములు మూడు అని చెప్పబడినవి. మూడు విధానములలో చివరిలో చెప్పినది చూస్తే "తాను కోరిన జ్ఞానమును తన ఆజ్ఞతో సూచించటానికి తన ప్రతినిధిని పంపుతాడు" అని కలదు కదా! ఆ విధానమును అనుసరించి దేవుడయిన పరమాత్మ తన ప్రతినిధులుగా ఒకమారు కృష్ణున్ని, మరొకమారు ఏసును పంపి తన జ్ఞానమును చెప్పించడము జరిగినది. అప్పుడు చెప్పిన జ్ఞానమే ఒకటి భగవద్గీతగా, మరొకటి బైబిలుగా తయారయినది. తర్వాత గ్రంథము మనిషి జాతికాని వాడు చెప్పినది. దేవుడు తెల్పిన మూడు విధానములలో ఖుర్‌ఆన్ గ్రంథము తెరచాటునుండి చెప్పినదిగా లెక్కించవచ్చును. ఎలాగయితేనేమి వహీ ద్వారా చెప్పిన విధానము, ప్రతినిధి ద్వారా చెప్పిన విధానము, తెరచాటునుండి

చెప్పిన విధానము నెరవేరినది. మూడు విధానములను అనుసరించి మూడు గ్రంథములు తయారయినవి. మూడు గ్రంథములలోనూ సంపూర్ణమైన జ్ఞానము చెప్పబడినది. అటువంటప్పుడు బైబిలులో "పరిశుద్ధాత్మ ఆదరణకర్తగా రాబోతాడు" అని ఏసు చెప్పిన వాక్యము ప్రకారము మరొక మనిషి అవతారము వస్తుందని అర్థమగుచున్నది. అయితే జ్ఞానము సంపూర్ణముగా చెప్పబడిన తర్వాత ఆదరణకర్త (భగవంతుని) రాక ఏమి అవసరము అని ప్రశ్న కూడా వచ్చుచున్నది. ఈ ప్రశ్నకు జవాబును వెతక వలసియున్నది.

జవాబు కూడా దేవుడే అందిస్తే తెలియుచున్నది ఏమనగా! పరమాత్మ స్వయముగా మానవునిగా వచ్చి ధర్మములను తెలియజేసి పోయాడు. అది మూడు గ్రంథములుగా నేడు భూమిమీద యున్నది. దేవుడు చెప్పినది ఒకే దేవుని జ్ఞానము. ఒకే దేవుని జ్ఞానము మొదట ఆకాశవాణి ద్వారా వచ్చినది. అదే భగవద్గీతగా తయారయినది. వాణి ద్వారా వచ్చిన జ్ఞానమును కృష్ణుడు అర్జునునకు తెలియజేసినప్పుడు భగవద్గీత అయినది. తర్వాత ఇతర దేశములో చెప్పు నిమిత్తము ఏసుగా వచ్చి ముందు చెప్పిన జ్ఞానమునే చెప్పాడు. అప్పుడు దానిని బైబిలుగా వ్రాశారు. తర్వాత ముహమ్మద్ ప్రవక్తగారికి జిబ్రయేల్ చెప్పినది ఖుర్ఆన్ గ్రంథముగా తయారయినది. మూడు గ్రంథములలో సంపూర్ణ జ్ఞానమున్నదని చెప్పుకొన్నాము. అయితే ఒకే జ్ఞానమే అనగా ఒకే దేవుని జ్ఞానము మూడు గ్రంథములుగా ఉండడము వలన మనుషులలోని మాయ ప్రభావము వలన మనుషులు మూడు గ్రంథములను ఆధారము చేసుకొని మూడు మతములుగా చీలిపోయారు. మూడు మతములను ముఖ్యముగా పెట్టుకొని ఒకే దేవున్ని మూడు దేవుళ్ళుగా, ఒకే జ్ఞానమును మూడు వేరువేరు

జ్ఞానములుగా చెప్పుకొని మా జ్ఞానము గొప్ప, మా దేవుడు గొప్పయని అంటున్నారు. ఒకే దేవుని జ్ఞానమును మూడు గ్రంథములుగా చీల్చుకొనడమే కాక, దేవున్ని కూడా ముగ్గురుగా చెప్పడము పెద్ద అజ్ఞానము. దేవుడు మనుషులు జ్ఞానము వైపు పోవాలని మూడు విధముల జ్ఞానము చెప్పితే దానిని మూడుగా చీల్చారు. ఇదే విషయమునే అంతిమ దైవగ్రంథములో సూరా ఆరు, ఆయత్ 91లో ఇలా చెప్పారు చూడండి.

**(6-91) "దేవుడు ఏ మానవ మాత్రుడిపైనా ఎలాంటి జ్ఞాన విషయాన్ని అవతరింపజేయలేదు అని పలికినప్పుడు ఈ అవిశ్వాస జనులు దేవున్ని అర్థము చేసుకోవలసిన విధముగా అర్థము చేసుకోలేదు. వారిని అడుగు మూసా తెచ్చిన తౌరాతు గ్రంథాన్ని ఎవరు అవతరింపజేసినట్లు? ఆ గ్రంథము ఒక జ్యోతి, మానవుని కొరకు మార్గదర్శకత్వము. దాన్ని మీరు వేరువేరు కాగితములుగా (వేరు వేరు గ్రంథములుగా) విభజించి చూస్తున్నారు. ఎన్నో విషయము లను దాచేస్తున్నారు. మీకుగానీ, మీ పెద్దలకుగానీ తెలియని ఎన్నో విషయములు ఇందుమూలముగా మీకు నేర్పబడ్డాయి. దాన్ని (తౌరాతును) అవతరింపజేసినవాడు అల్లాహ్‌యే అని చెప్పు. ఆ తర్వాత వాళ్ళను వారి వ్యర్థ విషయములలోనే ఆడుకోనివ్వు."**

ఈ వాక్యములో దేవుడు చెప్పిన జ్ఞానమును మూడు కాగితములుగా (మూడు గ్రంథములుగా) విభజించి చూస్తున్నారు అని చెప్పడము వలన అక్కడ చెప్పినట్లే మూడు గ్రంథములుగా వ్రాసుకొని, వాటిని వేరువేరు మత గ్రంథములుగా చెప్పుకొంటున్నాము. ఈ విషయమును ద్వితీయ దైవ గ్రంథము రాకముందే ఏసు చెప్పినట్లు కలదు. దానినే బైబిలులో

వ్రాయడము జరిగినది. అట్లే జరుగుచున్నదని ఆ మాటను బలపరుస్తూ ఖుర్‌ఆన్ గ్రంథములో వ్రాయడము జరిగినది. ఆదరణకర్త వస్తాడని చెప్పడమునకు ఈ విషయమునకు సంబంధము కలదని అర్థమగుచున్నది. మూడు దైవ గ్రంథములలో సంపూర్ణ జ్ఞానమున్నా, అది ముక్కలు ముక్కలుగా యుండడము వలన అనగా వేరువేరు గ్రంథములుగా ఉండడము వలన మానవులు మూడు గుంపులుగా విడిపోవడము, గుంపుల మధ్య సమన్వయము ఏమాత్రము లేకుండా పోవడము జరుగుచున్నది. మూడు వర్గముల వారు మేము గొప్పయను భావముతో ఉండడమే కాక ఇతరులను లేకుండా చేయవలెననీ, తమ గుంపు ఒక్కటే అభివృద్ధి కావాలనీ, మిగతా గుంపుల వాళ్ళు లేకుండా పోవాలను ఉద్దేశ్యముతో ఒకరి మీద మరొకరు అసూయ భావము కల్గియున్నారు.

అసూయ ఒక గుణమైనందున అదియూ చెడు గుణమైనందున మనిషిని తప్పుదారిలో పంపుచున్నది. ద్వేష భావముతో దేవుడు చెప్పిన జ్ఞానమును మరచి, మతము కొరకు పని చేయాలను చూపుతో ఒకరినొకరు చంపుకొనుటకు కూడా వెనుకాడడము లేదు. దేవుడు ఒక్కడేయని, దేవుని జ్ఞానము ఒక్కటేయని దేవుడు తన గ్రంథముల ద్వారా తెలియచెప్పితే మనుషులు దేవుని జ్ఞానమును మూడు భాగములుగా విభజించుకొనడము మొదటి తప్పుకాగా, మతము అను గుంపును చేసుకోవడము రెండవ తప్పుగా మారిపోయినది. అంతటితో ఆగక మిగతా మతముల మీద ద్వేషము పెంచుకోవడము, తమ మతము తప్ప ఇతర మతములు ఉండకూడదు అనడము పూర్తి అజ్ఞానమై పోవుచున్నది. దేవుడు తన జ్ఞానమును మూడు గ్రంథములుగా మనుషుల వద్దకు పంపాడుగానీ, దానిని ఈ విధముగా అర్థము చేసుకోవాలి, ఈ విధముగా అర్థము చేసుకోకూడదు అని చెప్పలేదు.

దానితో భూమిమీద మేము జ్ఞానులము, గురువులము, బోధకులము అనువారు ప్రతి మతములో తయారైనారు. వారు స్వచ్ఛమయిన జ్ఞానమును స్వార్థపూరిత జ్ఞానముగా మార్చి మా జ్ఞానము, మా మతము, మా దేవుడు అను నినాదమును తెరపైకి తెచ్చారు. ఇట్లు మనుషులు మూడు గుంపులుగా విడిపోవడానికి కారణము దేవుడు చెప్పిన జ్ఞానమును ప్రజలు సరిగా అర్థము చేసుకోలేక పోవడము ఒక కారణము కాగా గురువులు, పెద్దలు, బోధకులు బోధించిన విధానము వలన మతము, మత జ్ఞానము తయారయినది.

దేవుడు ఆత్మజ్ఞానమును చెప్పితే మనుషులు దానినే మత జ్ఞానముగా మార్చివేశారు. అలా మారిపోతుందని పరమాత్మయైన దేవునికి ముందే తెలుసు. అందువలన మూడు మతముల హద్దులను తుడిపివేసి దేవుని జ్ఞానమునకు హద్దులు, ఎల్లలు లేవని అది ఒక్కటే జ్ఞానమనీ, జ్ఞానము దేవునికి సంబంధించినదిగానీ మనుషుల మతమునకు సంబంధించినది కాదని తెలుపు నిమిత్తము తాను ప్రత్యేకముగా అవతరించవలసియున్నది. కావున బైబిలు గ్రంథములో యోహాన్ సువార్తలో 14వ అధ్యాయమున 25, 26వ వాక్యములలో **"ఆదరణకర్త"** యను పేరుతో పరిశుద్ధాత్మ వచ్చునని చెప్పియున్నారు. దేవుడు మరియొకమారు పుట్టి, బోధించిన జ్ఞానమునే బోధించి మూడు గ్రంథములలో దేవుడు చెప్పిన విషయములనే తిరిగి జ్ఞాకపము చేసి, జ్ఞానము వలన మతముల అజ్ఞానమును అణచివేయును. దేవుడు వచ్చి చెప్పవలసినది ఏమీ లేకపోవుట వలన ఆయన క్రొత్త జ్ఞానమును చెప్పక ఇంతకుముందు చెప్పిన వాటినే చెప్పి మూడు మతములను ఒక్కటి చేసి **'మతము'** అను అధర్మమును లేకుండా చేయును. ఈ విషయము బైబిలు వాక్యములో చూడుము.

**(యోహాన్ 14-25, 26) "నేను మీయొద్ద ఉండగానే యీ మాటలు మీతో చెప్పితిని. ఆదరణకర్త అనగా తండ్రి నా నామమున పంపబోవు పరిశుద్ధాత్మ సమస్తమును మీకు బోధించి నేను మీతో చెప్పిన సంగతులన్నిటిని మీకు జ్ఞాపకము చేయును."**

ఈ వాక్యములో బాగా గమనించండి. వచ్చిన ఆదరణకర్త "సమస్తమును మీకు బోధించి, నేను మీతో చెప్పిన సంగతులనన్నింటిని మీకు జ్ఞాపకము చేయును." ఆయన మనకు సమస్తమును బోధించును అయితే ఏసు మనతో చెప్పిన జ్ఞానమునే బోధించునుగానీ క్రొత్త జ్ఞానము ఏమీ ఉండదు. దేవుడు చెప్పిన జ్ఞానము మనకు అర్థమగుటకు ముందు గ్రంథములలో ఉన్నదానికి అనుబంధముగా కొంత జ్ఞానమును చెప్పినా చివరకు ముందే చెప్పబడిన జ్ఞానమును తీసుకొని విశదపరచును అని నేను చెప్పుచున్నాను. పై వాక్యములో "నేను మీతో చెప్పిన సంగతులు" అని చెప్పియున్నాడు. అయితే ఇక్కడ కొంత లోతుగా ఆలోచించవలసి వచ్చును. అదేమనగా! ఏసు శరీరధారియైనా అప్పటికి ఆయన మనిషే అయినా గతములో కూడా ఆయన ఉన్నాడు. భగవద్గీతను చెప్పిన కృష్ణుని శరీరములో ఉన్నది కూడా ఏసు శరీరములో యున్నవాడేయని తెలియవలెను. నేను చాలామార్లు **కృష్ణుడుగా ఎవరున్నారో ఆయనే ఏసులో కూడా ఉన్నాడు** అని చెప్పాను. పరమాత్మ శరీరమును ధరించి కృష్ణునిగా వచ్చి బోధించి పోయాడు. పోకమునుపే "అధర్మములు చెలరేగినప్పుడు తిరిగి వస్తానని" చెప్పిపోయాడు. తర్వాత ఇశ్రయేల్ దేశములో జ్ఞానమును బోధించుటకు ఏసుగా వచ్చినవాడు కృష్ణుడుగా వచ్చినవాడేయని మరువకూడదు. కృష్ణునిగా వచ్చినప్పుడు చెప్పిన జ్ఞానమే ఏసుగా వచ్చినప్పుడు చెప్పాడు. అప్పుడు ఒక రకము, ఇప్పుడు ఒక రకము అని

ఏమీ లేదు. ఎప్పుడు వచ్చినా ఒకే జ్ఞానము చెప్పవలసియున్నది. అట్లే **ఆదరణకర్తగా వచ్చినవాడు, కృష్ణుడు, ఏసు ముగ్గురు ఒక్కటే** యనునది ప్రపంచమునకు తెలియని సత్యము.

కృష్ణుడు, ఏసు, ఆదరణకర్త ముగ్గురు ఒకే ధ్యేయముతో భూమిమీదికి శరీరమును ధరించి వచ్చారు. వచ్చినవాడు ఒకే పరమాత్మ వేరువేరు కాలములలో వేరువేరు ఆకారములతో, వేరువేరు పేర్లతో వచ్చినందున గ్రాహితశక్తి లేనివారు ముగ్గురు ఒక్కరే యనిగానీ, ముగ్గురు చెప్పినది ఒక్కటే జ్ఞానమనిగానీ తెలియక ఆయన వేరు, ఈయన వేరు, ఆయన జ్ఞానము వేరు, ఈయన జ్ఞానము వేరు అనుకోవడము జరుగుచున్నది. ఎవరు ఏమనుకొన్న **"వచ్చినవారు ఒక్కడే, చెప్పుబోధ ఒక్కటే."** అదే విషయము మీకు తెలియునట్లు పై వాక్యములో **"నేను మీతో చెప్పిన జ్ఞానమునే మీకు జ్ఞాపకము చేయును"** అని చెప్పాడు. ఆదరణకర్త వచ్చి సమస్తమును బోధించినట్లు కనిపించినా అది నేను చెప్పిన బోధయేనని అర్థము కాదా! నేను చెప్పినది అంటే ఏసుగా ఉన్నప్పుడు మాత్రమే అని కాదు. కృష్ణునిగా కూడా ఉన్నప్పుడు చెప్పినది, ఏసుగా యున్నప్పుడు చెప్పినది రెండూ ఆదరణకర్త చెప్పిన జ్ఞానములో ఉన్నాయి. కావున ఆయన గతములో చెప్పినది ఏదీ వదలకుండా 'సమస్తమును మీకు బోధించును' అని మీరు ఎందుకు అర్థము చేసుకోకూడదు? అంతా ఒకటే బోధ, నేను చెప్పినదే ఆదరణకర్తగా వచ్చినప్పుడు చెప్పును అనుటకు సాక్ష్యముగా యోహాన్ సువార్త 16వ అధ్యాయము 12, 13, 14, 15 వాక్యములను చూస్తే తెలియును చూడండి.

**(యోహాన్ సువార్త 16-12,13,14,15) "నేను మీతో చెప్పవలసినవి ఇంకనూ అనేక సంగతులు గలవుగానీ ఇప్పుడు మీరు వాటిని**

**సహింపలేరు (13) అయితే ఆయన సత్యస్వరూపియైన ఆత్మ వచ్చినప్పుడు మిమ్ములను సర్వసత్యములోనికి నడిపించును. ఆయన తనంతట తానే ఏమియూ బోధించక వేటిని గూర్చి వినునో వాటిని బోధించి సంభవింపబోవు సంగతులను మీకు తెలియ జేయును. (14) ఆయన నా వాటిలోనివి తీసుకొని మీకు తెలియ జేయును. గనుక నన్ను మహిమపరచును. (15) తండ్రికి కలిగియున్నవన్నియు నావి. అందుచేత ఆయన (ఆదరణకర్త) నా వాటిలోనివి తీసుకొని మీకు తెలియజేయునని నేను చెప్పితిని."**

ఇక్కడ చెప్పిన విషయము అంతయూ చాలా సారాంశమైనదని తెలియవలెను. బుద్ధిని **ఏకాగ్రపరచి** చూస్తే ఈ వాక్యములో రహస్యమైన జ్ఞానము తెలియును. పన్నెండవ వాక్యములో "నేను మీతో చెప్పవలసినవి ఇంకనూ అనేక సంగతులు గలవు గానీ ఇప్పుడు మీరు వాటిని సహింపలేరు" అని కలదు కదా! ఈ వాక్యము అందరికీ అర్థమయినట్లే ఉన్నది గానీ ఏసు చెప్పిన భావము ఎవరికీ తెలియలేదనియే చెప్పవచ్చును. అందరికీ అర్థమయినది ఏమనగా! ఏసు చెప్పవలసిన జ్ఞానము ఇంకా ఉంది అనీ, అది అప్పుడు చెప్పితే ప్రజలకు అర్థము కాదని, తాను చెప్పకుండా వదలివేసిన జ్ఞానమును తర్వాత వచ్చేవారు చెప్పుదురని చెప్పకుండా వదలివేశాడని అందరూ అనుకొందురు. అయితే ఆ దినము ఏసు మనము అనుకొన్నట్లు అనుకోలేదు. ఏసుకంటే మూడు వేల సంవత్సరముల ముందు కృష్ణుడు చెప్పిన జ్ఞానమునంతటినీ ఏమాత్రము కొదువ లేకుండా చెప్పాడు. కృష్ణుడు చెప్పిన జ్ఞానమునే ఏసు చెప్పినప్పుడు జ్ఞానమును ఏసు చెప్పకుండా దాచిపెట్టినది ఏమీ లేదు. అటువంటప్పుడు పై వాక్యము ఎందుకు చెప్పాడని యోచించ వలసిన అవసరమున్నది.

ప్రథమ, మధ్యమ, అంతిమ అను పేర్లు ఖుర్ఆన్ గ్రంథములో (42-51)వ వాక్యములో చెప్పిన మూడు విధానములను బట్టి మూడు పేర్లురాగా, దేవుడు ప్రకటించిన మూడు విధానములలో ముందు వెనుక చెప్పిన వరుస క్రమమునుబట్టి ప్రథమ దైవగ్రంథమనీ, ద్వితీయ దైవ గ్రంథమనీ, అంతిమ దైవగ్రంథమని చెప్పడము జరిగినది. బాగా గమనిస్తే ప్రథమ దైవగ్రంథములో చెప్పిన జ్ఞానమే మిగతా రెండు గ్రంథములలో కూడా చెప్పడమైనది. ఈ విషయము ఖుర్ఆన్ గ్రంథములో సూరా 5, ఆయత్‌లు 44, 46, 48, 68లలో మరియు (62-5)లో కూడా చెప్పారు. అటువంటప్పుడు ప్రథమ దైవగ్రంథములో కృష్ణుడు చెప్పినదంతా ఏసు చెప్పియుండును కదా! ఏసు చెప్పకుండా వున్న జ్ఞానము ఏదీ లేదు. అయితే (16-12)లో చెప్పిన వాక్యమును చూస్తే ఏసు కొంత జ్ఞానమును చెప్పలేదు అని కొందరనుకొనినా అది సత్యము కాదని ఏసు సంపూర్ణ జ్ఞానము చెప్పాడని చెప్పవచ్చును.

అయితే తర్వాత కాలములో వచ్చిన ఖుర్ఆన్ గ్రంథములో కూడా సంపూర్ణ జ్ఞానము చెప్పబడినది. ఏసు చెప్పినది శరీరము ధరించివచ్చు ఆదరణకర్త నేను చెప్పని విషయములను చెప్పును అన్నాడుగానీ మూడవ గ్రంథములో చెప్పుదురని కూడా చెప్పలేదు. ముందు రెండు గ్రంథములలోని సారాంశమే మూడవ గ్రంథములో కూడా కలదు. అయితే ఏసు చెప్పిన మాటలో అర్థమేమి గలదు. **"నేను మీతో చెప్పవలసినవి ఇంకనూ అనేక సంగతులు గలవుగానీ ఇప్పుడు మీరు వాటిని సహింపలేరు"** అని గలదు కదా! ప్రథమ దైవగ్రంథములో చెప్పిన జ్ఞానమయితే అది అందరూ సహించేదే కదా! ఒక విధముగా చూస్తే అప్పుడు బైబిలులో ఏసు చెప్పక వదలివేసిన సహింపని విషయములు ఏమయినా

ఖుర్ఆన్ గ్రంథములో ఉన్నాయా? అని చూస్తే అటువంటివి ఏవీ లేవు. జిబ్రయేల్ చెప్పిన వాటిలో కాకుండా ప్రత్యేకముగా తమవలె మానవ శరీరము ధరించి వచ్చిన ఆదరణకర్త యని చెప్పబడియుండుట చేత మనము మనిషిగా వచ్చినవాడు చెప్పు జ్ఞానములో అటువంటి విషయములుండునని అర్థమగుచున్నది. ఇంకా ఏమి తెలియుచున్నదనగా! ఏసు ఉన్నప్పుడు చెప్పితే ఆ విషయములను మనుష్యులు సహింపరు. అయితే తర్వాత కాలములో ఆదరణకర్త వచ్చినప్పుడు చెప్పితే అప్పుడు సహింతురు అని కూడా అర్థమగుచున్నది. దీనినిబట్టి చూస్తే ఏసు చెప్పకుండా వదలివేసిన విషయములు అప్పటి వరకు లేని విషయములనీ, భవిష్యత్తులో రాబోవు విషయములనీ, ఆ విషయములు ఉన్నప్పుడు చెప్పితే వాటిని గురించి అర్థము చేసుకోగలరని ఏసు చెప్పిన మాటలనుబట్టి అర్థమగుచున్నది.

ఈ విధముగా అర్థము చేసుకోగలిగితే ఏసు చెప్పిన మిగతా 13, 14, 15 వాక్యములకు కూడా అర్థము తెలియగలదు. 13వ వాక్యములో సత్యస్వరూపియైన ఆత్మ వచ్చినప్పుడు **“మిమ్ములను సర్వసత్యములోనికి నడిపించును”** అని ఏసు స్వయముగా చెప్పియున్నాడు. ఇప్పుడు నేను చెప్పని విషయములు వస్తే అప్పుడు మిమ్ములను సందిగ్ధములో వదలి వేయక వాటి యొక్క సత్యమును చెప్పి వాటినుండి ఎలా బయటపడాలో, వాటిని ఎలా అర్థము చేసుకోవాలో అన్ని విషయముల సత్యమును తెలియ జేసి సత్యములోనికి నడిపించును అని అర్థమగుచున్నది. దీనినిబట్టి రాబోవు కాలములో మీరు అసత్య విషయములలో చిక్కుకొందురని, అలా అసత్య, అజ్ఞాన విషయములలో ఉంటారని చెప్పితే ఆ మాటను మనుషులు సహించరని అప్పుడు చెప్పలేదు. ప్రత్యక్షముగా మనిషి అసత్య, అజ్ఞాన విషయములలో చిక్కుకొన్నప్పుడు చెప్పితే అప్పుడు మనిషికి అర్థము

కాగలదు. మనిషి తప్పు చేసినప్పుడు దానిని ప్రత్యక్షముగా చూపించి నీవు తప్పు చేశావు అంటే ఒప్పుకొనును. అట్లు కాకుండా తప్పు చేయక ముందే తప్పు చేస్తావు అంటే ఎవడూ సహించడు. అందువలన ఏసు అలా చెప్పాడు. మంచిని గూర్చి చెప్పితే మనిషి ఒప్పుకుంటాడు, సంతోషిస్తాడు. నీవు భవిష్యత్తులో గొప్ప ధనికునివవుతావు, ఎంతోమందికి దానము చేస్తావు అని భవిష్యత్తును చెప్పితే జ్యోతిష్యుడు చెప్పిన మాటకు సంతోషపడి, వానికి భవిష్యత్తు చెప్పినందుకు కొంత డబ్బు కూడా ఇచ్చును. అదే జ్యోతిష్యుడు నీవు భవిష్యత్తులో దొంగతనములు చేస్తావు, ఇతరుల చేతిలో తన్నులు తింటావు అని చెప్పితే ఆ మాటను వాడు సహించడు. జ్యోతిష్యుడు అసత్యము చెప్పాడని దూషించవచ్చును. అందువలన ఏసుకు భవిష్యత్తులో మనుషులు ఎటుపోవుదురో ఆయనకు తెలిసి, మనుషుల అజ్ఞానమును గురించి ఆ రోజు ఆయనకు ముందే తెలిసియున్నా, ఆ విషయములను చెప్పితే సహించరు అని చెప్పాడు. 13వ వాక్యము ప్రకారము చూస్తే ఏసు "అజ్ఞానమార్గమున పోయిన వానికి అది అసత్యమార్గమని బోధించి అసత్యమునుండి సత్యములోనికి నడిపించును" అని అన్నాడు. "వచ్చిన ఆదరణకర్త తాను స్వయముగా కల్పించి ఏదీ బోధించడు. ఆయన గతములో మేము చెప్పిన విషయములనే చెప్పును. గతములో మరియు ఇప్పుడు చెప్పినవి దేవుని విషయములు. దేవుని విషయములన్నియూ నేను చెప్పినవి. నా విషయములనియే తలచుము. నేను చెప్పిన విషయములనే నా జ్ఞానమునే ఆదరణకర్త బోధించును. నేను ఇప్పుడు చెప్పని విషయమును మీకు తెలియజేయును" అని చెప్పియున్నాడు.

(16-12) వాక్యములో రాబోవు **'మతము'** అను అధర్మమును గురించి సూచాయగా చెప్పి అప్పుడు అది లేదు కనుక, దానిని చెప్పినా

ప్రజలు నమ్మే పరిస్థితిలో ఉండరని నేను చెప్పను అన్నాడు. ఆదరణకర్త వచ్చినప్పుడు మతమను అధర్మము పూర్తి జడలు విప్పుకొన్న రక్కసివలె ఉండును. మనుషులందరూ దాని వశమై దానివెంట నడుస్తుందురు. అప్పుడు అట్టి అసత్య స్థితిలోయున్న వారిని ఆదరణకర్త సర్వ సత్యములోనికి నడిపించును. మత రక్కసి కోరలను పెరికివేయును. దేవుడు చెప్పిన మూడు గ్రంథముల సారాంశమును బోధించుచూ, సత్యసమేతమైన జ్ఞానముతో శాస్త్రబద్ధమైన జ్ఞానము తయారు చేసుకొన్న **'వచనములు'** అను జ్ఞాన ఆయుధములతో మతరక్కసికి ప్రజలు ఎదురు తిరిగి దాని బారినుండి బయటపడుదురు. మతములను వ్యతిరేఖించు ఆలోచన, ఆచరణ ఆదరణకర్తతోనే ప్రారంభమగును. మత నియమములలో నలిగిపోవు వారినీ, మత సాంప్రదాయములలో బాధపడు వారినీ, హింసామార్గమును రేకెత్తించు మతమును, క్రొత్తగా పుట్టి ఐదవ అధర్మముగాయున్న మతమును మనుషుల మధ్యనుండి లేకుండా చేసి, దేవుని మార్గములో ఆటంకముగా యున్న మత నియమములను అడ్డులేకుండా చేసి దేవుని మార్గమును సుగమముగా చేయుటకు ఆదరణకర్త వచ్చును అని నేడు మతముల మధ్య చిక్కుకొన్న మనకు అర్థమగుచున్నది. ఇదే విషయమును ముందుగా చెప్పితే నమ్మరని ఏసు చెప్పలేదు. ఆ దినము 'మతము' అనునది ఎక్కడా లేదు.

ఏసుకు ఆనాడే తమ భక్తులే ముందు గుంపుగా తయారయి మొదట **'క్రైస్థవ సంఘము'** అని మొదలుపెట్టి తమ సంఘమును పెంచుకోవడములో లగ్నమవడము వలన తొండ ముదిరి ఊసరవెల్లి అయినట్లు సంఘము ముదిరి పెద్దదయి చివరకు మతముగా మారుననీ మొదట క్రైస్థవ మతమే పుట్టుననీ, దానిని చూచి ముందుయున్న ఇందూ సమాజము వారు తమది ఇందూమతమని చెప్పుకోవడముతో మొదట దేశము, తర్వాత ప్రపంచములో

మతమను రోగము వ్యాప్తి చెందినది. ఇప్పటికి ప్రపంచములో మొత్తము పన్నెండు (12) మతములు తయారయినవి. పన్నెండు మతములలో మతము అని పేరు పెట్టుకున్నది మొదట క్రైస్థవ మతమే. తర్వాత హిందూమతము. ఆ తర్వాత మిగతా మతములు అన్నియూ తయారయినవి. వాటి గుర్తింపునకు అనేక రకముల సాంప్రదాయములను ప్రతి మతములో ఏర్పాటు చేసుకొన్నారు. ఎక్కువ సాంప్రదాయములు గల వాటిలో ముస్లీమ్ మతము మొదటిదికాగా, రెండవది సిక్కు మతము. మూడవది హిందూ మతము. నాల్గవది క్రైస్థవ మతము. ముఖ్యముగా ఈ మూడు మతములే ఎక్కువగా సాంప్రదాయములు కలవిగా కనిపిస్తున్నా ముస్లీమ్, క్రైస్థవ మతములు రెండూ మతమును పెంచుకొను దృష్థిలో 90 నుండి 99 పాళ్ళ వరకు దృష్థిని కేంద్రీకరించాయి. తర్వాతది హిందూ మతము. అయితే హిందూ మతము దైవగ్రంథ జ్ఞానము తెలియనిదై గ్రుడ్డిగా ప్రవర్తించు చుండుట వలన మత అభివృద్ధి చేయాలనుకొన్నా కుల వివక్షల వలన మతము క్షీణించుచూ వచ్చినది. రాబోవు ఆదరణకర్త వలన మత ప్రాబల్యము తగ్గి జ్ఞాన ప్రాబల్యము ఎక్కువ కాగలదని అనుకొంటున్నాము. త్వరలో ఆదరణకర్త ప్రభావము ఉంటుందని అనుకొందాము.

**ప్రశ్న :- అయితే ఇప్పటికే కొందరు ఆదరణకర్త తమ మతములో వచ్చి పోయాడు. ఏసు చెప్పినట్లు జ్ఞానము చెప్పిపోయాడు అని అంటున్నారు. అట్లు వచ్చిపోయినట్లు ఎక్కడా ఆనవాళ్లు కనిపించడము లేదు. దానికి మీరేమంటారు?**

**జవాబు :-** ఎవరు ఎట్లు చెప్పినా చెప్పుకోవచ్చు, వద్దని మేము ఏమీ చెప్పము. ఏసు ఏమి చెప్పాడో దానినే నేను చెప్పాను.

**ప్రశ్న :- ఏసు ఏమి చెప్పాడో ఆ రోజు కూడా ఖచ్చితముగా తెలియదు కదా! నేను చెప్పవలసిన విషయములున్నవి, ఆ సంగతులు ఇప్పుడు చెప్పితే మీరు సహించరు అన్నాడు. ఫలానా విషయమని ఆయన చెప్పలేదు కదా! అలాంటప్పుడు ఆ దినము ఏసు మత విషయమును గురించి చెప్పుచున్నాడని మీరు ఎలా చెప్పగలరు?**

**జవాబు :-** నాకు ఆత్మజ్ఞానము అంతో ఇంతో తెలుసు. దాని ఆధారముతో ప్రపంచ విషయములు తెలియకున్నా దైవికమయిన విషయములు తెలియుటకు అవకాశము గలదు. అందువలన ఆ రోజు ఏసు ఏమి చెప్పాడో దానిని చెప్పగలుగుచున్నాను. నేను చెప్పు జవాబు సక్రమమయినది కాదు అనుటకు మీ వద్ద ఏ ఆధారము లేదు. మొండిగా కాదు అవును అని మీరు చెప్పవచ్చును గానీ మేము అలా చెప్పము. ఏసుకు ఆనాడే మతముల పుట్టుక విషయము తెలుసు. ద్వాపర యుగముకంటే ముందు రెండు పెద్ద యుగములు గడచిపోయాయి. యుగముల కాలపరిమితి ఇలా కలదు.

| | | | |
|---|---|---|---|
| **1)** | **కృతయుగము** | **17,28,000** | **సంవత్సరములు** |
| **2)** | **త్రైతాయుగము** | **12,96,000** | **సంవత్సరములు** |
| **3)** | **ద్వాపరయుగము** | **8,64,000** | **సంవత్సరములు** |

గతములో మూడు యుగములు గడచిపోయాయి. కలియుగము ప్రారంభమయి ఐదువేల సంవత్సరములు దాటింది. ఇప్పటికి పూర్తిగా 38,93,000 సంవత్సరములు గడచిపోయినవి. ఏడు వేలు తక్కువ 39 లక్షల సంవత్సరములు గడచిపోయినట్లగును. మూడు యుగములు గడచే

నాటికి 38,88,000 సంవత్సరములయినది. తర్వాత క్రైస్థవ మతము పుట్టినప్పటికి మూడు వేల సంవత్సరములు 38,91,000 సంవత్సరములు గడచినది. అన్ని సంవత్సరములు భూమిమీద **'మతము'** అను ప్రసక్తిలేదు. మతము అను ప్రసక్తి లేకుండా 38 లక్షల 91 వెయ్యి సంవత్సరములు గడచి పోయినవి. అంతవరకు భూమిమీద నాలుగు అధర్మములు మాత్రమే ఉండేవి. నాలుగు అధర్మములు భారతదేశములో మాత్రము ఉండేవి. మిగతా దేశములలో ఒకటిగానీ లేక రెండు అధర్మములు ఉండేవి. అయితే వారికి జ్ఞానము తెలియదు, అజ్ఞానము తెలియదు అన్నట్లుండేవారు. ఒక్క భారతదేశములోనే నాలుగు అధర్మములు ఉండేవి. భారతదేశము తప్ప మిగతా దేశములలో ఎక్కడగానీ నాలుగు అధర్మములు వెదకినా కనిపించేవి కావు. ఒకప్పుడు ప్రపంచదేశములలో అత్యంత ఉన్నత జ్ఞానముగల దేశము భారతదేశమే. అదే దేశములో త్రేతాయుగము నుండి నాల్గు అధర్మములు ఉండగా, ఇప్పుడు రెండువేల సంవత్సరములనుండి **"మతము"** అను అధర్మము క్రొత్తగా పుట్టుకొచ్చి చిన్నచిన్నగా భూమిమీద అన్ని దేశములలో వ్యాపించుకొన్నది. నేడు క్రొత్తగా పుట్టుకొచ్చిన **మతము** అను అధర్మము అన్ని దేశములయందు పూర్తిగా వ్యాపించియున్నది. పూర్వము ఒకటి లేక రెండు అధర్మములున్న దేశములో కూడా మతము అనునది ప్రవేశించినది. ఎనిమిది సంవత్సరముల వయస్సున్న వారిలో కూడా చేరిపోయినది. దానివలన మతము బారిన పడని మనిషి లేడని చెప్పవచ్చును.

భూమిమీద ఇటువంటి పరిస్థితి వస్తుందని రెండు (2) వేల సంవత్సరముల ముందే గ్రహించిన ఏసు "నేను చెప్పవలసినది ఉన్నది. అయితే ఇప్పుడు చెప్పితే దానిని మీరు సహించరు" అని అన్నాడు. రాబోవు ఆదరణకర్త మిమ్ములను **మతము** అను అసత్యమునుండి, **జ్ఞానము** అను

సత్యములోనికి నడిపించును అని చెప్పడము జరిగినది. మూడు యుగముల నుండి దాదాపు 39,00,000 సంవత్సరములనుండి నాలుగు అధర్మములు ఉన్నా అవి అందరిలో లేకుండా కొందరిలో మాత్రమే కనిపించేవి. నేడు కూడా అట్లేయున్నది. అయితే నేడు క్రొత్తగా వచ్చిన మతము అనునది కొందరిలో అనునది లేకుండా అందరిలో చేరిపోయినది. మతము అను అధర్మమును గురించి మేము అనేకమార్లు చెప్పియున్నాము. దానిని గురించి మా గ్రంథములో కవర్ పేజీ మీద ఇలా వ్రాశాము.

**1) నాలుగు అధర్మములు పదిశాతము మనుషలలో ఉండగా, ఒక్క మతము అను అధర్మము 99 శాతము గలదు.**

**2) యజ్ఞ, దాన, వేద, తపస్సులు నాల్గుకాగా ఐదవ అధర్మము మతము.**

**3) దైవమార్గమునకు పెద్ద ఆటంకము మతము.**

**4) అన్ని అధర్మములను మించినది మతము అను అధర్మము.**

**5) ప్రపంచ మార్గములో మతము ఉంటే, దైవమార్గములో హతమై పోతావు.**

**6) కలియుగములో క్రొత్తగా పుట్టుకొచ్చిన ఐదవ అధర్మమే మతము.**

**7) మతాలు నిషేధము, నిషిద్ధము. కులాలు అహేతుకము, అశాస్త్రీయము.** **భగవద్గీత, బైబిలు, ఖుర్ఆన్** మూడు ఒకే దైవగ్రంథములోని **భాగములే.** మీ మనోభావము కులమతాలకు అతీతమైతే వెంటనే **"ప్రబోధ సేవా సమితి"** లో సభ్యులుగా చేరండి. మిమ్ములను జ్ఞానులుగా చేయాలని కోరుతున్న...

**– త్రిమత ఏకైక గురువు శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**

అధర్మములు దేవుని మార్గమునకు ఆటంకము. అధర్మముల వలన దేవుడు తెలియబడడు. ఈ విషయమును విశ్వరూప సందర్శన యోగము అను అధ్యాయమున 48వ శ్లోకము, 53వ శ్లోకములో చెప్పబడిన విషయము ఇప్పుడు గుర్తు చేయుచున్నాము.

శ్లో॥ 48. నవేద యజ్ఞాధ్యయ నైర్నదానైర్న చక్రియాభిర్న తపోభిరుగ్రైః
ఏవంరూప శ్శక్యఅహం నృలోకే ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర! ॥

**భావము :- "వేదముల చేతకానీ, యజ్ఞముల చేతకానీ, దానముల చేతకానీ, ఉగ్రతపస్సుల చేతకానీ ఈ రూపముగల నన్ను తెలియజాలరు. జగతిలో నీవు తప్ప నన్ను చూచినవారు ఎవరూ లేరు."**

శ్లో॥ 53. నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా ।
శక్య ఏవం విధో ద్రష్టుం దృష్టవా నసి మాం యథా ॥

**భావము :- "నీవు నన్ను ఎట్లు చూచియున్నావో ఆ దర్శనము దొరకవలెనన్న వేదములచేతను, దానములచేతను మరియు యజ్ఞముల చేతను, తపస్సుల చేతను శక్యము కాదు."**

పై వాక్యములలో చెప్పినట్లు నాలుగు అధర్మముల వలన ఏమాత్రము మోక్షము లభించేది కాదు. దేవుడు తెలియబడేవాడు కాదు. కలియుగములో వచ్చిన **మత, సాంప్రదాయ** అను రెండు అధర్మములలో ముందున్న నాలుగు అధర్మములకంటే మతము చాలా గొప్పది మరియు బలమైనది. మతము అను అధర్మము మనుషులలో వ్యాపించియున్నట్లు గడచిన మూడు యుగములలో ఏదీ అట్లు వ్యాపించ లేదు. కృత, త్రైతా, ద్వాపర యుగములలో అధర్మములున్నా అవి అందరిలో ఉండేవి కావు.

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య కులములలో తప్ప  మిగతా ఏ కులములోని ప్రజలకు ధర్మములు తెలియవు, అధర్మములు తెలియవు.  మూడు కులములు మినహా  90 శాతము పైగా నుండు మిగతా కులములలో, ధార్మికము, ఆధ్యాత్మికము అంటే ఏమిటో తెలియని స్థితిలో ఉండేవారు.  నేడు మతము అనునది 100 శాతము ప్రజలలో వ్యాపించి యున్నది.  ఆకలిగొన్నవాడు ఆహారము కొరకు మాట్లాడక  మతము కొరకు మాట్లాడుట ఆశ్చర్యమును కల్గించుచున్నది.  కొందరు ప్రత్యేకించి కొన్ని మతముల వారు  మతము కొరకు ఉగ్రవాదమును అవలంభించుచున్నారు.  మతవ్యాప్తి కొరకు కొందరు, మత రక్షణ కొరకు కొందరు ఉగ్రవాదమును పెంచి పోషించువారు కూడా కలరు.  మత బోధలను కొంతమంది యువకులకు నూరిపోసి “మతము కొరకు చనిపోతే స్వర్గానికి పోతారు.  స్వర్గానికి పోవడము చాలా పెద్ద అవకాశము. మతము కొరకు, దేవుని కొరకు చనిపోయిన వానికే సులభముగా స్వర్గానికి పోవు అవకాశము దొరుకుతుంది.  స్వర్గానికి పోతే అక్కడ స్థిరస్థాయిగా సుఖాలు అనుభవించ వచ్చును.  మంచి అందమైన స్త్రీలు అక్కడ సపర్యలు చేయుచుందురు.  అక్కడ లభించని సుఖమంటూ ఉండదు” అని స్వర్గమును గురించి చెప్పి, స్వర్గము కొరకు చనిపోవుటకు సిద్ధము చేసి పంపుదురు.  వారు చనిపోవుటకు అదేపనిగా ఇతరులను అనగా ఇతర మతముల వారిని హింసించుటకు, మారణహోమము సృష్టించుటకు వెనుకాడరు.  అట్లు చేయునవే ఉగ్రవాద దాడులు.  వారు చనిపోవాలనే ఉద్దేశ్యముతోనే ఇతరులను చంపుటకు పూనుకొందురు. చివరకు కొందరిని చంపి  వారు చనిపోవడము జరుగుచున్నది.  అమాయక జనులను వందమందిని చంపి  చివరకు వాడు స్వర్గము కొరకు చనిపోతే వాడు అనుకొన్నట్లు, వాడు విన్నట్లు స్వర్గము వస్తుందని గ్యారంటీ ఏమిటి?

స్వర్గము వస్తుందని స్వర్గ సుఖముల కొరకు తొందరగా చనిపోవు మార్గము అదేనని ఉగ్రవాదము కొరకు పోవువారిలో జీర్ణించుకొని పోయినది. ఆ పనికి వారిని ప్రేరేపించినది మతము అని తేలుచున్నది. ఈ విధముగా **మతము మనిషిని దేవునివైపు పంపకపోవడమేకాక హింసవైపు పంపుచున్నది.**

ప్రతి పనికి లెక్కాచారముగా తూకము వేసినట్లు పాపపుణ్యములు రావడము జరుగుచుండును. మనిషి మతము కొరకు పని చేసినా, మరే దానికి పని చేసినా పాపము పాపముగానే వ్రాయబడును. అట్లే పుణ్యము పుణ్యముగానే వ్రాయబడును. మనిషి పాపపుణ్యముల కర్మలనుండి బయట పడుటకు దేవుడు మనిషికి జ్ఞానమును తెలియజేశాడు. సాధారణ పనులలోనే మనకు తెలియకుండా వచ్చు పాపపుణ్య కర్మలను లేకుండా చేసుకొనుటకు జ్ఞానముండగా, జ్ఞానమునకు పూర్తి వ్యతిరేఖమైనవి అధర్మములు. మనిషి జ్ఞానమును తెలియకపోయినా ఫరవాలేదు. ఈ రోజు కాకపోతే రేపయినా నేర్చుకొనునని, కొంత వయస్సు వచ్చిన తర్వాత అయినా తెలియునని అనుకోవచ్చునుగానీ **మతము** అను అధర్మములో చిక్కుకొన్నవాడు ఎప్పటికీ దేవుని జ్ఞానమువైపు వస్తాడను నమ్మకము లేదు.

కలియుగములో **మతము** అను ఐదవ అధర్మము వస్తే అంతవరకు మనుషులలో యున్న మానవత్వము పోయి మనుషులలో రాక్షసత్వము పెరిగిపోవునని గ్రహించిన సృష్ఠికర్త అయిన దేవుడు తన అవతారము కలియుగములోనే కల్పించుకొన్నాడు. కృష్ణుని అవతారము కలియుగము మొదటిలోకాగా, ఏసుది తర్వాత మూడు వేల సంవత్సరములకే వచ్చినది. భగవంతునిగా అవతరించిన ఇద్దరూ తమ బోధలలో ముందుగానే మతమును ఎదుర్కొనునట్లు మతమను అజ్ఞానములో అధర్మములో చిక్కుకోనట్లు బోధలు కల్పించి చెప్పారు. క్రైస్థవ మతము పుట్టుకతో ఊపిరి

పోసుకున్న మతము, ఇస్లామ్ పుట్టుకతో ఇస్లామ్‌ను కూడా తనలో కలుపుకొన్నది. వాస్తవానికి ఇస్లామ్‌గానీ, క్రైస్థవముగానీ మతముతో సంబంధము లేకుండా పుట్టాయి. క్రైస్థవము తర్వాత పుట్టిన మతము. బైబిలు గ్రంథములోని జ్ఞానములో తన జాడలను చూపలేకపోయింది. అలాగే ఐదువేల సంవత్సరముల పూర్వమే పుట్టిన భగవద్గీతలో చెప్పిన జ్ఞానములో ఏమాత్రము మతము యొక్క ఛాయలు కనిపించవు. బైబిలు గ్రంథము తయారైన తర్వాత వచ్చిన మతము బైబిలులో కూడా తన ఛాయలను చూపలేకపోయినది. రెండువేల సంవత్సరములప్పుడు పుట్టి, చిన్నగా పెరుగుతూ వచ్చిన మతము ఇస్లామ్‌ను మతముగా రూపొందించినది. మతము అను దానిమీద ఇస్లామ్ పుట్టకపోయినా జిబ్రయేల్ చెప్పిన ఇస్లామ్ బోధలు మతమునకు దూరముగా యున్నా ఆ బోధలను గ్రంథముగా చేయునప్పుడు అప్పటికే మనుషులలో చేరిన మతము గ్రంథములో తన ఛాయలను చూపినది. గ్రంథములోని జ్ఞానము చదివేవారికి అధర్మము ప్రకారము అర్థమగునట్లు చేసినది. ధర్మముల ప్రకారము అర్థము కాకుండా చేసినది. కొందరికి అధర్మము ప్రకారమే అర్థమగునట్లు కొన్ని వాక్యములను తనవైపు ఉన్నట్లు వ్రాయునప్పుడే మనుషులనుండి వ్రాయించినది. వాస్తవానికి గ్రంథములో **మతము** అనునది లేదు. అయినా మతమున్నట్లు, మతము కొరకు పనిచేయడమే ముఖ్యమైన దేవుని పని అన్నట్లు మనుషులను వాక్యములో మతము భ్రమింపజేయుచున్నది. దేవుడు ఏదో చెప్పితే ఏదో అర్థమగులాగున దానిప్రకారము చివరకు మనుషులు మతమువైపు వచ్చునట్లు చేయుచున్నది. ఖుర్ఆన్ గ్రంథములో మనుషులను ఎట్లు తప్పు భావముతో భ్రమింపజేయుచున్నదో ఒకమారు చూస్తాము. మతము మనుషులను తప్పు భావములోనికి త్రోచుచున్నదని చెప్పుటకు ఉదాహరణగా సూరా 9, ఆయత్ 5 ను చూస్తాము.

**(9-5) "నిషిద్ధ మాసాలు గడచిపోయిన తర్వాత చెడుమార్గమున పోవు వారిని (కపటులను), మాట తప్పిన వారిని ఎక్కడ దొరికితే అక్కడ చంపండి మరియు వారిని పట్టుకోండి. ఇంకా వారినే చుట్టుముట్టండి. మరియు ప్రతి మాటువద్ద వారికొరకు పొంచి ఉండండి. అయితే వారు పాశ్చాత్తాప పడి నమాజ్‌ను స్థాపించి జకాత్‌ను ఇస్తే వారిని వారి మానాన వదలిపెట్టండి. నిశ్చయముగా అల్లాహ్ క్షమాశీలుడు, కరుణించేవాడు.**

**(9-6) "ఒకవేళ కపటులలో ఏ వ్యక్తి అయినా నీ శరణుకోరితే అతను దైవజ్ఞానము వినునంతవరకు అతనికి నీవు ఆశ్రయము ఇవ్వు. ఆ తర్వాత అతనిని అతని సురక్షిత స్థానానికి చేర్చు. వారు జ్ఞానము తెలియనివారగుట చేత వారి పట్ల నీవు ఈ విధముగా వ్యవహరించు."**

ఈ రెండు ఆయత్‌లను గమనించితే ఇందులో జ్ఞానమే వ్రాయబడి యున్నా, మతము తలలో యున్నవారికి పూర్తిగా మత సంబంధమైన విషయమే జ్ఞానముగా అర్థమగును. అప్పుడు నేను దేవుని మార్గములో దేవుని కొరకు తాము పనిచేయువారిగా, మిగతావారు తమ దేవునికి విరుద్ధమైన వారుగా యున్నట్లు తలచి తమ మతము కాని వారిని, తమ దేవున్ని ఆరాధించనివారు వారి లెక్కలో తప్పుమార్గములో యున్నట్లు కనిపించగా వారిని చంపమని దేవుడే వాక్యములో ఆదేశించినట్లు అర్థము చేసుకొందురు. వాక్యములో చెప్పినట్లు చంపండి, వారిని పట్టుకోండి, మరియు వారిని మాటువేసి పట్టుకోండి అని వ్రాసియున్న దానిని చూచి పట్టుకోండి, చంపండి అనేది వారిలో అర్థమగునట్లు చేయును. ప్రక్కనేగల

ఆరవ వాక్యములో వారి దేవున్ని ఆరాధించని వారిని, వారి జ్ఞానమును చదవని వారిని వదలకూడదని వారి జ్ఞానము ప్రకారము నడచుకొని వారి దేవున్నే ఆరాధిస్తే వాన్ని వదలిపెట్టాలని మత సంబంధమైన దేవున్ని, మత సంబంధ జ్ఞానమును చూపడము చేత అక్కడ కూడా హింసకు తావు ఏర్పడుచున్నది. నేడు 'మాటువేసి చంపండి' అనుమాటను అడ్డము పెట్టుకొని ఆ మాటను దేవుడు ఎవరికి చెప్పాడు? అని ఆలోచించకుండా, తమకే దేవుడు చెప్పాడని కొందరు తలచి జనకూడళ్లలో బాంబులు పెట్టి అమాయక ప్రజలను చంపుచున్నారు. చనిపోయిన వారంతా తమ మతమును, తమ దేవున్ని వాక్యములో చెప్పినట్లు అనుసరించనివారనీ, వారిని చంపడము వలన దేవుని మార్గములో మేము సక్రమముగా ఉన్నామని, మేమే నిజమైన దేవుని భక్తులమని అనుకొంటున్నారు.

ఈ విధముగా మనుషులలోని భావమును మార్చి తప్పు మార్గములో, హింసామార్గములో మనిషిని మతము పంపుచున్నది. వాక్యములో చెప్పినది జ్ఞానమే. దేవుడు తన పరిపాలనలో పాపము చేసిన పాపులను అలా శిక్షించమని ఆదేశమిచ్చినట్లు (9-5) వ వాక్యములో గలదు. అయితే అది తన దూతలకు ఇచ్చిన ఆజ్ఞయని గ్రహించక మతము అను చీకటిలో మనిషికి చెప్పని విషయమును మనిషికేనని తలచి తాను దేవునికి ఇష్టమైన పనిని చేయుచున్నాననీ, అందువలన తాను చనిపోయినా దేవుడు తన కొరకు చనిపోయిన వారిని స్వర్గానికి పంపుననీ, స్వర్గానికి పోయినవాడు అనేక సుఖములను పొందవచ్చునని అనుకొంటున్నారు. తమ చేతిలో చనిపోయిన వారు నరకానికి పోయివుందురని కూడా అనుకోవడము జరుగుచున్నది.

ఈ విధముగా మూడు గ్రంథముల విషయములను మనిషి మెదడుకు మతము అనునది అర్థము కాకుండా చేసినది. భగవద్గీతలోగానీ, బైబిలులోగానీ బోధలు వ్రాసినప్పుడు మతము లేని దానివలన, దానిలో హింసకు దారితీయు వచనములు తక్కువగా యున్నవి. ఖుర్ఆన్ గ్రంథములో కూడా జ్ఞానమే చెప్పినా, పాపము చేసిన వారిని శిక్షించుటకు దేవుని దూతలకు అనగా దేవుని పాలకులకు ఇచ్చిన ఆజ్ఞలు అక్కడక్కడ గలవు. అటువంటిదే (9-5) చెప్పడమైనది. బైబిలు గ్రంథములో కూడా ఇటువంటి విషయమే ఉన్నా, అక్కడ దేవుడు ఆజ్ఞ 'పాలకులకు ఇచ్చాడు' అని ఉన్నది. అందువలన అది మనకే చెప్పినది అని మనుషులు అనుకొనుటకు వీలులేదు. మతము వచ్చిన తర్వాత పుట్టినది ఖుర్ఆన్ గ్రంథము అయినందున జ్ఞానమును, దేవున్ని చూపి మతము మనుషులను తనవైపు లాగుకొను చున్నది. అందువలన మిగతా మతములకన్నా ముస్లీమ్ మతము వారే ఎక్కువ మత సంబంధమైన హింసకు పాల్పడుచున్నారు.

ఒక విధముగా చెప్పితే భగవద్గీతకంటే, బైబిలుకంటే, ఖుర్ఆన్ గ్రంథములో సూక్ష్మాతి సూక్ష్మజ్ఞానము ఎక్కువగా యున్నది. భగవద్గీతలోని జ్ఞానమే తనయందుకలదని ఖుర్ఆన్ చాలాచోట్ల చెప్పినది. ఐదవ సూరాలో ఎక్కువగా చెప్పారు. భగవద్గీతలోని జ్ఞానమే ఉన్నా చెప్పిన తీరు బట్టి చూస్తే భగవద్గీతకంటే బాగున్నదని, దేవునికి దగ్గరగా చెప్పినదనీ, అట్లే మనిషి జీవితమునకు కూడా దగ్గర సంబంధముగా చెప్పినదని చెప్పవచ్చును. ఇంకొక విధముగా చెప్పితే గ్రంథములోని జ్ఞానము గొప్పదయినా దానిని గ్రహించుకొను శక్తి ముస్లీమ్‌లలో చాలా తక్కువ ఉందని చెప్పవచ్చును. వారిలో విశ్వాసమునకు తగినట్లు గ్రంథములోని జ్ఞానము అర్థమయివుంటే ప్రపంచములో ముస్లీమ్‌లే అందరికంటే గొప్పవారని చెప్పవచ్చును. అయితే

వారు గ్రంథ జ్ఞానములో చిక్కుకోకుండా, మత జ్ఞానములో చిక్కుకొని పోయారు.

సృష్ఠికర్త అయిన దేవునికి అన్నీ తెలుసు. ఒకవైపు తన ఆత్మ ద్వారా అధర్మములను రేకెత్తించుచూ మరొకవైపు తన ప్రతినిధియైన భగవంతుని ద్వారా అధర్మములను అణచివేయు కార్యమును చేయుచున్నాడు. అయితే మనము అంతవరకు చూడకూడదు. జరుగుచున్న దానిని చూస్తూ **జ్ఞానము తెలుసుకొని జన్మనుండి బయటపడాలి. అంతవరకే మన కర్తవ్యము.** ఆ ప్రయత్నములోనే మనము జ్ఞానము ద్వారా దేవున్ని తెలియుటకు ప్రయత్నించాలి. దేవుడు భూమిమీద క్రొత్తగా పుట్టిన **మతము** అను అధర్మమును ముందే గుర్తించి అది పుట్టకనే దానిని గురించి ఏసు యోహాన్ సువార్త 16వ అధ్యాయమున 12, 13, 14, 15 వాక్యములలో చెప్పినట్లు కలదు. అప్పుడు దానికి పరిహారముగా పరిశుద్ధాత్మయే ఆదరణకర్తగా వచ్చునని చెప్పియున్నారు.

ప్రశ్న :- **దేవుడు ఆదరణకర్తగా వచ్చినా క్రొత్త జ్ఞానము చెప్పడు. మేము చెప్పిన వాటిలోనే చెప్పును అని ఏసు చెప్పాడు కదా! ఉన్న జ్ఞానము ఎటూ ఉంది. అది ఉన్నట్లే 'మతము' అను అధర్మము వృద్ధి అయినది కదా! క్రొత్త జ్ఞానము చెప్పకుండా పాత జ్ఞానముతోనే క్రొత్తగా వచ్చిన ఐదవ అధర్మమును లేకుండా చేయుటకు ఆదరణకర్తకు సాధ్యమగునా? ఆదరణకర్త వచ్చినా సాధారణ మనిషివలె రావలసిందే కదా! మూడు గ్రంథముల జ్ఞానమున్నప్పుడే పుట్టుకొచ్చిన, అన్నిటికంటే బలమైన, అంతటా వ్యాపించు కొన్న మతము ఆదరణకర్తతో అణిగిపోవునంటావా? ముందు వచ్చిన ప్రవక్తలు అందరూ గొప్పవారే అయినా వారి బోధలను ఆధారము చేసుకొని**

**ఖుర్‌ఆన్‌లో (9-5)లో చెప్పినట్లు మతము అభివృద్ధి అయినది. ఇప్పుడు ఆదరణకర్త వస్తే మతమును అణచివేయడము సాధ్యమగునా?యని అనుమానము కలదు. ఇప్పుడు ఈ ప్రశ్నకు జవాబు చెప్పుటకు మీకు కొంచెము కష్టముగా ఉండును. అయినా మా కొరకు జవాబు చెప్పమని కోరుచున్నాము?**

**జవాబు :-** మూడు గ్రంథముల జ్ఞానమున్నప్పుడే మూడు యుగములనుండి లేని బలమైన అధర్మము పుట్టుకొచ్చినదని అందరికీ తెలియునట్లు మతము కనిపించుచున్నది. మీరు అడుగకున్నా కొందరికి మతము అధర్మమేనా? అను ప్రశ్న కూడా కలదు. ప్రథమ దైవ గ్రంథములో దేవున్ని తెలియు ధర్మములు మూడుయనీ, దేవున్ని ఏమాత్రము తెలియనివ్వని ఆరాధనల రూపములో యున్న యజ్ఞ, దాన, వేదపఠన, తపస్సు మొదలగు నాలుగు అధర్మములు గత మూడు యుగములనుండి గలవని చెప్పుకొన్నాము. దీనినిబట్టి దేవున్ని తెలియు **కర్మయోగము, బ్రహ్మయోగము, భక్తియోగము** మూడు ముఖ్యమైన ధర్మములుకాగా, **యజ్ఞ, దాన, వేద, తపస్సు** అనునవి నాలుగు అధర్మములు అని తెలిసిపోయినది. దీనినిబట్టి దేవున్ని తెలియకుండా ప్రక్కదారి పట్టించి అదే సరియైన పద్ధతిగాయుండునని తెల్పినది అధర్మము. మతము క్రొత్తగా పుట్టినా, అందరినీ తన వశము చేసుకొని గ్రంథ జ్ఞానము ప్రకారమే నడచునట్లు చూపుచూ తనది ధర్మమే యన్నట్లు మనిషిని భ్రమింపచేయుచున్నది.

మూడు దైవగ్రంథములలో చెప్పినది నిజమైన జ్ఞానమని మాయ వలన పుట్టిన అధర్మమునకు తెలుసు. దేవుడు చెప్పిన జ్ఞానము మూడు కాలములలో, ముగ్గురు ప్రవక్తల చేత చెప్పబడి మూడు పేర్ల గ్రంథములుగా

యుండుట వలన మూడు ప్రాంతములనుండి ప్రపంచమంతా జ్ఞానము వ్యాపించవలెనని, అన్ని వర్గముల వారు చూచుటకు, అన్ని భాషల వారు తెలియుటకు మూడు ప్రాంతములలో, ముగ్గురు ప్రవక్తల చేత జ్ఞానము చెప్పబడినది. అయితే **మతము** అను అధర్మమునకు అదే అనుకూలముగా మారినది. ప్రపంచములోని ప్రజలను మూడు భాగములుగా చీల్చి భగవద్గీత హిందువులదేయనీ, బైబిలు క్రైస్థవులదేయనీ, ఖుర్ఆన్ గ్రంథము ముస్లీమ్‌లదని నమ్మించి, మూడు గ్రంథములను ఆధారము చేసుకొని మతము వేగముగా ప్రజలలో ప్రాకిపోయినది.

సృష్ఠికర్తయైన దేవుడు పంపిన తన ప్రతినిధుల చేత మాయ బలముతో అభివృద్ధి చెందుచున్న అధర్మములు నశించి పోవునట్లు మూడు గ్రంథములలోని జ్ఞానమును బోధించాడు. దేవుడే ప్రతినిధి అను పేరుతో శరీరము ధరించి వచ్చి జ్ఞానము చెప్పుట వలన రెండు దైవ గ్రంథములు భగవద్గీత, బైబిలు తయారయినవి. దేవుని పరిపాలనలో పనిచేయు జిబ్రయేల్ తాను మొదట విన్న జ్ఞానమును ముహమ్మద్ ప్రవక్తకు చెప్పగా అది ఖుర్ఆన్ గ్రంథమయినది. మూడు గ్రంథములలోనూ ఒకే దేవుని జ్ఞానమే ఉండుట వలన అది మొదటి నుండియున్న నాలుగు అధర్మములను అభివృద్ధి కాకుండా ఎక్కడికక్కడ పైకి రాకుండా మనుషులలో చేరకుండా చేశాయి. ఉదాహరణగా చెప్పితే దేవుని జ్ఞానము బలమైన సింహముగా ఉండగా నాలుగు అధర్మములు నాలుగు జింకలుగా ఉండేవి. సింహము ముందర జింకల బలము తక్కువ అన్నట్లు అధర్మములు అణిగిపోయేవి. భగవద్గీతలో అదే విషయమునే చెప్పారు. ధర్మములను బోధించి అధర్మములను లేకుండా చేతును అన్నారు. కృష్ణుడు, ఏసు రెండు అవతారములలోనూ అదే జరిగినది. మూడవది అవతారము కాని

దానివలన మూడవమారు అధర్మములలో మతము, సాంప్రదాయము అను అధర్మములు క్రొత్తవి తయారయినది. మొదట దేవుని బోధలు సింహముగా ఉండగా నాలుగు అధర్మములు పెంపొందక క్షీణించేవి. నాలుగు అధర్మములున్నా వాటికి పిల్లలు పుట్టేటివి కావు. వాటి సంఖ్య అంతేయున్నా ప్రజలలో కొందరికి మాత్రమే అవి పరిచయముగా యున్నవి. నాలుగు అధర్మములలో కొందరికి తెలిసినా ఒకటి రెండు మాత్రము తెలిసియుండేవి. నాలుగు బ్రాహ్మణులకు మాత్రము తెలిసియుండేవి. ఆ నాలుగు అధర్మములను బ్రాహ్మణులు బాగా ఆచరించెడివారు. నాలుగులో యజ్ఞములు, వేదములు రెండు ఎక్కువగా వారివద్దనే ఉండేవి. మూడవది దానము కూడా ఉండేది. తపస్సు కొందరిలో ఉండేది, కొందరిలో ఉండేది కాదు. ఏది ఏమయినా దేవుని జ్ఞానము తెలిసినవారుండే దానివలన అధర్మములు పూర్తి స్థాయిలో వృద్ధి చెందలేక పోయాయి. త్రైతాయుగములో రావణబ్రహ్మ అధర్మము అయిన యజ్ఞములను సాగనిచ్చే వాడు కాదుయన్నది మనకు తెలిసిన విషయమే. అయితే జ్ఞానము తెలియనివారు, అధర్మములను ఆచరించువారు రావణ బ్రహ్మను అజ్ఞాని, అధర్మము గలవాడు అని అన్నారు.

త్రైతాయుగములో నిజమైన జ్ఞాని, జ్ఞానులలో మొదటివాడు, రావణ బ్రహ్మయని పేరుగాంచినవాడు, త్రికాల జ్ఞాని అయిన బ్రహ్మవిద్యలో అధికుడుగా రావణబ్రహ్మ ఉండెడివాడు. అయినా ఆయనను అధర్మము గలవానిగా వర్ణించడము పూర్తి తప్పు. అధర్మములను ఆచరించువారే రావణబ్రహ్మను ధర్మహీనుడు అన్నారు. త్రైతాయుగములో ధర్మముల సింహము అధర్మముల లేళ్లను కనిపిస్తే తరిమేది. అదే రావణ బ్రహ్మ కాలములో యజ్ఞములను చేయువారిని రావణబ్రహ్మ పాలనలోని వారు

కనిపిస్తే తరిమేవారు. అప్పుడు వారు చేయుచున్న యజ్ఞములను వదలి పారిపోయేవారు. అదంతా చూస్తే ధర్మములు సింహమువలె తిరుగగా అధర్మములు జింకలవలె భయపడుచూ చాటుగా ఉండేవి. మూడు యుగములు గడచిన తర్వాత కలియుగములో క్రొత్తగా 'మతము' అను వింత జంతువు పుట్టి సింహమునకే అర్థము కాకుండా చేసింది.

మూడు గ్రంథముల జ్ఞానముగానున్న దానిని మతము అను అధర్మము మూడు ముక్కలు చేసింది. అనగా మూడు గ్రంథములలో ఒకే జ్ఞానముగా యున్న సింహములాంటి జ్ఞానమును, ధర్మములను మూడు ముక్కలుగా చేసి ఒక్కొక్క ముక్క ఒక్కొక్క మతమునకు అని పంచివేసినది. మనుషులలో మూడు మతములుగా యున్నది అధర్మమైన తానే (మతమే) కనుక 'దేవుని జ్ఞానము' అను సింహమును ముందు తల భాగమును హిందువులకు పంచినది. (బాగా అర్థమగుటకు ఉదాహరణగా చెప్పు దానిని అర్థము చేసుకోండి.) భగవద్గీతను సింహము తల భాగముగా, రెండవ దైవ గ్రంథముగా వచ్చిన బైబిలును సింహము కాళ్ళ భాగముగా, చివరిలో వచ్చిన ఖుర్ఆన్ గ్రంథమును సింహము నడుము భాగముగా మూడు ముక్కలు చేసి పంచినది. **హిందువులకు సింహము తల, క్రైస్థవులకు సింహము కాళ్ళు, ముస్లీమ్‌లకు సింహము నడుము భాగమును పంచినది.** సింహము మూడు ముక్కలైనా తిరిగి అతుక్కొని సజీవము కాగలదు. ధర్మములు సింహము రూపముగా పోల్చాము. ధర్మములకు గ్లాని ఏర్పడవచ్చునుగానీ అవి నాశనమగునవి కావు. శాశ్వితముగా ఉండునవే ధర్మములని చెప్పు కొన్నాము. అందువలన ధర్మములుగా పోల్చబడిన సింహము ముక్కలైనా సజీవముగానే ఉండును. తిరిగి అతుక్కొని పూర్తి బలముతో **మతము** అను అధర్మము మీదికి కూడా దాడి చేయగలదు.

అయితే మతము అను అధర్మము సింహము భాగములను తలక్రిందులుగా చేసి పెట్టిన దానివలన అది తొందరగా సజీవము కాలేదు. ఆదరణకర్త వచ్చి ముందు వెనుక యున్న భాగములను వరుసగా పేర్చి సింహమును సజీవము చేసి, మతమును పారద్రోలగలడు.

సింహము ముక్కలు అపసవ్యముగా ఉన్నాయి చూడండి. అలా ఉండునట్లు మతము చేసిపెట్టినది. హిందువులకు సింహపు తల భాగమును ఇచ్చి, మధ్యలోని క్రైస్థవులకు కాళ్ళను ఇచ్చినది. మొండెమును ముస్లీమ్‌లకు ఇచ్చినది. మధ్యలో మొండెము ఉంటే పైన తల, క్రింది కాళ్ళు సులభముగా అతుక్కొని సింహము పూర్తి సజీవమయ్యేది.



మతము అను వింత జంతువు సింహమును మూడు ముక్కలు చేసి తల భాగమును భగవద్గీతగా హిందువుల గ్రంథముగా చూపి ఇది హిందువులదని చెప్పినది. దానివలన జ్ఞానము తెలియని హిందువులు మూడు గ్రంథముల జ్ఞానము ఒక్కటేనని గ్రహించలేక మాది తల భాగమే అన్నట్లు, మా జ్ఞానము వేరు అని అంటున్నారు. రెండవ గ్రంథములో వచ్చిన జ్ఞానము దేనికి అనుబంధముగా ఉన్నదియని తెలియనట్లు తల

క్రిందనే సింహపు కాళ్ళను పెట్టడము వలన రెండు ఒకదానికొకటి అనుసంధానము కానిదానివలన భగవద్గీత వేరు, బైబిలు వేరు అను భావము వచ్చినది. క్రైస్థవులకు సింహము కాళ్ళను ఇవ్వడమైనది.



మూడు గ్రంథముల జ్ఞానము భాషరీత్యా, భావమురీత్యా ఒక దానితో ఒకటి పొందిక లేకుండా పోయినది. సింహపు శరీర భాగములు ఏ విధముగా పైవి క్రిందివి పొందిక లేక అనుసంధానము కానట్లు ఉన్నవో అట్లే భగవద్గీత జ్ఞానముతో బైబిలు అనుసంధానము కానట్లు కనిపించగా, బైబిలుతో ఖుర్‌ఆన్ అనుసంధానము కానట్లు మనుషులకు కనిపించుచున్నది. మనుషులలోని మతము అలా అర్థము కాకుండా చేసినది. మొదట గ్రంథములోని జ్ఞానమునకు ఖుర్‌ఆన్ గ్రంథము అనుసంధానము కావచ్చును గానీ బైబిలు వేరుగా కనిపించుచున్నది. ఖుర్‌ఆన్ గ్రంథము తర్వాత



బైబిలు చదివితే రెండింటి భావము ఒక్కటేయని తెలియును. అట్లే ఖుర్ఆన్‌కంటే ముందు భగవద్గీత చదివి, తర్వాత ఖుర్ఆన్ చదివితే దానికి ఇది అనుసంధానముగా కనిపించును. మూడు గ్రంథములు చదివిన వానికి ముందు వెనుక అర్థము చేసుకొంటే మూడు గ్రంథములు అనుసంధానమై పోవును. అయితే మొదట ఏ మతమువాడయినా రెండవ మతము యొక్క ధ్యాసను మనస్సులోనికి తెచ్చుకొనుటకు కూడా నచ్చని విధముగా ఉన్నాడు. నా మతము వేరు, నా గ్రంథము వేరు, నా దేవుడు వేరు అను భావములో మనుషులు అందరూ ఉండుట చేత మూడు గ్రంథములను చదువువాడు ఎవడూ లేడని చెప్పవచ్చును. సింహము యొక్క మూడు భాగములను కలిపి చూడకపోతే సింహము కనిపించదు. మూడు భాగములను క్రమముగా కలిపిచూస్తే అప్పుడు పూర్తి సింహము ఆకారము కనిపించును. అట్లే మూడు గ్రంథములను చదువగలిగినప్పుడు నిజమైన ధర్మములు సజీవముగా కనిపించును. అప్పుడు తిరిగి సింహము సజీవమై వింత జంతువుగా వచ్చిన 'మతము' అను అధర్మమును లేకుండా చేయగలదు. మూడు గ్రంథములను ఎవడయినా చదువగలడాయంటే ఎవడయినా చదివినా తన గ్రంథము గొప్పదను భావము కల్గి ఇతర గ్రంథములలో తప్పులను వెదకుటకు చదువునుగానీ, మిగతా గ్రంథములో తన గ్రంథములోని జ్ఞానమునకు అనుసంధానమైన జ్ఞానముండునను ఉద్దేశ్యముతో చదవడు. అలా ముందే అందులో తప్పులున్నవను ఉద్దేశ్యముతో చదివితే ఇతర గ్రంథములలోని గొప్పదైన జ్ఞానము తెలియదు. అవి నీ గ్రంథముతో అనుసంధానమైన జ్ఞానము కలదని తెలియదు. మూడు దైవ గ్రంథములను చదివితే అందులో పూర్తి సింహము రూపము కనిపించును. ముక్కలు చేయబడిన మూడు భాగములు సవ్యముగా ఒకచోట

చేర్చితే అది సజీవ సింహమైనట్లు మూడు గ్రంథములను చదివితే అది అధర్మములను వేటాడు శక్తిగలదై, పూర్తి బలముతో సజీవముగా నిలబడును.



మూడు గ్రంథముల సమాచారమును సంపూర్ణముగా తెలిసినవాడు అధర్మముల ఎడల సింహబలము గలిగి, సింహముతో సమానముగా ఉండును. అటువంటి వానికి ఏ అజ్ఞానము చేరదు. మతము అనునది దరిదాపులకు కూడా రాదు. మూడు గ్రంథములను చదివినవాడు ధర్మముల మీద ఉండును. మూడు గ్రంథములు చదివి వాటి సారాంశమును తెలియని వాడు ఒక ధర్మము మీద కూడా ఉండడు. వాడు అధర్మముల పాలై పోవును. అటువంటి వానిలో మతము అను అధర్మము పూర్తి స్థాయిలో ఉండును. ఈ విషయమై అంతిమ దైవగ్రంథమయిన ఖుర్ఆన్ గ్రంథమున సూరా 5, ఆయత్ 68 లో ఇలా చెప్పారు చూడండి.

**(5-68) "ఓ గ్రంథ వాహకులారా! మీరు తౌరాతు, ఇంజీలు (భగవద్గీత, బైబిలు) ను మరియు మీ ప్రభువు మీవద్దకు పంపబడిన**

**దానిని (ఖుర్ఆన్ గ్రంథమును) మీ జీవితాలలో నెలకొల్పు వరకు మీరు ఏ ధర్మముపైనా లేనట్లే."**

తౌరాతు గ్రంథమును (భగవద్గీతను) ఒకమారు సవివరముగా చదివితే అందులో చెప్పబడిన జ్ఞానము ప్రకారము మిగతా దైవ గ్రంథములను చదువవలెనని తెలియును. సింహము తలను చూచిన వాడు మిగతా అవయవముల కొరకు వెదకును. తలను చూచిన తర్వాత అది సింహము అని ఎవరయినా గుర్తు పట్టగలరు. తర్వాత సింహపు అవయవముల కొరకు వెదుకుదురు. ఒకవేళ వేరే జంతువు అవయవములు దొరికినా అవి సింహము అవయవములు కాదని సులభముగా గుర్తు పట్టగలరు. ఒకమారు భగవద్గీతను చదివినవారు మిగతా ఏ గ్రంథములను చదివినా తృప్తి చెందరు. దైవ గ్రంథములను చదివినప్పుడే సంతోషమును వ్యక్తము చేయుదురు. ఈ విషయమును గురించి ఖుర్ఆన్ గ్రంథమందు ఈ విధముగా చెప్పుచున్నారు చూడండి.

**(62-5) "తౌరాతు గ్రంథము ప్రకారము ఆచరించాలని ఆదేశించినప్పటికీ దానికి అనుగుణముగా ఆచరించనివారు మిగతా ఎన్ని గ్రంథములను అనుసరించినా అటువంటి వారిని ఎన్నో గ్రంథములను వీపుమీద మోయు గాడిదలాంటి వారని ఉపమానముగా చెప్పవచ్చును. దేవుని వాక్యములను ధిక్కరించిన వారి దృష్టాంతము చాలా చెడ్డది. దుర్మార్గపు జనులకు అల్లాహ్ (దేవుడు) సన్మార్గము చూపడు."**

మొదటి గ్రంథమును (భగవద్గీతను) చదివితే వారు మిగతా రెండు దైవగ్రంథముల కొరకు వెదకును. ఈ కాలములో హిందువుగా పుట్టిన

వారు మాత్రమే భగవద్గీతను చదువుటకు అవకాశము కలదు. మిగతా మతముల వారు వారి మతగ్రంథములని చెప్పు వాటిని చదువు అవకాశము గలదు. బహుశా మిగతావారు భగవద్గీతను చదువరు. క్రైస్థవులు తమ గ్రంథములు తప్ప ఇతర గ్రంథములు చదవరు. ఒకవేళ బైబిలు చదివిన క్రైస్థవులకు మిగతా గ్రంథములు చదవవలెనను ధ్యాస రాదు. వారు తమ గ్రంథమే గొప్పయని చెప్పుకొను విధానములోనే ఉందురు. అంతేకాక వారి మతమును వ్యాప్తి చేయు కార్యములలో ఎక్కువ శ్రద్ధ చూపుచుందురు. ఒకవేళ వారు ఇతర గ్రంథమును చదివినా దానిని గురించి ముందే నిర్ణయించుకొన్నవారై దానిమీద తక్కువ గౌరవము గలవారై చదువుదురు. ముస్లీమ్‌ల విషయానికి వస్తే నేడు ఖుర్ఆన్‌ను చదివిన ముస్లీమ్‌లు భగవద్గీతను చదవను మొదలు పెట్టుచున్నారు. భగవద్గీతలో ఏకేశ్వరోపాసన కలదని విగ్రహారాధనను ఖండించడము ఉందని తెలిసి వారు చదివి తెలుసుకొని హిందువులతో మాట్లాడినప్పుడు మా గ్రంథములో చెప్పినదే మీ గ్రంథములో కూడా ఉందని చెప్పి, మీ మతముకంటే మా మతము క్రొత్తదని, భగవద్గీత గొప్పదే అయినా అది ద్వాపర యుగములోనిది, నేడు కలియుగములో పుట్టినది ముస్లీమ్ మతమని తమ మతము గొప్పదని, నవీనముగా యున్న తమ మతములో చేరమని చెప్పుచున్నారు. వారు మత వ్యాప్తి కొరకు ప్రయత్నము చేయుచూ అలా చెప్పుచున్నారు. ఖుర్ఆన్ గ్రంథములో పాత గ్రంథముల జ్ఞానము వదలి క్రొత్త గ్రంథముల జ్ఞానమును చదువమని ఎక్కడా చెప్పలేదు. ఖుర్ఆన్ గ్రంథములో ధర్మములను బోధించారు కనుక ధర్మము ప్రకారము ముందు వచ్చిన గ్రంథములలో కూడా ధర్మములున్నవి అవి చదవమని చెప్పారు. ఖుర్ఆన్ గ్రంథములో మత ప్రచారము చేయమని గానీ మతము అనుదానినిగానీ ఎక్కడా

చెప్పలేదు. ఖుర్‌ఆన్ గ్రంథము తనకంటే ముందు వచ్చిన గ్రంథములను గొప్పగా చెప్పుచూ అందులో కూడా దైవ ధర్మములున్నవని చెప్పుచున్నది. ఈ విషయమై ఖుర్‌ఆన్ గ్రంథములో సూరా ఐదు, ఆయత్ 48లో ఏమి చెప్పియున్నారో ఒకమారు చూస్తాము.

**(5-48) "మేము నీ వైపుకు ఈ గ్రంథమును (ఖుర్‌ఆన్‌ను) సత్యసమేతముగా అవతరింపజేశాము. ఇది తమకన్నా ముందు వచ్చిన గ్రంథాలను (తౌరాతు, ఇంజీలును) సత్యమని ధృవీకరించు చున్నది. నీవద్దకు వచ్చిన సత్యమును వీడి వారి మనోవాంఛలను అనుసరింపకు."**

ఈ విధముగా ఖుర్‌ఆన్ గ్రంథములో వ్రాసియుండుట వలన ఏ ముస్లీమ్ అయినా మతము అనుమాటను విడచి ఖుర్‌ఆన్ గ్రంథము మాటను విన్నట్లయితే గ్రంథములో చెప్పినట్లు ఖుర్‌ఆన్ ధృవీకరించిన, ముందు వచ్చిన భగవద్గీత, బైబిలు గ్రంథములను చదువగల్గును. సత్యసమేతమైన ఖుర్‌ఆన్ గ్రంథము సత్యమునే చెప్పి ముందు వచ్చిన రెండు గ్రంథములు సత్యమని ధృవీకరించడము వలన మిగతా రెండు గ్రంథములను గౌరవ భావముతో సత్యమను నమ్మకముతో చదువను మొదలు పెట్టును. అయితే నేడు ఖుర్‌ఆన్‌ను చదివే ముస్లీమ్‌లు తక్కువ యున్నారు. ఖుర్‌ఆన్ తమ గ్రంథమని చెప్పుకొన్నా, కొందరు మాత్రమే దానిని చదువుచున్నారు. తమ గ్రంథమును చదవడములో కూడా మత నియమము కనిపించుచున్నది. ఏ ముస్లీమ్ అయినా ఖుర్‌ఆన్ గ్రంథమును అరబ్బీ భాషలోనే చదువవలెనను నియమము గలదు. ఆ నిర్ణయము ప్రకారము అరబ్బీ భాష రాకున్నా వారు చదివే దానికి భాష అక్షరములను నేర్చి చదువుచుందును. భాషలోని

భావము తెలియకపోయినా అరబ్బీ భాషలోనే చదువవలెనను నియమమును మత నియమముగా పాటించి అరబ్బీ భాషలోనే చదువుదురు. ప్రక్కనే తెలుగు భాషలో అనువాదము చేయబడిన ఖుర్‌ఆన్ ఉన్నా దానిని ముట్టుకోరు, చదువరు.

తెలుగు భాష వచ్చిన ముస్లీమ్‌లు తెలుగులో ఖుర్‌ఆన్‌ను చదువ వచ్చును కదా!యని మేము అడిగితే, "అది మాకు కాదు, హిందువుల కొరకు తయారు చేశాము" అని అంటున్నారు. హిందువులు చదివి దానిలోని భావమును అర్థము చేసుకొనినా, ముస్లీమ్‌లు మాత్రము తెలియని భాషలో చూపాకారానికి చదువుచున్నారు గానీ వారికి దానిలోని అర్థముగానీ, భావము గానీ తెలియదు. ఈ విధముగా గ్రంథపఠనములో కూడా వారిని మతము శాసించుచున్నది. మతము అనునది ఒక ముస్లీమ్ మతములోనే కాదు మిగతా మతములలో కూడా ఉన్నది. వారిని, దైవ గ్రంథములను ముక్కలుగా చూపుచున్నదేగానీ ఏకముగా చూపలేదు. ముక్కలుగా చూపడము వలన (6-91) లో చెప్పినట్లు తౌరాతు గ్రంథమును మీరు ముక్కలుగా చింపుకొని చదువుకొంటున్నారు. అందులోని జ్ఞానము మీకుగానీ, మీ పెద్దలకుగానీ తెలియదని చెప్పారు. అలాగే నేడు ప్రతి మతము వారు తమ పెద్దలు చెప్పినది అంటారుగానీ తమ గ్రంథములోనిది యని చెప్పరు. వాస్తవముగా వారు గ్రంథములను చదవలేదు. వారి పెద్దలు చెప్పినట్లు నడుచుకొనుచుందురు. వారి పెద్దలను మాయ మతము రూపములో ఆవహించి వారి తలలోని భావములను మార్చుట వలన పెద్దలయినవారు మిగతా వారికి మత జ్ఞానమునే బోధించుచున్నారు.

నేడు మతము అను ముసుగులో లేని స్వచ్ఛమయినవాడు వెదకినా కనిపించడు. నాకు మతము లేదు, మత నియమములు లేవు అని గట్టిగా

చెప్పువాడు ఎవడూ లేడు. ఎవడయినా మతము ప్రకారము కాకుండా జ్ఞానము ప్రకారము మాట్లాడితే, మతమును వదలి జ్ఞానమును తెలియాలి అని చెప్పితే వాని ఇంటిలోనే వానికి వ్యతిరేఖత వస్తుంది. ఒక ముస్లీమ్ జ్ఞానము ప్రకారము మాట్లాడితే వంద ముస్లీమ్‌లు వానికి ఎదురు మాట్లాడుదురు. "రేపు నీవు చనిపోతే నీ శవమును మా ముస్లీమ్ గోరీలలో పూడ్చనివ్వము. ఏ ముస్లీమ్ నీ శవాన్ని తాకడు. మత నియమము పాటించనివాడు "కాఫీర్" అవుతాడు" అని అందురు. కాఫీర్ అంటే అజ్ఞానియని కొందరు, దైవద్రోహి అని కొందరు చెప్పుచున్నారు. మనిషి బ్రతికి యున్నప్పుడే మతము అను రోగము అంటుకోవడముకాక, మనిషి చనిపోయినప్పుడు కూడా వాని శవాన్ని కూడా మతము వదలలేదు. ఏ రోగమయినా మనిషి బ్రతికియున్నప్పుడే ఉంటుంది. చనిపోతే వానిలో దాని ఛాయలు ఏమాత్రము కనిపించవు. అయితే మతము అనునది చనిపోయిన మనిషిని కూడా వదలలేదు. ఊరి బయటికి పోయి చూస్తే హిందువుల స్మశానము వేరు, క్రైస్థవుల స్మశానము వేరు, అట్లే ముస్లీమ్‌ల స్మశానము వేరుగా యున్నవి. పొరపాటుగా కూడా హిందువుల శవమును తెచ్చి ముస్లీమ్‌ల స్మశానములో పూడ్చరు. ముస్లీమ్‌లు వారి శవమును ఇతర స్మశానములలో పూడ్చరు. చివరకు చనిపోయి కుళ్ళి పోయిన శవాలవద్ద కూడా మత నియమాలు ఉన్నాయి. మతము మాట వినని వానిని మతము, సాంప్రదాయములను ఆచరించని వారిని, ధిక్కరించిన వారిని వారి స్మశానములో పూడ్చము అని బెదిరించడము కూడా కలదు. చనిపోయినా వదలని మతము కావాలా వద్దా?యని మనిషి ఆలోచించు కోవలసిన సమయము వచ్చుచున్నది. దేవుని జ్ఞానము మనిషి చనిపోక ముందే, బ్రతికియున్నప్పుడే శాంతిని కలుగజేయుచున్నది. మతము

బ్రతికినప్పుడేకాక చనిపోయినప్పుడు కూడా మనిషిని వేదించుచున్నది. అలా వేదనలో పంపు మతము కావాలా? శాంతిని కలుగజేయు జ్ఞానము కావాలో? మనిషి ఆలోచించుకోవలసిన సమయము ఆసన్నమగుచున్నది. మత గ్రంథములని దైవ గ్రంథములకే మతము ముద్రవేసి, తన పేరు గ్రంథము ముందర చెప్పునట్లు చేసినది. దేవుడు చెప్పినది దైవజ్ఞానమేగానీ మత జ్ఞానము కాదు కదా! మతమును కాదంటే, మత గ్రంథము కాదంటే మీ పెద్దలు నిన్ను వెలివేస్తారు. నిన్ను వెలివేయు మతము కావాలో, ఆదరించు జ్ఞానము కావాలో ఆలోచించుకోవలసిన సమయము ఆసన్నమగుచున్నది.

నీవు పుట్టింది ప్రకృతి, పరమాత్మల తల్లితండ్రులకు, చెప్పేది మతము పేరు. నేను ఫలానా మతమువాడిని అనుకుంటున్నావు. ఫలానా వారి కొడుకును అని దేవుని పేరు చెప్పడము లేదు. నీవు సృష్ఠింపబడిన వానివి, నిన్ను సృష్ఠించిన వానిని గురించి చెప్పు, నీ మతమును గురించి చెప్పకు. ఎందుకనగా! మతము మాయగా ఇంతకాలము మనుషలలో చేరి ముదిరి పోయినది. అయితే ఇప్పుడు మతము మాయగా ఉండడము కాకుండా అది మాయమై పోవు కాలము దగ్గరికి వచ్చినది. ద్వితీయ దైవ గ్రంథములో ఆదరణకర్త వస్తాడని ఇప్పుడు నేను చెప్పని విషయములను చెప్పునని ముందే చెప్పియున్నాడు. అట్లే ఆదరణకర్త వచ్చే కాలము వచ్చిందేమో! ఆదరణకర్త వచ్చి ఆ రోజు సహించరు అను ఏసు చెప్పు విషయములను సహించినా, సహించక పోయినా తప్పక చెప్పును. ఆ రోజు సహించనిది మతమును గూర్చి చెప్పితే మేము అట్లు లేము కదా!యని అనవచ్చును. ఆ దినము మతము లేదు. అందువలన ఆ రోజు చెప్పలేదు. నేడు దేవుడు ఆదరణకర్తగా వచ్చినా ముందు వచ్చిన ప్రవక్తలు చెప్పిన జ్ఞానమునే చెప్పునుగానీ ఆయన తనంతకు తాను క్రొత్త జ్ఞానమును చెప్పడు. ముందు

చెప్పిన వాటినే చెప్పును. అయితే ఇప్పుడు వచ్చే వాని దృష్టి మతము మీదనే.

ఆదరణకర్త వచ్చినా తాము చెప్పిన వాటినే చెప్పునని బైబిలులో యోహాను సువార్త 16వ అధ్యాయములో 13, 14, 15వ వచనములను ఒకమారు చూడండి.

**(యెహాన్ : 16-13,14,15) "అయితే ఆయన అనగా సత్యస్వరూపియైన ఆత్మ వచ్చినప్పుడు మిమ్ములను సర్వ సత్యము లోనికి నడిపించును. ఆయన తనంతట తానే ఏమియూ బోధించక వేటిని వినునో వాటిని బోధించి సంభవింపబోవు సంగతులను మీకు తెలియ జేయును. (14) ఆయన నా వాటిలోనివి తీసుకొని తెలియజేయును గనుక నన్ను మహిమ పరచును. (15) తండ్రికి కలిగి యున్నవన్నియు నావి. అందుచేత ఆయన నా వాటిలోనివి తీసుకొని మీకు తెలియ జేయునని నేను చెప్పితిని."**

బైబిలులోని వాక్యమును లోతుగా చూస్తే ఎంతో విషయము అర్థము కాగలదు. వచ్చేవాడు **సత్యస్వరూపియైన ఆత్మ** అనగా సృష్టికర్తయైన మనకు తాతయైన **పరమాత్మ**యే శరీరము ధరించి వచ్చుచున్నాడని అర్థము. ఆయన వస్తే ఏమి చేస్తాడు? అని ప్రశ్నించుకొని చూస్తే వాక్యములోనే సర్వసత్యము లోనికి నడిపించును అని ఉన్నది. సర్వ అనగా 'ఎల్లప్పుడు', సత్యము అనగా 'మారనిది' యని అర్థము. ఎల్లప్పుడూ మారనిది, శాశ్వతముగా ఒకే పద్ధతిలో ఉండునది ధర్మమే కనుక **ధర్మమును సర్వసత్యము** అన్నారు.

సర్వ సత్యములోనికి నడిపించును అనగా "అధర్మముల నుండి ధర్మములవైపు పంపును" అని అర్థము.

కష్టాలలో ఉన్నవానిని పలకరించి వానికి సహాయము చేసి వాని కష్టములనుండి బయటపడవేస్తే వానిని ఎంతో ఆదరించినట్లగును. కష్టాలలో ఉండే వానిని, డబ్బు లేనివానిని ఎవరూ పలకరించరు. కష్టాలలో ఉండేవానిని మనమే స్వయముగా పలుకరించి, ఆదుకొని కష్టాలను తొలగిస్తే దానిని మించిన ఆదరణ లేదు. మనుషులు స్వంత ధర్మములను పోగొట్టుకుని స్వతంత్రముగా బ్రతుకలేక పరధర్మములలో పడి చివరకు స్మశానములో కూడా స్వతంత్రత లేకుండా బ్రతికేవారికి స్వంత ధర్మములను గుర్తు చేసి, పరధర్మములను వదలించి ఇతరుల ఆధీనములో లేకుండా స్వతంత్రముగా బ్రతుకుటకు వీలు ఎవరు కల్పిస్తారో, వారే నిజమైన ఆదరణకర్త, అదే నిజమైన ఆదరణయని చెప్పవచ్చును. భూమిమీద ఒకరికి ఇద్దరికి కాకుండా ప్రపంచము మొత్తములో స్వతంత్రత లేనివాళ్లందరికీ స్వతంత్రత కల్పించడము కొరకు వచ్చువాడు చిన్నవాడైయుండడు. అతడు సామాన్యుడు కాదనియే చెప్పాలి. అలా వచ్చువాడే నిజమైన **ఆదరణకర్త.**

ముందు వచ్చిన దైవ గ్రంథములలో దొరికిన సమాచారమునుబట్టి ప్రజలను ధర్మములతో ఆదరించు ఆదరణకర్త వస్తే ధర్మచక్రమును ధరించి రాగలడు. **ధర్మచక్రము** అనగా శరీరమే కదా! దానిని అందరూ ధరించి వస్తారు కదా!యని కొందరు అనుకోవచ్చును. సాధారణ శరీరమునే ధర్మచక్రము అని అనవచ్చును. అయితే సాధారణ జనులు ధరించు దానిని ధర్మచక్రము అను పేరుతో పిలువము. దేవుడు భూమిమీద అవతరించు నప్పుడు ఏ శరీరమును ధరించి వచ్చునో, ఆ శరీరమును మాత్రము ధర్మచక్రము అనుటకు అవకాశము గలదు. శరీరమును సాధారణ మనిషి

ధరిస్తే దానిని సాధారణ శరీరము అందుము. దేవుడు శరీరము ధరించి వస్తే దానిని **ధర్మచక్రము** అని తప్పనిసరిగా అనవలెను.

**ప్రశ్న :- మనిషి ధరించు దానిని శరీరము అని అనుట సహజమే. అయితే పుట్టిన వారందరూ శరీరముతోనే బ్రతుకుచుందురు. పుట్టిన అందరిలో ఒకరు దేవుడు కూడా ఉండవచ్చును. ఆయన కూడా శరీరమునే ధరించి వచ్చును అని మీరు కూడా అప్పుడప్పుడు చెప్పగా విన్నాము. ఇప్పుడేమో దేవుడు ధరించిన శరీరమును మాత్రము ధర్మచక్రము అని అంటాము అని చెప్పుచున్నారు. ఈ విషయమును మీరు ఎలా చెప్పగలుగుచున్నారు?**

**జవాబు :-** దేవుడు మనిషిగా పుట్టేది వాస్తవమే అయినా, ఆయన సాధారణ మనిషివలె పుట్టి, మనుషులలో కలిసిపోయి ఉండును. అందువలన ఈయన ధరించినది ధర్మచక్రము అని చెప్పుటకు వీలు ఉండదు. శరీరమును ధరించినవాడు ఎవడయినది ముందు తెలిస్తే, అప్పుడు సామాన్యునిది శరీరమనీ, దేవునిది ధర్మచక్రమనీ చెప్పవచ్చును. ధర్మచక్రమునకు శరీరమునకు ఏదయినా తేడా ఉండునా అంటే అలాగ కూడా ఉండదు. ఇదంతయూ లెక్కాచారమునకు, శాస్త్రబద్ధత కొరకు చెప్పవలసిందేగానీ బయటికి చూపించుటకు వీలుపడదు. దేవుడు మనిషి శరీరమును ధరించి రావడములో ఏ తేడా యుండదు. తేడాయుండదు కావున శరీరము ధరించి వచ్చినవాడు సాధారణ మనిషి కావచ్చును లేక దేవుడు కావచ్చును. దేవుడు అరుదుగా వచ్చును. నిత్యము పుట్టువారు సాధారణ మనుషులే. అయితే భగవద్గీతలో జ్ఞానయోగమున శ్లోకము ఆరు (6) లోనూ, అలాగే రాజవిద్యా రాజగుహ్య యోగమున పదకొండవ (11) శ్లోకములోనూ చెప్పినట్లు సర్వ మానవులకు దేవుడైనవాడు, సర్వమానవులు పుట్టునట్లే

శరీరమును ధరించి పుట్టుచున్నాడు. అయితే దేవుడు ధర్మసంస్థాపన నిమిత్తము భూమిమీద పుట్టును. అలా పుట్టాడని తెలియకుండుటకు సాధారణ మనిషి శరీరము ధరించి పుట్టునట్లే పుట్టును. అయితే ఆయన పుట్టుకలో కొంత తేడాయున్నా దానిని ఎవరూ గమనించలేరు. గమనించునట్లు ఆయన పుట్టలేదు.

మనిషి జన్మకు, దేవుని జన్మకు కొంత తేడా యుండుట వాస్తవమే. మనిషి జన్మలో తల్లిగర్భమునుండి శిశుశరీరము బయటపడిన తర్వాత పుట్టిన శరీరములో జీవుడు చేరును. గర్భమునుండి శిశువు తల బయట పడినప్పటినుండి పది లేక పన్నెండు లేక ఇరవైనాలుగు గంటల లోపల ఎప్పుడైనా జీవుడు పుట్టిన శరీరములో చేరుటకు అవకాశము గలదు. అయితే దేవుడు పుట్టినప్పుడు జీవుడు ప్రత్యేకముగా బయటనుండి రాడు. దేవుని జన్మలో శిశువు తల్లిగర్భము నుండి నేరుగా సజీవముగా పుట్టుచున్నది. దానిని ఎవరూ గమనించలేరు. ఎందుకనగా! సాధారణ జనులు కూడా తల్లిగర్భమునుండి సజీవముగా పుట్టుచున్నారని అందరూ అనుకోవడము జరుగుచున్నది. సాధారణ మనిషి పుట్టితే శరీరము పుట్టిన తర్వాత 'జీవుడు శరీరములో చేరును' అనుమాట ఎవరికీ తెలియదు. అందువలన సజీవముగా పుట్టిన దేవున్ని చూచినా, వానిని సాధారణ మనిషే అనుకోవడము జరుగుచున్నది.

మనిషి ధరించిన శరీరములో జీవుడు ఉండును. జీవుడు ధరించిన శరీరమునే మనిషి అంటున్నాము. అయితే దేవుడు ధరించిన శరీరములో తేడాను ఎవరూ గమనించలేరు. పైకి కనిపించు తేడాలు ఏమీ ఉండవు. దేవుడు ధరించిన శరీరములో జీవుడు ఉండడు, ఆత్మ ఉండదు. ఎక్కడ జీవుడు ఉంటాడో అక్కడ ఆత్మ ఉండును. జీవుడు, ఆత్మ ఇద్దరూ ఒకచోట

ఉండడము సజీవ శరీరములోని విధానము. దేవుడు వచ్చి తల్లిగర్భము నుండే సజీవముగా పుట్టుచున్నాడు. అయినా ఆ శరీరములో జీవుడు, ఆత్మ లేకుండా కేవలము ఆత్మకంటే వేరయిన పరమాత్మ ఉండును. ఆత్మకు తండ్రి, జీవాత్మకు తాతయైన దేవుడు ధరించిన శరీరములో జీవాత్మ, ఆత్మ రెండూ లేకుండును. జీవాత్మ, ఆత్మ రెండూ లేని దేహము ప్రపంచములో ఎక్కడా ఉండదు. జీవాత్మ అనుభవించుచుండగా, ఆత్మ శరీరములోని కార్యములన్నీ చేయుచూ జీవునికి అనుభవములను అందించుచుండును. జీవాత్మను ఆత్మ జీవింప చేయుచున్నది. సర్వ జీవరాసులయందు జీవాత్మ ఉన్న చోటంతా ఆత్మ ఉండును. ఆత్మ ఉంటేనే జీవాత్మ జీవించగలుగును. ఆత్మలేని జీవాత్మగానీ, జీవాత్మలేని ఆత్మగానీ ఏ శరీరములో లేదు.

దేవుడు ధరించిన శరీరములో జీవాత్మ, ఆత్మ లేదు. శరీరములో ఉన్న దేవుడే జీవాత్మగా, ఆత్మగా నటించుచూ శరీరములో కార్యములు జరుగునట్లు చేయుట వలన ఆ శరీరములో జీవుడు ఉన్నాడని అనుకొందుము. దేవుడున్నాడని ఎవరికీ అనుమానము రాదు. **జీవుడు లేని ఏకైక శరీరము దేవుడు ధరించినదే.** అయితే ఇక్కడ ప్రతి మనిషి జాగ్రత్తగా తెలియవలసినది చాలా ఉన్నది. దేవుడు శరీరములో జీవుని వలె మరియు ఆత్మవలె నటించుచుండును. తనను ఆత్మగానే తలచును. శరీరము లేనివాడు పరమాత్మ అయినందున శరీరములో యున్న పరమాత్మ శరీరములో ఉన్నంత కాలము తనను ఆత్మగా చెప్పుకొనును. కొన్ని సమయములలో జీవాత్మగా చెప్పుకొనును. తాను పరమాత్మయై యుండి పరమాత్మను తండ్రియని చెప్పును. జ్ఞానము ప్రకారము జీవాత్మ, ఆత్మను తండ్రియని అనవచ్చును. అందువలన తాను జీవాత్మయైనట్లు ఆత్మను తండ్రియని అన్నట్లు నటించును. కొన్ని సమయములలో తాను ఆత్మయైనట్లు

పరమాత్మను తండ్రియని చెప్పును. అలా ఒక్కొక్కప్పుడు ఒక్కొక్క రకముగా మాట్లడుట వలన శరీరములో యున్న దేవున్ని ఎవరూ గుర్తించుటకు అవకాశము లేదు.

ఇంజీలు గ్రంథములో ఏసు తనను జీవాత్మగా పోల్చికొనిన మాటలు గలవు. ఆత్మగా పోల్చుకొని పరమాత్మను తండ్రిగా చెప్పిన మాటలు గలవు. అట్లే జీవాత్మగా ఆత్మను తండ్రిగా పోల్చి చెప్పిన మాటలు గలవు. కృష్ణునిగా యున్నప్పుడు జీవితమంతా జీవునిగానే నటించాడు. అయితే భగవద్గీతను చెప్పునప్పుడు మాత్రము **"స్వయముగా నేను సృష్ఠికర్తనయిన దేవున్నియని, పరమాత్మనని"** చెప్పాడు. నమ్మరేమోనని తన విశ్వరూపమును చూపాడు. ఈ విధముగా బాగా గమనించితే దేవుడు ధరించిన శరీరమును గుర్తించుటకు, ఈయన దేవుడేయని చెప్పుటకు ఇటువంటివి ఎన్నో ఆధారములు గలవు. కన్ను ఉన్న వానికే చూపు అన్నట్లు దేవుడు సాధారణ శరీరములో పైకి కనిపించినా ఆయన బోధలనుబట్టి, ఆయన మాటలను బట్టి సూచాయగా ఆయనను గుర్తించుటకు అవకాశము గలదు. అయినా ఆయన అంత సులభముగా అర్థము కాడు. ఇప్పుడు నేను పైన చెప్పినట్లు కొన్ని గుర్తులు కనిపించినా, ఆ గుర్తుల వలన దేవున్ని గుర్తించుటకు సాధ్యమున్నా ఆయన దేవుడు కాదు అనుటకు ఆయన వద్దనే ఎన్నో విషయములు కనిపించుచుండును. దేవుడు అనుటకు ఒకటి లేక రెండు ఆధారములు కనిపించినా దేవుడు కాదు అనుటకు వందల కొలది ఆధారములు కనిపించును. అందువలన ప్రత్యక్షముగా విశ్వమునకు అధిపతియైన సర్వమును సృష్ఠించిన సృష్ఠికర్త అయిన పరమాత్మ కృష్ణుని రూపములో భూమిమీద మనుషుల మధ్యలోనికి వచ్చినా, ఎవ్వరూ ఆయన దేవాది దేవుడని గుర్తించలేక పోయారు. అలాగే రెండువేల సంవత్సరముల

పూర్వము ఏసుగా శరీరము ధరించి వచ్చినా ఆ రోజు కూడా ఎవరూ ఆయనను గుర్తించలేక పోయారు. గుర్తించకపోవడమే కాక ఆయన చెప్పిన జ్ఞానమును, చెప్పిన మాటలను విని అర్థము చేసుకోలేక ఆయనదే తప్పుయన్నట్లు ఆయన మీద నిందవేశారు.

కృష్ణుడుగా వచ్చినప్పుడు ఆయన ధనికుడుగా ఉండుట వలన ఎవరూ ఆయన జోలికి పోలేదు. ఏసుగా వచ్చినప్పుడు పేదవానిగా వచ్చినందున అందరూ ఆయనను చిన్నచూపు చూచారు. అంతటితో ఆగక ఆయన మీద అనవసరముగా, అసూయతో నిందారోపణ చేశారు. చివరకు న్యాయస్థానమునకు పిలుచుకపోయి శిక్ష వేయించారు. మరణశిక్ష వేయించామని సంతోషించారు. ఆనాడు ఆయనను దేవుడని ఎవరూ గుర్తించలేక పోయారు. ఏసుగా ఉన్నప్పుడు ఆయన ఎంతో జ్ఞానమును తెలియజేస్తే ఇది దేవుడు తప్ప ఎవరూ చెప్పలేరని తెలియక ఆయన చెప్పిన బోధలను గ్రహించుకోలేక జ్ఞానమును అజ్ఞానముగా తలచి అప్పటికి జ్ఞానులయిన వారు ఆయన మీద అసూయ పెంచుకొని, ఆయనను మరణ శిక్షకు గురిచేశారు. ఆయనను చంపిన తర్వాత సమాధిలో పెట్టగా ఆయన "నేను చనిపోవువాడను కాను నాకు చావు లేదు" అన్నట్లు సమాధి నుండి లేచి వచ్చినా ఆయనను దయ్యము అన్నారుగానీ దేవుడు అని అనలేకపోయారు. ఇట్లు కృష్ణుడుగా వచ్చిన సమయములలోనూ, ఏసుగా వచ్చిన కాలములోగానీ ఆయనను గుర్తించలేక పోయారు. ప్రత్యక్షముగా చెప్పిన బోధలను, ప్రత్యక్షముగా చేసిన పనులను చూచి కొంతయినా ఆలోచించ లేకపోయారు. కొన్ని సమయములలో 'నేనే దేవున్ని' అని చెప్పిన వాక్యములు గలవు. **(యోహాన్ 14-10,11) "తండ్రియందు నేనును నా యందు తండ్రియున్నామని నీవు నమ్మలేదా?"** అని అడిగాడు.

ఈ మాటలో దేవున్ని నేనేయని చెప్పకనే యున్నప్పటికీ ప్రజలు ఏమాత్రము ఆయనను గుర్తించలేకపోయారు. కృష్ణుడు జీవితమంతా తాను ఎవరయినది తెలియకుండా దాచుకొన్నా, తన బోధ చెప్పినప్పుడు "నేనే దేవున్ని నన్నే మ్రొక్కుము" అన్నాడు. అట్లు చెప్పినా అక్కడా నమ్మలేదు. ఏసుగా వచ్చినప్పుడు కూడా "నేనే దేవున్ని" అని చెప్పినా ఇక్కడా నమ్మలేదు. దగ్గరకు వచ్చిన దేవున్ని కూడా తెలియలేని వారు, "నేనే దేవున్ని" అని చెప్పినా గుర్తించలేని వారిని ఏమనాలో నాకు అర్థము కాలేదు. అంత లోతుగా చెప్పినా, దగ్గరగా కనిపించినా తెలియనప్పుడు తర్వాత దేవుడు మనిషిగా వస్తే గుర్తింతురని నమ్మకము లేదు. ఆయనను గుర్తించడము సాధ్యమయ్యే పనికాదు కావున ముందే ఏసు ఆదరణకర్తగా వస్తాడని ప్రకటించాడు. అయినా ఆయన ఎట్లు వస్తాడో, ఎప్పుడు వస్తాడో, ఎవరి దగ్గర వస్తాడో ఎవరికీ తెలియదు.

**ప్రశ్న :- మనిషి వచ్చినా శరీరముతోనే, దేవుడు వచ్చినా శరీరముతోనే యని మనిషి పుట్టుకకు దేవుని పుట్టుకకు తేడా ఉండునని చెప్పారు. ఆ తేడా ఎవరూ గుర్తించలేనిదని కూడా చెప్పారు. శరీరముతో సహా సజీవముగా ఎవరు పుట్టుదురో వారే దేవుడనీ, ఆయన ధరించినదే ధర్మచక్రమని అందుము అన్నారు. దేవుడు అంటే ప్రత్యేకమయినవాడు కావున మనవలె ఉన్న వానిని దేవుడు అనవచ్చును. శరీరము దేవుడు ధరించినది మనిషి ధరించినది రెండూ ఒకటే అయినప్పుడు మనిషి ధరించిన దానిని శరీరము అని దేవుడు ధరించిన దానిని ధర్మచక్రము అని ఎందుకు అనవలసి వచ్చినదో పూర్తిగా సమాధానము మీరు చెప్పలేదు. మాకు అర్థమయ్యేలాగున పూర్తి వివరముగా చెప్పండి? ధర్మచక్రమును గుర్తించుటకు ఏదయినా అవకాశముండునా?**

**జవాబు :-** శరీరములో ఫలానాది ధర్మచక్రమని గుర్తించుటకు పుట్టుకలో తప్ప, పెద్దయిన తర్వాత శరీరములో ఏ గుర్తింపు కనపరాదు. పుట్టుకలో కూడా తెలియుటకు సాధ్యపడదని తెలుసుకొన్నాము. సాధారణ మనిషి శరీరము, దేవుడు ధరించిన శరీరము పైకి ఒక రీతిగానే యుండును. పైన స్థూల శరీరమునకు ఎన్ని భాగములుండునో అన్ని భాగములే రెండు శరీరములలోనూ ఉండును. దేవుడు ధరించిన శరీరము మనిషి ధరించిన స్థూలశరీరము పది భాగములుగానే ఉండును. ఐదు జ్ఞానేంద్రియములు, ఐదు కర్మేంద్రియములు గల శరీరములే దేవునికి, మనిషికి ఉండును. దేవుడు ధరించిన శరీరము కూడా మనిషి ధరించిన శరీరమువలె ఉండును. దేవుడు ధరించిన శరీరము కూడా మనిషి శరీరమువలె స్థూలము, సూక్ష్మము అను రెండు శరీరములుగా ఉండును. పైకి కనిపించునది స్థూలశరీరము కాగా, కనిపించు శరీరములో కనిపించక లోపల అణిగియుండునది సూక్ష్మశరీరము అని అందుము. మనిషి స్థూల, సూక్ష్మ శరీరములను రెండు శరీరములలో జీవుడు కాపురము చేయుచున్నాడు. జీవుడు నివశించు శరీరములో 10 భాగములు స్థూలశరీరము, 14 భాగములు సూక్ష్మశరీరము, 3 భాగములు ఆత్మ మొత్తము 27 కాగా, సర్వసాధారణముగా ఉండునవి 12 మంచి చెడు గుణములు, 12 ధర్మ, అధర్మములు గలవు. గుణములు, ధర్మములు మంచి చెడు రెండు రకములు ఛాయగా తెలిసీ తెలియక (కనిపించీ కనిపించక) శరీరములో ఉండును. అవి మంచి చెడు 12 గుణములు, ధర్మ అధర్మములు 12 యున్నా శరీరములో లెక్కించబడవు. శరీరము ఆత్మలతో కాకపోతే 24 భాగములు, మూడు ఆత్మలతో అయితే 27 భాగములు ఉన్నదని చెప్పవచ్చును. మనిషికి తన శరీర విషయమే తనకు తెలియదు. భగవద్గీత ప్రకారము క్షేత్రక్షేత్రజ్ఞ విభాగ యోగము అను

అధ్యాయములో శరీరమును క్షేత్రము అనియూ, శరీరమును తెలిసినవాడు క్షేత్రజ్ఞుడు అనియూ చెప్పియున్నారు. భగవద్గీత జ్ఞానము ప్రకారము ప్రతి మనిషి కొద్దిగా జ్ఞానము తెలిసినవాడైనా శరీరమును గురించి తెలిసియుండవలెను. మనిషి ఆత్మజ్ఞానములో ప్రాథమిక పాఠములను నేర్చునప్పుడే శరీరమును గురించి తెలియవలసి యున్నది. శరీరమును గురించి తెలియకపోతే శరీరములో నివశించు ఆత్మను, జీవాత్మను గురించి మనిషి తెలియలేడు. అందువలన **జ్ఞాని** అను ప్రతివాడు ముందు శరీర జ్ఞానమును తెలిసియుండాలి. అలా తెలిసినప్పుడే శరీరము బయట స్థూల దేహముకంటే, శరీరములోపల సూక్ష్మదేహము చాలా సారాంశమైనదని తెలియును.

ప్రకృతితో తయారయిన శరీరమును తెలియకపోతే పరమాత్మతో తయారయిన ఆత్మజ్ఞానము ఏమీ తెలియదనీ, ఏ మనిషి అయినా మొదట ప్రకృతి నుండి తయారయిన శరీరమును తెలియకపోతే జ్ఞాని కాలేడనీ, ఒకవేళ అటువంటివాడు తనను జ్ఞాని అని చెప్పుకొంటే అది అసత్యమగునని చెప్పుచూ పెద్దలు ఒక పద్యమును చెప్పారు చూడండి.

**పంచతత్త్వములను పంచీకరించక**
**మంచి యతులమన్న మాటలన్న**
**కుంచమందు గజము గ్రుడ్డుపెట్టిన చందంబు**
**అఖిల జీవసంగ ఆత్మలింగా!**

**భావము :–** ప్రకృతిలోని పంచ భూతములయిన ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి అను ఐదు భాగములు విడదీసి 25 భాగములు చేసి వాటి సమ్మేళనము చేయగా 24 భాగముల శరీరము తయారయినదనీ, వాటి




## సాధారణ మనిషి యొక్క ధర్మచక్రము

వివరమును తెలియగల్గిన వానినే జ్ఞాని అనవచ్చుననీ పెద్దలు చెప్పారు. అట్లు శరీరము ప్రకృతి వలన తయారయిన విషయము తెలియకుండా నేను మంచి జ్ఞానిని అని ఎవడయినా అన్నాడంటే అది ఏనుగు గంప క్రింద గ్రుడ్డు పెట్టునదని చెప్పినట్లుండును. ఏనుగు గంపక్రింద గ్రుడ్డు పెట్టుట ఎంత అసత్యమో శరీర వివరము తెలియనివాడు నేను జ్ఞానిని అనడము అంతే అసత్యమగును.

పై పద్యములో పెద్దలు చెప్పిన విధానమును చూస్తే జ్ఞానము కావాలనుకొను మనిషి ముందు శరీరము ఎలా పుట్టిందో, ఎలా తయారయిందో జ్ఞాన విధానముతో తెలియగలిగితే, వాడు తర్వాత ఆత్మజ్ఞాని అగుటకు అవకాశముండును. జ్ఞానము తెలిసిన తర్వాత ప్రకృతి జ్ఞానమును ఆత్మజ్ఞానమును కలిపిచూస్తే శరీరము ఎన్ని భాగములుగా యున్నదో ముందు పేజీలలో శరీరమును చక్రమువలె గీచిన చిత్రపటమును చూచాము. ధర్మచక్రమును తెలియుటకు ముందు ధర్మచక్రమువలెయున్న శరీర నిర్మాణమును మరొకమారు గమనిద్దాము.

ఈ నిర్మాణములో స్థూల శరీర భాగములు 10 ఉండగా, సూక్ష్మ శరీర భాగములు 14 ఉండగా ఆత్మ భాగములు మూడు ఉండగా మొత్తము శరీరము 27 భాగములుగా యున్నది. అందులో ఛాయగా పూర్తి కనిపించని మంచి చెడు గుణములు 12, ధర్మాధర్మములు 12 మొత్తము 24 గలవు. ఇట్లు స్థూల, సూక్ష్మ, ఛాయ శరీరములను మూడింటిని కలిపి చూస్తే మన ముందరయుండే చక్రమువలె శరీరము కనిపించుచున్నది. ఇది అర్థమగుటకు లెక్కాచారముగా వ్రాయబడినది. దీనిలో అధర్మములు ఆరును, చెడు గుణములు ఆరును తగ్గించుకొన్న జ్ఞానులు కూడా కొందరు గలరు. అప్పుడు వారి శరీరమును 39 భాగములుగానే చెప్పవచ్చును. అన్నిటినీ కలిపి చెప్పితే మొత్తము 51గా ఉన్నట్లు చెప్పవచ్చును. మనిషి శరీరములోని విధానమును జ్ఞానము ప్రకారము చెప్పుకొంటే ఇలా కలదు.

ధర్మసంస్థాపన నిమిత్తము సృష్ట్యాది దేవుడు మనిషిగా సృష్టింపబడు చున్నాడు. వచ్చినవాడు పరమాత్మే అయినా పరమాత్మ స్థానములో హాజరుగా వుండి తన ప్రతినిధిని అని చెప్పుకొనుచూ భూమిమీద తానే

ఉద్భవించుచున్నాడు. అలా పుట్టినప్పుడు తాను ముందే ఒక ప్రత్యేకమైన శరీరమును తన నివాసము కొరకు తయారు చేసుకొనుచున్నాడు. ఈ విషయమునకు సాక్ష్యము అంతిమ దైవగ్రంథములో సూరా 15 నందు, ఆయత్ 28, 29లలో వ్రాయబడి వున్న దానిని చూస్తే నా మాట నిజమని తెలుస్తుంది.

**(15-28, 29) "బాగా ఎండిన నల్లని మట్టితో నేను ఒక మనిషిని (శరీరాన్ని) తయారు చేయబోతున్నాను అని నీ ప్రభువు దూతలతో అన్నాడు. నేను అతని శరీరమును పూర్తి తయారు చేసి అతనిలో నా ఆత్మను ఊదినప్పుడు మీరంతా అతని ముందు సాష్టాంగ పడండి."**

దేవుడు ప్రత్యేకమైన శరీరమును తయారు చేస్తున్నానని ముందే చెప్పియున్నాడు. అలా చేసిన దానిలోకే తన ఆత్మను ఊదును అని వుంది. దేవుడు ధరించు శరీరము సాధారణ మనిషి శరీరమైతే దానిని ప్రత్యేకముగా దేవుడు తయారు చేయవలసిన పని లేదు. దేవుడు ధరించు శరీరము సాధారణ మనిషివలెనున్న శరీరమే అయినా అది ప్రత్యేకముగా తయారు చేయబడ్డది అని తెలిసిపోయినది. అది అందరి శరీరములాగా ఉండదు. అందులో ఏదో ప్రత్యేకత ఉండును. ఆ ప్రత్యేకత ఏమిటి? అని అంటే దేవుడు ధరించిన శరీరములో జీవుడు అసలు లేడు. అట్లే ఆత్మయూ లేదు. మూడు ఆత్మలలో శరీరములో ఉండువాడు పరమాత్మ ఒక్కడేయని తెలిసిపోవుచున్నది. మిగతా స్థూల శరీరము 10 భాగములుండును. అట్లే సూక్ష్మ శరీరము 14 భాగములుండును. మనిషి శరీరములో ఆరు అధర్మములు, ఆరు ధర్మములు మొత్తము 12 ఉండగా భగవంతుని

శరీరములో ఆరు ధర్మములు మాత్రమే ఉండును. గుణముల విషయమునకు వస్తే సాధారణ మనిషికున్నట్లే 12 గుణములుండును.

| | మనిషిలో | భగవంతునిలో |
|---|---|---|
| స్థూల శరీరము | 10 భాగములు | 10 భాగములు |
| సూక్ష్మ శరీరము | 14 భాగములు | 14 భాగములు |
| ఆత్మలు | 3 | 1 |
| గుణములు | 12 | 12 |
| ధర్మాధర్మములు | 12 | 6 |
| జీవుని స్థానము | భర్తీ | ఖాళీ |
| ఆత్మ స్థానము | భర్తీ | ఖాళీ |
| ధర్మముల స్థానము | భర్తీ | సగము ఖాళీ |

బయటి భాగములోని జీవుని చక్రము ఖాళీగా యున్నది. బయటి నుండి నాల్గవ భాగములో ధర్మములు ఆరు గలవు. అధర్మములు ఆరు ఖాళీగా యున్నవి. పూర్తి మధ్య భాగములో ఆరవ భాగములోని ఆత్మస్థానము ఖాళీగా కనిపించుచున్నది. దేవుడు ధరించిన శరీరము ముందే కొన్ని ఖాళీ చేసి దేవుడు తయారు చేశాడు. సాధారణ మనిషి ధరించినది ఆరు భాగముల ధర్మచక్రముకాగా, దేవుడు ధరించినది నాల్గు భాగముల ధర్మచక్రమే.




## భగవంతుడు ధరించిన ధర్మచక్రము

దేవుడు తయారు చేసిన ప్రత్యేకమయిన శరీరము నాలుగు గుండ్రని భాగములుగా యున్నది. మనిషి ధరించిన శరీరమునకు, దేవుడు ధరించిన శరీరమునకు రెండు భాగములు తేడా గలవు. మనిషిది ఆరు భాగములుగా ఉండగా, దేవునిది నాలుగు భాగములుగా యున్నది. దేవుడు ధరించిన ధర్మచక్రము యొక్క చిత్రము తర్వాత పేజీ పటములో చూడండి.

పైకి కనిపించు స్థూల దేహముకల్గి లోపల సూక్ష్మ దేహము కల్గి, బయటికి తెలియు గుణములు కల్గి అట్లే ధర్మములు కల శరీరమును




## దేవుడు ధరించిన ధర్మచక్రము

దేవుడు ధరించి వచ్చుచున్నాడు. దేవుడు మట్టితో మనిషిని తయారు చేయబోతున్నానని చెప్పి ప్రత్యేకముగా నాల్గు భాగముల ధర్మచక్రమును తయారు చేశాడు. ఇందులో జీవాత్మ, ఆత్మస్థానములు రెండూ లేవు. మనిషి ధరించిన శరీరమునకు, దేవుడు ధరించిన శరీరమునకు రెండు భాగముల తేడా ఉండడమేకాక దేవుని శరీరములో అధర్మములు లేవు. ధర్మములు మాత్రమున్నట్లు తెలియుచున్నది.

దేవుడు మనిషి శరీరము ధరించి మనకు తెలిసి కృష్ణునిగా ఒకమారు, ఏసుగా ఒకమారు రెండుమార్లు వచ్చినట్లు తెలియును. రెండు మార్లు వచ్చినా వారు బోధలు చెప్పునప్పుడు **"నేను దేవున్ని"** అని చెప్పి యున్నా దానిని సర్వసాధారణముగా లెక్కించి వారి మాటలలోని సత్యమును ఎవరూ గ్రహించలేక పోయారు. రెండవమారు వచ్చిన ఏసు 'దేవుడు మనిషి ఆకారములో వస్తాడని' చెప్పడమైనది. ఆదరణకర్తగా వస్తాడు అని చెప్పాడు. ఆదరణకర్త యనునది పేరుకాదు. మనుషులను ఆదరించి కర్మలనుండి బయటపడవేయు వాడగుట చేత ఆయనను **ఆదరణకర్త** యని అన్నారు తప్ప ఆదరణకర్త యనునది పేరుకాదు. ఆదరణకర్త యనబడు భగవంతుడు వస్తే ఆయన ధర్మములను బోధించునని మనకు తెలుసు. ఆయన శరీరములో నివశించునప్పుడు ఆయన ప్రవర్తన బయట ఎట్లున్నా ఆయన శరీరములో ఎట్లుండును. బయట కూడా జీవాత్మ లేకుండా ఆత్మ నడుపకుండా, జీవాత్మ, ఆత్మ లేకుండా ఉన్న శరీరములో పరమాత్మ ఒక్కడు ఎలా పనిని చేయగల్గుచున్నాడో మనము తెలియవలసిన అవసరమున్నది. దేవుడు భూమిమీద శరీరముతో యున్నప్పుడు ఆయన చేయు పనులను గ్రహించగలిగితే ఆయన జన్మను ఆయన చేయు కార్యముల ద్వారా చెప్పు బోధ ద్వారా తెలియవచ్చును. అలా దేవుని జన్మను తెలియగలిగితే, గుర్తించగలిగితే అనుమానము లేకుండా అర్థము చేసుకోగలిగితే అటువంటి వానికి సులభముగా జన్మరాహిత్యమైన మోక్షము లభించును. ఈ విషయమును తెలియజేయు శ్లోకమును భగవద్గీతలో జ్ఞానయోగము అను అధ్యాయమున 9వ శ్లోకమును చూస్తే అర్థమగును.

శ్లో॥ జన్మకర్మచమే దివ్య మేవం యో వేత్తి తత్త్వతః ।
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోర్జున ! ॥

**భావము :- "కొద్దిమాత్రమయినా నా దివ్యములైన కర్మములను, జన్మలను గ్రహించెడువాడు మరణించిన తర్వాత వేరు జన్మకు పోకుండా నేరుగా ముక్తిని పొందును. నా లోనికి చేరిపోవును"** అని చెప్పియున్నారు.

దేవుడు అవతరించినప్పుడు తాను శరీరమును ధరించి పైకి జీవుని వలె కనిపించువాడు, జీవునివలె అందరితో సాధారణముగా మాట్లాడువాడు, అన్ని విధముల పనులు చేయుచూ కనిపించువాడు స్వయముగా పరమాత్మయే అని మనము అర్థము చేసుకోవలసి యుంటుంది. విశ్వమునకంతా పెద్దయినా, ప్రపంచమునకంతా దేవుడయినవాడు శరీరముతో మనిషి మాట్లాడునట్లు మాట్లాడడము ఆశ్చర్యముగా ఉండును. అంతేకాక ఇది నిజమా? యని నమ్మలేని విషయముగా ఉండును. నమ్మినా, నమ్మకపోయినా దేవుడే శరీరములోనుండి మాట్లాడుచున్నాడు. అంతటి గొప్ప దేవునితో స్వయముగా మాట్లాడు అవకాశము, ఆయన మనకు కలుగజేసిన అదృష్టము. అయితే ఆయనతో భయము లేకుండా వ్యంగ్యముగా మాట్లాడువారు కూడా కలరు. ఎదుటి మనిషి ఎవరు? అని గుర్తించలేని వారు ఆయన దేవుడని తెలియకపోయినా ఫరవాలేదుగానీ ఆయనను అగౌరవముగా మాట్లాడి పాపమును మూటగట్టుకొనువారు కూడా కలరు.

**ప్రశ్న :- మీరు రెండు రకముల ధర్మచక్రములను చెప్పారు. మనిషి ధరించునది ఒక రకము. దేవుడు ధరించునది మరొక రకము అని చూపించారు. చిత్రపటముతో సహా ధర్మచక్రములో యున్న తేడాలను వివరించారు. దేవుడు ఇట్లే వస్తాడు, ఇట్లే మాట్లాడుతాడు, ఆయన ధర్మములు ఇవి అని మీరు తెల్పుచూ పోవుచున్నారు. మీరు చెప్పే దానినిబట్టి చూస్తే ఇవి ఎవరికీ తెలియని విషయములు. మీరు సులభముగా లెక్కలు చెప్పినట్లు**

**చెప్పుచున్నారు. మీ మాటలను మేము ఎలా నమ్మాలి? మీరు చెప్పునదంతా సత్యమేయని మేము ఎందుకు అనుకోవాలి? మాకు సమాధానము చెప్పండి?**

**జవాబు :-** మీరు అడుగు ప్రశ్న సమంజసమైనదే! మీరు అడుగవచ్చు. మొదటినుండి ఇటువంటి అనుమానములు ఉండుట వలన దేవుడు మన వద్దకు వచ్చినా గుర్తించలేకపోయామని ఇంతవరకు చెప్పాను. ఇప్పుడు నీకున్న అలవాటు ప్రకారము నీవు అడుగడములో తప్పులేదు గానీ, మీరు ఇంకొక కోణములో కూడా ఆలోచించవచ్చును కదా! ఈ విషయము లన్నియూ మీకు చెప్పడము వలన వినేవారికి మీకు జ్ఞానము కల్గునుగానీ నాకు ఎటువంటి లాభము లేదుకదా! మీరు నమ్మితే లాభము, నమ్మకపోతే నష్టము నాకు కల్గేటట్లయితే నేను నా వ్యాపారము దెబ్బతింటుందేమోనని మీ కోసము ప్రాకులాడి చెప్పవలసి యుంటుంది. మీరు వినేటట్లు చూసుకోవలసి ఉంటుంది. నేను దేవుని సేవ చేయు నిమిత్తము దానిలో భాగముగా చెప్పుచున్నాము. మీకు ఈ విషయములు తెలియబడడము అదృష్టముగా భావించవలయునుగానీ, ప్రశ్నలు వేసే విషయములు కావు. ఇప్పుడు నేను చెప్పకపోతే భవిష్యత్తులో మీకు తెలిసే అవకాశమే లేదు. ఇక్కడకాకపోతే మరెక్కడయినా తెలియును అనుటకు ఇవి సామాన్యమైన విషయములు కావు. నీవు ఒక్కమారు ఆలోచించి చూడు ఇవి ప్రపంచ సంబంధములాంటి విషయములా? ప్రయత్నము చేస్తే తెలిసే విషయములా? ఎవరయినా చెప్పే సాహసము చేయు విషయములా? మీకు అవసరము లేదు అంటే నేను చెప్పేది నిలిపి వేస్తాను.

**ప్రశ్న :- క్షమించండి! మీరన్నట్లు మీరు చెప్పకున్నా మీకు నష్టము ఏమీ లేదు. మేము ప్రశ్న అడగడమే పొరపాటుగా మాకే కనిపిస్తావుంది. మా**

**ప్రశ్న వలన మీకు తెలిసేది తెలియకపోవును. మాకు తెలియకుండానే మాలో కల్గిన ప్రశ్నను దాచుకోవడము మంచిదికాదు కదా!యని అడిగాను.**

**జవాబు :-** మొదటికే ప్రశ్న రాకుండా ఉండవలెను. ఎదుటి వ్యక్తి మీద నమ్మకమున్నప్పుడు ప్రశ్నరాదు. నమ్మకము లేనప్పుడు ప్రశ్న రావడము సహజము. ప్రశ్న వచ్చిన తర్వాత దానిని దాచుకోకూడదు. దాచుకొంటే అది జవాబు లేనిదే ఎప్పటికీ అనుమానమునే ఉంచును. అందువలన వచ్చిన ప్రశ్నను అడిగితే దానికి మేము ఓపికతో జవాబు చెప్పి అనుమానము లేకుండా చేయుదుము. నీకు ఒక ప్రశ్న వచ్చింది అంటే దానిని అనుసరించి ఇంకొక ప్రశ్న కూడా వచ్చియుండును. దానిని నీవు చెప్పలేకపోయినా నేనే చెప్పుచున్నాను. అదేమనగా! దేవునికయితే తన విషయము తనకు తెలియును. ఈయన దేవుడు కాదుకదా! దేవుని జన్మ రహస్యములు ఈయనకు ఎలా తెలియును? ఈయన చెప్పేవన్నీ కట్టుకథలే!యను ప్రశ్న కూడా వచ్చియుండును. అవునా, కాదా ఉన్న సత్యము చెప్పు?

**ప్రశ్న :- అవును! అలాంటి ప్రశ్నే వచ్చినది. వచ్చినది ఆ ప్రశ్నే! అయితే నేను అడగడము కొంచెము వేరుగా అడిగాను. మాకు ఎందుకు అలాంటి ప్రశ్నలు వచ్చాయి?**

**జవాబు :-** మనిషి లోపల గుణముల మధ్యలో జీవుడు చిక్కుకొని ఉండును. శరీర యంత్రాంగము ప్రకారము గుణప్రేరణకు బుద్ధి ప్రశ్నలను రేకెత్తించుచుండును. దానితో వాని గుణములు పని చేయుట మొదలు పెట్టును. గుణముల ప్రభావమును మాయ అనవచ్చును. మాయ మనిషిని దేవునికి దూరముగానయినా చేయును లేకపోతే మనిషిని దేవునికి దగ్గరగా నయినా చేయును. మనిషి శ్రద్ధనుబట్టి, మనిషి దేవున్ని విశ్వసించే

విధానమునుబట్టి, మనిషికున్న జ్ఞానమునుబట్టి మాయ దేవునికి దగ్గరగానయినా లేక దూరముగానయినా పంపును. ఈ విషయమును గురించి భగవద్గీత విజ్ఞాన యోగములో 14వ శ్లోకములో చెప్పారు చూడండి.

శ్లో॥ దైవీహ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా ।
మామేవ యే ప్రపద్యన్తే మాయా మేతాం తరన్తి తే ॥

**భావము :- "దేవుని చేత సృష్టింపబడిన నా మాయను దాటుటకు చాలా దుస్సాధ్యమైన పని. దానిని ఎవరూ దాటలేరు. ఎవడయితే నన్ను ఆరాధించుచున్నాడో వాడు మాత్రము నా మాయను దాటిపోగలడు."**

శరీరములోని మాయ ప్రశ్నించడము సహజమే. ఆ ప్రశ్నలను సవినయముగా అడిగి జవాబును తెలియుట మంచిది. ఈయనకు దేవుని విషయములు ఎలా తెలియును? ఈయన దేవుడు కాదు కదా?యను ప్రశ్న వచ్చినది కదా! దానికి జవాబుగా "ఈయన దేవుడు ఎందుకు కాకూడదు?'' దేవుడేయని సమాధానము చెప్పు, అప్పుడు ఇతర ప్రశ్నలు రావు. ప్రశ్నలు రానప్పుడు చెప్పేదంతా జాగ్రత్తగా వినవచ్చును. నేను దేవున్ని గురించి తెలిసియున్నాను కావున చెప్పాను. మీకు దేవున్ని గురించి తెలియనంత మాత్రమున మిగతా వారికి ఎవరికీ తెలియదు అనుకోవడము పొరపాటు. ద్వితీయ దైవ గ్రంథములో ఏసువద్ద కూడా ఇటువంటి ప్రశ్నే అక్కడి వారికి వచ్చినది. అప్పుడు ఏసు చెప్పిన సమాధానము ఇలా ఉన్నది. ఈ విషయము యోహాన్ సువార్త 8వ అధ్యాయములో 53, 54, 55 చూడండి.

**(యోహాన్-8-53, 54, 55) "నిన్ను నీవు ఎవడని చెప్పు కొంటున్నావని ఆయనను అడిగిరి. అందుకు ఏసు నన్ను నేనే మహిమ పరచుకొనిన ఎడల నా మహిమ వట్టిది. మా దేవుడని**

**మీరు ఎవరిని గూర్చి చెప్పుచుందురో ఆ నాతండ్రియే నన్ను మహిమ పరచుచున్నాడు. మీరు ఆయనను ఎరుగరు. నేను ఆయనను ఎరుగుదును. ఆయనను ఎరుగనని నేను చెప్పిన ఎడల మీవలె నేనునూ అబద్ధికుడనై యుందును గానీ నేను ఆయనను ఎరుగుదును. ఆయన మాటను గైకొనుచున్నాను."**

ఈ వాక్యమును చూచిన తర్వాత ఏసు ఎవరైయుండునో కొంత తెలియవచ్చును. "నన్ను నేను మహిమపరచుకొనను" అని అన్నాడు. "నన్ను నేను ఫలానాయని గొప్పగ చెప్పుకోను. నన్ను నా తండ్రియైన దేవుడే మహిమ పరచుచున్నాడు" అని చెప్పాడు. దీనినిబట్టి ఏసు తనను గురించి తాను చెప్పుకోవడము మంచిది కాదనీ, తనను గురించి దేవుడే ఇతరులకు అర్థమగునట్లు చేయునని చెప్పాడు. అందువలన ఏసు స్వయముగా దేవుడైయుండియు తాను బయటపడనట్లు మాట్లాడినాడు. ఇదంతయూ చూస్తే మనిషియైనవాడు దేవుని రాకను తెలియలేడనీ, వచ్చినవాడు **'నేనే దేవున్ని'** అని చెప్పినా నమ్మే స్థితిలో ఉండడని తెలియుచున్నది. దేవుడు మనిషిగా వచ్చినప్పుడు ఎక్కడా బయటపడడు. అటువంటప్పుడు నీవు దేవుడా? అని అడిగితే **"నేను దేవున్నే"** యని ఎందుకు చెప్పును?

**ప్రశ్న :- మీరు జీవాత్మకు ఆత్మ తండ్రియగుననీ, ఆత్మకు పరమాత్మ తండ్రి యగునని ఇంతకుముందు చెప్పారు. అయితే ఏసు దేవుని అవతారమేనని మీరు గట్టిగ చెప్పుచున్నారు కదా! ఏసు దేవుని అవతారమే అయినప్పుడు ఆయనే దేవున్ని తండ్రియని చెప్పుచున్నాడు కదా! పై వాక్యములలో నా తండ్రియైన దేవుడు నన్ను మహిమపరచును. నన్ను నేను మహిమ**

**పరచుకొనిన యెడల నా మహిమ వట్టిదగును అన్నాడు. ఇక్కడ ఏదీ స్పష్టముగా అర్థము కాలేదు. నా తండ్రియైన దేవుడు అన్నప్పుడు ఈయన దేవుడు కాదుకదా! దేవుడయితే అలా చెప్పడు కదా! దీనికి మీరేమంటారు?**

**జవాబు :-** దేవుడు భూమిమీద అవతరిస్తే మనుషులకు బోధలు చెప్పుటకు, ధర్మములను తెలియజేయుటకు వచ్చును. మనుషులతో సంబంధము పెట్టుకోవాలంటే తాను కూడా మనిషియైనప్పుడే అది సాధ్యమగును. దేవుడు మనిషివలె వచ్చి, మనిషి మాట్లాడు భాషలోనే మాట్లాడి తన జ్ఞానమును తెల్పును. దేవుని జ్ఞానము దేవునికి తప్ప ఇతరులకెవరికీ తెలియదు కావున దేవుడు తన విషయమును చెప్పుటకు తానే రావలసి యున్నది. అలా వచ్చినప్పుడు తాను ఫలానాయని తెలియనివ్వడు. అందువలన ప్రజలకు సులభముగా అర్థము కాకుండుటకు తానే తనను తండ్రియని ఉచ్ఛరించడము వలన ఆయన వేరు ఈయన వేరని ఎవరయినా అనుకోవలసిందే. ప్రయత్నము చేయువారికే దేవుడు తెలియబడును. ప్రయత్నము లేనివారికి తెలియబడడు. అందువలన సులభముగా అర్థము కానట్లు దేవునికి ప్రతినిధిగా వచ్చినవాడు స్వయముగా దేవుడయియుండి, కనిపించని దేవున్ని తండ్రియని చెప్పడము జరుగుచున్నది. శరీరములో ఆత్మవలె పరమాత్మ నటించునని ముందే చెప్పాము. భగవంతుడు భూమిమీదికి వచ్చినప్పుడు ఆయన శరీరములో జీవాత్మ ఆత్మ ఉండదు. అయినా పరమాత్మయే స్వయముగా శరీరములో ఉండి ఆత్మగా ఒకప్పుడు, జీవాత్మగా ఒకప్పుడు మాట్లాడుచుండును. అవసరమునుబట్టి శరీరములోని పరమాత్మ ఆత్మవలె పరమాత్మను తండ్రియని ఉచ్ఛరించుచున్నది. అట్లే శరరీము ధరించి వచ్చిన దేవున్ని గురించి దేవుడే మాట్లాడునప్పుడు పరమాత్మగా మాట్లాడుచూ భగవంతుడు తన కుమారుడని చెప్పుచున్నది.

ఎలా చెప్పినా పరమాత్మ తన అవతారమును కుమారుడు అని చెప్పినా, అవతరించినవాడు తాను దేవుడైయుండి తాను కుమారుడనని దేవుడు (పరమాత్మయే) తండ్రియని చెప్పుచున్నాడు. శరీరముతో పుట్టిన దేవుడు కనిపించక యున్న తననే తండ్రియని చెప్పుచున్నాడు. కనిపించక యున్న దేవుడు కనిపించే శరీరములో యున్న దేవున్ని తన కుమారుడుగా చెప్పుచున్నాడు. ఇద్దరు ఒకటే అయినా ఇంటిలోవాడు, బయటవాడుగా ఒకడే యుండి అది ఎవరికీ గుర్తురానట్లు, జ్ఞానము స్థాయి ఎక్కువ యున్నవారికే తెలియునట్లు అర్థము కాకుండా చెప్పడమైనది. మనిషికి (జీవాత్మకు) శరీరములోని ఆత్మ తండ్రి కాగా, ఆత్మకు పరమాత్మ తండ్రియని చెప్పుట వరుస క్రమము మరియు ఆత్మల క్రమము అలాగే యున్నది. ఇదంతా శరీరములో ఉండే విధానము. శరీరము ధరించిన పరమాత్మ, శరీరము బయట ఉండే పరమాత్మ ఇద్దరు ఒక్కరే. అయితే శరీరములో వుండే దేవుడు శరీరము బయట ఉండే దేవున్ని తండ్రియనగా, శరీరము బయట ఉండే దేవుడు శరీరము ధరించి యున్న దేవున్ని కుమారుడు అని అంటున్నాడు. ఇద్దరు ఒక్కటే అయివుండి తండ్రి కొడుకు వరుస ఎందుకు చెప్పుచున్నారో ఎవరికీ తెలియదు. అలా చెప్పడము వలన అందరూ వారు ఇద్దరు వేరువేరు వారు ఒకరు తండ్రి, ఒకరు కొడుకు అంటున్నారు. తండ్రి కొడుకు ఇద్దరు ఒక్కడేయని నేను తప్ప గ్రంథములు చదివినవారు కూడా చెప్పడము లేదు. అర్థమగుటకు చిన్న ఉదాహరణను చెప్పుకొందాము.

ఒకడు ప్రతి దినము నాటకము చూస్తూ ఉండెను. మరొకడు ఆ నాటకములో ఒక పాత్రలో నటించుచుండెను. నాటకమును చూచేవానికి నాటకములో నటించేవాడు స్నేహితుడు. అయితే నాటకము చూచేవానికి వాని స్నేహితుడు నాటకములో పాత్రధారుడుగా ఉంటాడని తెలియదు.

అతను నాటకములో పాత్రను పోషించుచున్నానని ఎప్పుడూ తన స్నేహితునికి చెప్పలేదు. రెండు మూడుమార్లు నాటకమును చూచిన తర్వాత చూచేవాడు పాత్రధారున్ని చూచి, అచ్చము తన స్నేహతునిలాగే యున్నాడని అనుకొన్నాడు. మరికొన్ని వేరువేరు నాటకములను చూచి వేరువేరు పాత్రలలో నటించిన వాడు తన స్నేహితునికి దగ్గర పోలికలున్నాయని అనుకొన్నాడు. అయితే బయట ఉండే స్నేహితుడు, నాటకములో ఉండే పాత్రధారుడు ఒక్కడేయను విషయము అతనికి తెలియదు. ఒకరోజు స్నేహితునితో కలిసి "నేను నాటకములను చూస్తున్నాను. అందులో ఒక మనిషి ఏ పాత్రధారిగా వేషము వేసినా, అచ్చు గుద్దినట్లు నీలాగే ఉన్నాడు" అని తన స్నేహితునితో చెప్పగా, అతను దానికి సమాధానముగా ఇలా అన్నాడు. "నాటకములోని పాత్రధారుడు నా కుమారుడే. అందువలన నా పోలికలు కనిపిస్తుంటాయి. 15 సంవత్సరముల క్రిందటే అతను ఇల్లు వదలిపోయి నాటకముల కంపెనీలో చేరిపోయాడు. అప్పటినుండి నాటకములలోనే ఉండిపోయాడు" అని చెప్పాడు. తాను ప్రతి నాటకములో అందులోని పాత్రలోనూ నటించుచున్నానని చెప్పలేదు. అతని స్నేహితుడు తన స్నేహితుని కుమారుడే నాటకములలో నటించుచున్నాడని పూర్తిగా అతని మాటలను నమ్మాడు.

ఒక దినము నాటకము చూడను పోయిన అతడు నాటకము యొక్క రంగస్థలము వెనుకకు పోయి వేషములో యున్న తన స్నేహితున్ని పలుకరించి మీ నాన్న నేను స్నేహితులమని చెప్పుకొని "నిన్ననే నేను మీ నాన్నను కలిసి మాట్లాడినప్పుడు, నా కుమారుడు నాటకములో పని చేయుచున్నాడని చెప్పాడు. అందువలన పలకరించే దానికి వచ్చాను" అని అన్నాడు. అప్పుడు వేషములో యున్న అతని స్నేహితుడు చెప్పినది

విని "నాన్నగారు కూడా నిన్ను గురించి చెప్పారు. మీరు నాన్నగారికి మంచి స్నేహితుడట" అని అన్నాడు. అప్పుడు మాట్లాడేవాడు తన స్నేహితుని కుమారుడని నాటకములు చూచేవాడు అనుకొన్నాడు. అయితే బయటనున్న స్నేహితుడే నాటకములో వేషము మీద నున్నాడని, ఇద్దరు ఒక్కటేనని తెలియలేకపోయాడు. నాటకములో ఉండేవాడు నేనే బయట ఉన్నానని చెప్పలేదు. అట్లే బయట ఉన్నవాడు నేనే నాటకములో ఉండేవాడినని చెప్పలేదు. నాటకము చూచేవాడు మాత్రము నాటకములో తన స్నేహితుని కుమారుడున్నాడనీ, నాటకములో ఉన్నవాని తండ్రే బయట తన స్నేహితుడని అనుకొన్నాడు. ఈ రహస్యము నాటకము చూచేవానికి తెలియదు. నాటకము వేసేవాడు బయటగానీ, నాటకములో ఉన్నప్పుడుగానీ తన రహస్యమును చెప్పడు. ఇట్లు ఎంతకాలము గడచినా అతను తండ్రే, ఇతను కొడుకే. చూచేవాడు ఇద్దరికి పరిచయస్తుడే గానీ ఇద్దరు ఒక్కరే అని వానికి తెలియదు.

ఈ నాటకములోని పాత్రలాగ భగవంతుడున్నాడు. అట్లే స్నేహితుడు లాగా దేవుడున్నాడు. నాటకము చూచేవారిలాగ ప్రజలున్నారు. శరీరధారి యైన భగవంతుడు (దేవుడు) శరీరము ధరించకుండా యున్న దేవుడు ఇద్దరూ ఒక్కరేయను విషయము శరీర ధారియైన భగవంతున్ని ఎదురుగా చూచినా గుర్తించలేకపోయారు. ఇది అదేపనిగా దేవుడు ఆడే నాటకము. చూచే జీవునికి నాటకము ఏమిటో? ఆడేవారు ఏమిటో? కనిపించక ఆడించేవారు ఏమిటో? అర్థముకాక పిచ్చిపట్టి వారిని గురించి ఒక్కొక్కడు ఒక్కొక్క రకముగా చెప్పుకొంటున్నారు. ఉన్నది కనిపించే దేవుడు ఒక్కడు, కనిపించని దేవుడు ఒక్కడు ఇరువురున్నట్లుండినా ఉన్నది మాత్రము ఒకే దేవుడే. అదే విషయమే దైవ గ్రంథములలో కూడా చెప్పబడియున్నది.

**ప్రశ్న :- దేవుడు మనుషులకు అబద్ధమును చెప్పి అదే పనిగా మోసము చేసినట్లే కదా! ఇట్లు అడుగుచున్నానని ఏమీ అనుకోవద్దండి. న్యాయ బద్ధముగా చెప్పితే దేవునిది అన్యాయమే అగును కదా! ఆయనను కనుగొనుటకు ఏ ఆధారము లేకుండా చేశాడు కదా! అట్లు నాటకమాడి, మోసము చేసి చివరిలో తిరుగుబ్రాత పెట్టినట్లు నన్ను కనుగొన్న వానికి, నా పనులు తెలిసిన వానికి మోక్షము లభించునని చెప్పాడు. కనుక్కొనే దానికి ఆధారమే లేనప్పుడు ఎలా తెలియనగును? ఇది అన్యాయము కాదా?**

**జవాబు :-** దేవుడు ఎప్పుడూ మోసము చేయలేదు. అట్లే ఎవరికీ అన్యాయమును చేయలేదు. దేవుడు ఎప్పుడో లక్షల సంవత్సరముల కొకమారు శరీరమును ధరించి పుట్టుచున్నాడు. అలా వచ్చినప్పుడు మాత్రమే తనను గుర్తించకుండా తండ్రియని మరొక దేవున్ని చెప్పినట్లు చెప్పుచున్నాడు. దేవుడు కూడా వచ్చినవాడు వేరు అన్నట్లు భగవంతునిగా కనిపించువానిని కుమారుడని చెప్పాడు. భగవంతుని రాకముందు దైవగ్రంథములలో దేవున్ని గురించిన జ్ఞానమును సంపూర్ణముగా చెప్పియున్నారు. అంతవరకు సంపూర్ణముగా చెప్పియున్న జ్ఞానము భగవంతుడు వచ్చినప్పుడు ఎందుకు అర్థము కాలేదు? ఎందుకు జ్ఞాపకము రాలేదు? దేవుడు తన ధర్మములను తెలియజేయుటకు మనిషిగా వస్తానని భగవద్గీతలోనే చెప్పియుండగా అప్పుడు చెప్పినవాడే ఇప్పుడు వచ్చాడని ఎందుకు అనుకోలేదు? ఇదంతా మన అజ్ఞానమే కదా!

నాటకము వేషము విషయమునకు వస్తే స్నేహితుడే పాత్రధారుడనీ, పాత్రధారుడే స్నేహితుడనీ తెలియునట్లు ఆధారములు గలవు. అయితే నాటకమును చూచేవాడు ఆ ఆధారమును ఏమాత్రము ఉపయోగించుకొని

చూడలేదు. ఒక దినము నాటకమును చూచేవాడు ఊరిలోని తన స్నేహితుని ఇంటికి పోయినప్పుడు అక్కడే భోజనము చేయడము జరిగినది. ఇద్దరూ ఒకే బంతిలో, ఒకేమారు భోజనము చేశారు. అప్పుడు చూచేవాని స్నేహితుడు నీళ్ళు త్రాగుచుండగా ఎక్కిళ్ళు వచ్చాయి. అప్పుడు అతను నీళ్ళు త్రాగుటకు కొంత కష్టపడ్డాడు. అప్పుడు "నేను ఎప్పుడు నీళ్ళు త్రాగినా ఎక్కిళ్ళు వస్తాయి. దేశములో ఎవరికీ ఈ రోగము లేదు. నాకు ఒక్కనికే ఈ రోగమున్నదని" నాటకమును చూచే స్నేహితునితో చెప్పాడు. అప్పుడు అతని స్నేహితుడు కూడా తనకు అట్లున్నందుకు సానుభూతిని చూపిపోయాడు. నెలరోజుల తర్వాత సత్యహరిశ్చంద్ర నాటకములో వీరబాహుడు పాత్రను ధరించవలసివచ్చినది. అప్పుడు నాటకము చూచేవాడు కూడా నాటకమునకు పోయాడు. నాటకము జరుగుచుండగా నాటకములో వీరబాహుడు వచ్చి కల్లు త్రాగుచూ కొన్ని మాటలు చెప్పవలసి యున్నది. అప్పుడు వీరబాహుడు వేషములో వచ్చినది తన స్నేహితుడేయని చూచేవానికి ఎటూ తెలియదు. అప్పుడు వీరబాహుడు మజ్జిగను కల్లువలె కనిపించునట్లు చేసి త్రాగుచుండగా నీళ్ళు త్రాగేటప్పుడు ఎక్కిళ్ళు వచ్చినట్లే వేషములో ఉన్నవానికి ఎక్కిళ్ళు వచ్చాయి. అప్పుడు దానిని చూచినవాడు తన స్నేహితునికున్న రోగమే ఆయన కొడుకుకు కూడా ఉన్నదని అనుకొన్నాడుగానీ, అతనే తన స్నేహితుడని అప్పుడు కూడా కనుగొనలేదు. ఉదయము తన స్నేహితుడు నీళ్ళను త్రాగునప్పుడు ఎక్కిళ్ళు రాగా బాధపడుచూ ఈ రోగము నాకు తప్ప భూమిమీద ఎవరికీ లేదు అన్నమాటను స్వయముగా విని కూడా ఈ రోగము నా స్నేహితునికి ఒక్కనికే ఉన్నది కదా!యని వేషధారణలో యున్నవాడే నా స్నేహితుడని అనుకోక అతని కుమారునికి కూడా అదే రోగము ఉన్నదే! అని అనుకొన్నాడు. అతని

కుమారునికి ఉంటే నాకు తప్ప భూమిమీద ఎవరికీ లేదని ఎందుకు చెప్పాడని ఏమాత్రము అనుకోలేదు. తనను గుర్తించుటకు ఎక్కిళ్ళను రెండువైపుల కనిపించునట్లు చేసినా, గుర్తు పట్టకపోవడము చూచేవాని తెలివి తక్కువ యంటావా? నాటకము వేసేవాని మోసము అంటావా?

పొడుపు కథలలో విషయమును దాచిపెట్టి చెప్పినా దానికి సంబంధించిన ఆనవాళ్ళను అన్నిటినీ చెప్పుదురు. అప్పుడు చెప్పిన ఆనవాళ్ళను, గుర్తులను గమనించి పొడుపుకథలో దాచిపెట్టి చెప్పిన దానిని కనుగొనవచ్చును. ఏమి ఆనవాళ్ళు చెప్పకుండా విషయమును దాచిపెట్టి అడిగితే అది మోసము, అన్యాయము అగును. అట్లుకాకుండా గుర్తులన్నీ చెప్పినా కనుగొనలేకపోతే దానిని వినేవాని తెలివితక్కువయని చెప్పవచ్చును. "తల్లి పీచు పీచు, తండ్రి ముత్యాలు" అని మొక్కజొన్న కంకి పేరు చెప్పకుండా దానిపేరు దాచిపెట్టి చెప్పితే దానికి సంబంధించిన ఆనవాళ్ళు తల్లి పీచుపీచు తండ్రి ముత్యాలు అని చెప్పియుండుట చేత తెలివైనవాడు వెంటనే మొక్కజొన్న కంకియని గుర్తించగలడు. తెలివి తక్కువవాడు గుర్తించలేడు. అట్లే దేవుని విషయములు దైవ గ్రంథములలో చెప్పియున్నప్పటికీ, నాటకములో ఎక్కిళ్ళను చూచినప్పటికీ ఏమీ ప్రయోజనము లేకుండా పోయినది. గ్రంథముల జ్ఞానమును బట్టి భగవంతున్ని తెలియలేకపోయారు. అట్లే ఎక్కిళ్ళను చూచి వేషధారున్ని కనుగొనలేనట్లు ఇటు శరీరధారియైన దేవున్నిగానీ, అటు శరీరధారి కానటువంటి దేవున్నిగానీ మనుషులయిన వారు తెలియలేకపోవడము మనుషుల అజ్ఞానమే గానీ దేవుని మోసము కాదు, దేవుడు అన్యాయము చేయలేదు.

దైవగ్రంథములో "నేను నా తండ్రి కలిసేయున్నాము" అని చెప్పినపుడు ఇద్దరు ఒక్కటేయని అర్థము కాదా! ఈ విషయమును ఇంజీలు

గ్రంథములో **(యోహాన్-8-28) "ఏసు మీరు మనుష్య కుమారున్ని పైకి ఎత్తినప్పడు నేనే ఆయన ననియు నాయంతట నేనే ఏమియు చేయక తండ్రి నాకు నేర్పినట్టు ఈ సంగతులు మాట్లాడు చున్నాననియు మీరు గ్రహించెదరు."**

**(యోహాన్-10-30) "నేనును తండ్రియును ఏకమై యున్నామని వారితో చెప్పెను."**

**(యోహాన్-14-10,11) "తండ్రియందు నేనును నాయందు తండ్రియు ఉన్నామని నీవు నమ్ముటలేదా? నేను మీతో చెప్పచున్న మాటలు నాయంతట నేనే చెప్పట లేదు. తండ్రి నాయందు నివశించుచూ తన క్రియలు చేయుచున్నాడు. తండ్రియందు నేనునూ నాయందు తండ్రియు ఉన్నామని నమ్మిడి లేదా ఈ క్రియల నిమిత్తమైనను నన్ను నమ్మిడి."**

ఈ మూడు వాక్యములయందు "పరమాత్మయైన తండ్రి తనయందు ఉన్నాడని" శరీరధారియైన దేవుడు చెప్పాడు. శరీరధారియైన దేవుడు వేరు, పరమాత్మ (పరిశుద్ధాత్మ) అను దేవుడు వేరు అని అనుకోకుండా ఇద్దరు ఒక్కటేయని జరిగే పనులన్నీ ఆయన ఆజ్ఞతో చేసేవేయని శరీరము ధరించిన భగవంతుడు చెప్పుచున్నాడు. ఇట్లు ఎంతో కాలము నుండి చెప్పుచున్నా ఈ మాటలను లెక్కచేయకపోతే దేవుడు ఎప్పుడయినా శరీరధారియై వచ్చినప్పుడు ఆయనను గుర్తించే దానికి వీలుపడదు. కొన్ని వేల సంవత్సరములకో, కొన్ని లక్షల సంవత్సరములకో ఏదో ఒక యుగములో దేవుడు శరీరధారియై వచ్చును. అప్పుడు దేవుడు చెప్పిన జ్ఞానమును తెలియని మనుషులు దేవున్ని గుర్తించుటకు వీలుపడదు.

**ప్రశ్న :- మీరు చెప్పినట్లు ఏసు దేవుని అవతారమే అయితే, మరియు కృష్ణుడు దేవుని అవతారమే అయితే కృష్ణుడు వచ్చిన తర్వాత మూడువేల సంవత్సరములకు ఏసు వచ్చాడు. ఏసు పోతూ ఆదరణకర్త వస్తాడని చెప్పిపోయాడు. ఆయన ఇంతవరకు వచ్చాడో రాలేదో తెలియదు. మీ మాట మీద మాకు నమ్మకము గలదు. ఆదరణకర్త వచ్చాడా, రాలేదా, వచ్చి పోయాడా? ఈ ప్రశ్నలకు జవాబు చెప్పండి. ఇది కష్టతరమైన ప్రశ్నే అయినా మీరు గొప్ప జ్ఞానులు మీ మాటను మేము విశ్వసిస్తాము. మీరు మా మీద దయ దలచి జవాబు చెప్పండి.**

**జవాబు :-** నన్ను ఇరుకున పెట్టే ప్రశ్న అడిగి మీ మీద విశ్వాసమున్నది చెప్పండి అంటే నేను ఎలా చెప్పగలను! మీరు అడిగిన ప్రశ్నకు జవాబు చెప్పు స్థోమత నావద్ద కలదని నాకు నమ్మకము లేదు. మీరు అడిగారు గావున నేను చెప్పుతాను. మీ నమ్మకమును వమ్ము చేయక చెప్పుతాను కానీ నేను చెప్పునది సత్యము కావచ్చు, అసత్యము కావచ్చును. ఆదరణ కర్త ఇంతకుముందు రాలేదు. తర్వాత కూడా రాబోడు. నాకు తెలిసినది ఇది. ఏసు ఏమో వస్తాడని చెప్పాడు. నేను చెప్పునది ఇంతకుముందు రాలేదు తర్వాత కాలములో కూడా రాడు. దీనిప్రకారము ఏసు చెప్పిన మాటకు నా మాటకు ఎంతో తేడా యున్నది. ఏసు దేవుడు కావున ఆయన మాటనే నమ్మండి. నా మాటను నమ్మవద్దండి.

**ప్రశ్న :- మీరు సత్యముగా దేనిని చెప్పగలరు?**

**జవాబు :-** నేను చెప్పేవన్నీ సత్యములేయని చెప్పగలను. ఎవరికి వారు తాము చెప్పునది సత్యమనియే చెప్పుచుందురు.

**ప్రశ్న :- దేవుని విషయములో సత్యమును చెప్పగలరా?**

**జవాబు :-** పై ప్రశ్నలకు నేను చెప్పునవన్నీ సత్యమేయని చెప్పాను కదా!

**ప్రశ్న :- మేము సూటిగా ఒక ప్రశ్నను అడుగుతాము. మీరు ఖచ్చితమైన జవాబు చెప్పండి. మీరు గొప్ప జ్ఞానియని మేము అనుకొంటున్నాము. వాస్తవముగా మిమ్ములను మించిన జ్ఞాని ఉన్నాడా?**

**జవాబు :-** మీరు నన్ను జ్ఞాని అనినా, గొప్ప జ్ఞాని అనినా మీరు అనుట వలన నేను ఒప్పుకోను. ఒకవేళ నేను జ్ఞానిని అని చెప్పినా ఇతరులు ఒప్పుకోరు. వాస్తవముగా చెప్పాలంటే నేను యోగిని, యోగీశ్వరుడనని పేరు పెట్టుకొన్నాను. ఈ రోజు మీరు నన్ను జ్ఞానిని అంటే ఎలా ఒప్పుకోను. నేను యోగిని అని మాత్రము ఒప్పుకోగలను.

**ప్రశ్న :- మీరు దేవున్ని నమ్ముతారా?**

**జవాబు :-** నేను దేవున్ని నమ్మను. దేవుని జ్ఞానమును నమ్ముతాను.

**ప్రశ్న :- మీరు ఎవరిని నమ్ముతారు?**

**జవాబు :-** ఎవరినీ నమ్మను. నమ్మవలసిన అవసరము మీకేగానీ నాకు లేదు.

**ప్రశ్న :- మీరు దేవున్ని నమ్మనని చెప్పుచున్నారు. మంచిదే అయితే దేవున్ని గురించి, దేవుని జ్ఞానమును గురించి మీరు గ్రంథములు వ్రాశారు. ఇప్పటికి దాదాపు 85 గ్రంథములను అచ్చు వేయించారు. దేవున్ని నమ్మనప్పుడు మీరు గ్రంథములను ఎందుకు వ్రాస్తున్నారు?**

**జవాబు :-** మీకు దేవుని జ్ఞానము గురించి, దేవున్ని గురించి తెలియాలని వ్రాయుచున్నాము.

**ప్రశ్న :- మీరు దేవున్ని నమ్మరు కదా! అలాంటప్పుడు దేవుని జ్ఞానము ఎలా వ్రాయగలరు?**

**జవాబు :-** నేను దేవున్ని నమ్మని మాట వాస్తవమే! అయితే నాకు జ్ఞానము తెలియదని చెప్పానా? లేదుకదా! నాకు దేవుని జ్ఞానము తెలుసును. కావున మీరు కూడా తెలియుటకు గ్రంథములను వ్రాశాను. అందులో తప్పు లేదు కదా!

**ప్రశ్న :- మీరు మాకు అర్థము కాకుండా మాట్లాడుచున్నారు. మిమ్ములను మేము ఏమనుకోవాలి? జ్ఞాని అని అనుకోవాలా? అజ్ఞాని అని అనుకోవాలా? మీరే చెప్పండి.**

**జవాబు :-** నేను ముందే చెప్పాను. నేను జ్ఞానిని కాను, అజ్ఞానిని కాను. నేను యోగిని మాత్రమే.

**ప్రశ్న :- ఇంతకీ మీరు మాకు ఏమి చెప్పదలచుకొన్నారు?**

**జవాబు :-** మూడు దైవగ్రంథములను మీ దగ్గర పెట్టుకొని మూడిటిని గౌరవ భావముతో చదువమని చెప్పుచున్నాను. మూడు దైవగ్రంథములు కలిస్తే సింహపు అవయవములన్నియూ ఒకచోట కలిపి సజీవమైన సింహ మగును. గ్రంథరూపములో యున్న సింహము మాయను, అధర్మములను లేకుండా చేయగలదు. ఏ మతస్థుడయినా గానీ మూడు దైవ గ్రంథములను గౌరవ భావముతో చదివినప్పుడు మూడు గ్రంథముల జ్ఞానము అర్థమగును. అప్పుడు నీవు నీ మతములో ఉన్నట్లు లెక్కించబడును. మూడు గ్రంథముల సారమైన జ్ఞానము తెలియకపోతే వాడు ఏ ధర్మములో లేనట్లుయగును. ఈ విషయము అంతిమ దైవగ్రంథము ఖుర్ఆన్‌లో సూరా 5, ఆయత్ 68లో చెప్పబడియున్నది చూడండి.

**(5-68) "ఓ గ్రంథవాహకులారా! మీరు తౌరాతును (భగవద్గీతను) ఇంజీలును (బైబిలు గ్రంథమును), మీ దేవుని తరపున మీ వద్దకు**

**వచ్చిన ఖుర్‌ఆన్ గ్రంథమును మీ జీవితములలో నెలకొల్పు వరకు మీరు ఏ ధర్మముపైనా లేనట్లే."**

ఈ వాక్యమును ఇంతకుముందు కూడా చెప్పియున్నాము. ఒకే దేవుని జ్ఞానము మూడు ముక్కలుగా మారిపోయి, మూడు గ్రంథములుగా కనిపిస్తున్నది. మూడు గ్రంథములను అసూయ లేకుండా గౌరవ భావముతో చదువగలిగితే అప్పుడు మనిషి జీవితమునకు సార్థకత ఏర్పడును. అప్పుడు వానికి ధర్మములు అర్థమగును. ధర్మములలో వాడు ఉన్నట్లగును.

**ప్రశ్న :- మీరు ఇంతకుముందు గ్రంథములో ఆదరణకర్త వచ్చి మూడు మతములను ఏకము చేస్తాడు అని చెప్పారు. తర్వాత ఆదరణకర్త ఇంతవరకు రాలేదు, తర్వాత కాలములో కూడా రాడు అని చెప్పారు కదా! మీరు అక్కడ వస్తాడని చెప్పారు, ఇక్కడ రాడని రెండు విధముల చెప్పారు. మీ మాటలలో ఏది నిజము?**

**జవాబు :-** మీకు అర్థముకాక నన్ను రెండు విధముల మాట్లాడుచున్నాడని అంటున్నారు. మీరు అడిగిన ప్రశ్నకు ఆదరణకర్త ఇంతకుముందు రాలేదనీ, తర్వాత రాడని చెప్పాను. భూతకాలములో రాలేదు, భవిష్యత్తులో రాడు. వర్తమానములో వచ్చియుండవచ్చును అని అర్థము కాదా! ప్రస్తుత కాలములో ఆదరణకర్త లేడని నేను చెప్పలేదు కదా! ఇప్పుడు వచ్చియున్నాడు కావున భవిష్యత్తులో ఇక రాడు. జరిగిపోయిన కాలములో రాలేదని చెప్పాను. మీకు గ్రహించుకొను శక్తిలేక నేను సరిగా లేనంటే ఎలాగ? ఆదరణకర్త చెప్పినా నేను చెప్పేదే చెప్పును. మూడు మత గ్రంథములను మూడు దైవ గ్రంథములను పేరుతో చెప్పండి. వాటిని ఎప్పుడుగానీ మత గ్రంథములను పేరుతో పిలువవద్దండి. అలా మూడు గ్రంథములను గౌరవించినప్పుడు నీవు దేవుని దృష్టిలో పడుదువు. అంతవరకు నీవు ఎన్ని ప్రార్థనలు చేసినా ఎంత విశ్వాసిగా చెప్పుకొనినా నీవు దేవుని దృష్టిలో ఉండవు.

**ప్రశ్న :- మీరు ఏ మతములో పుట్టారు?**

**జవాబు :-** హిందూమతములో (ఇందూ మతములో)

**ప్రశ్న :- హిందూ మతములో పుట్టావు కావున నిన్ను హిందువు అని అంటారు. అప్పుడు నీకు ఒక మతమున్నట్లే కదా!**

**జవాబు :-** నన్ను హిందువు అని అంటారు. నేను హిందువునని చెప్పలేదు. నేను హిందువునని చెప్పుటకు ఏ ఆధారము లేదు. అప్పుడు నేను హిందువునని ఎలా చెప్పాలి? మనుషులకు మతము ఉంటుందిగానీ యోగి అయిన వానికి మతము ఉండదు. నేను యోగిని నాకు మతము ఉండదు.

**ప్రశ్న :- మీరు ఏ కులములో పుట్టారు?**

**జవాబు :-** కమ్మ కులములో పుట్టాము. అయితే నేను యోగీశ్వరున్ని కావున నాకు కులమతములుండవు.

**ప్రశ్న :- నీవు దేవున్ని చూచావా?**

**జవాబు :-** చూడలేదు. చూడవలసిన అవసరము నాకు లేదు.

**ప్రశ్న :- నీవు కష్టసుఖములను అనుభవించుచున్నావు కదా! అనుభవించేటప్పుడు ఏమనిపిస్తుంది?**

**జవాబు :-** ఇంకొకమారు పుట్టకూడదు అని అనుకుంటాను.

**ప్రశ్న :- మూడు దైవ గ్రంథములను చూస్తే మీకు ఏమనిపిస్తుంది?**

**జవాబు :-** ఆడవారి వెంట్రుకలను తల వెనుక భాగములో మూడు భాగములుగా చేసి ఒకదాని మీద ఒకటి పెట్టి అల్లితే జడయగును. అట్లే నార పీచులను కొన్నిటిని ఒక భాగముగా పురిపెట్టి మూడు నారకట్టలను కలిపి పేడుతూ వస్తే తాడుయగును. మూడు భాగముల వెంట్రుకలను అల్లితే జడ, మూడు భాగములుగానున్న నారను కలిపి పేడితే బలమైన

తాడు తయారగును. అట్లే మూడు దైవగ్రంథముల జ్ఞానమును కలిపితే కర్మల పాలిట సింహమగును. మూడు గ్రంథముల జ్ఞానము సింహములాగా ఉండగా, అజ్ఞానము, అధర్మములు జింకలవలె అగును. ఇప్పుడు మూడు గ్రంథములుగా విడిపోయి ఉండుట వలన ముక్కలయిన సింహములాగ ఉండును. మూడు గ్రంథముల జ్ఞానము కలిస్తే **జ్ఞానసింహము** బయలు దేరును. మూడు గ్రంథముల జ్ఞానమును పురిపెట్టితే సింహమువలె మారిపోవును. కర్మలను జింకలను వేటాడును.

**ప్రశ్న :- మీకు అత్యంత ఇష్టమైనది ఏది?**

**జవాబు :-** దైవజ్ఞానము. బోధించు విధానము.

**ప్రశ్న :- భగవద్గీతలో నీకు అత్యంత ఇష్టమైన శ్లోకము ఏది?**

**జవాబు :-** మోక్ష సన్న్యాస యోగము అను అధ్యాయములో 66వ శ్లోకము. **"సర్వధర్మాన్ పరిత్యజ్య"** అను శ్లోకము ఇష్టమైనది.

**ప్రశ్న :- బైబిలు గ్రంథములో మీకు ఇష్టమైన వాక్యము ఏది?**

**జవాబు :- (యోహాన్ 10-30) "నేనును తండ్రియును ఏకమైయున్నామని వారితో చెప్పెను."** అను వాక్యము అత్యంత ఇష్టమైనది యని చెప్పుచున్నాను.

**ప్రశ్న :- అంతిమ దైవగ్రంథము ఖుర్‌ఆన్‌లో మీకు అత్యంత ఇష్టమైన ఆయత్ ఏది?**

**జవాబు :-** 112వ సూరా అల్ ఇఖ్లాస్‌లో మొత్తము నాలుగు ఆయత్‌లు ఉన్నాయి. ఆ నాలుగు ఆయత్‌లు నాకు ఇష్టమైనవి.

**ప్రశ్న :- వేమన యోగి పద్యములలో ఏ పద్యము మీ కిష్టమైనది?**

**జవాబు :- "పతియొప్పిన సతియొప్పును"** అను పద్యము నాకు చాలా ఇష్టమైనది.

**ప్రశ్న :- మీరు గ్రంథాలను వ్రాస్తున్నారు. ఒక సంవత్సరములోపు వంద (100) గ్రంథములు పూర్తి అవుతుందని చెప్పారు. ఇప్పటికే అచ్చు అయినవి 85 ఉన్నవి. మీ గ్రంథములలో ఒక ప్రత్యేకత ఉందని కొందరు ప్రత్యక్ష సాక్షులు చెప్పుచున్నారు. ప్రపంచములో ఇంతవరకు జరుగని గొప్ప చర్య మీ గ్రంథముల వద్ద జరుగుచున్నదని విన్నాము. అది ఎలా సాధ్యమవు చున్నది. మీ గ్రంథాలకు కర్మను హరించు శక్తి ఎలా వచ్చినది?**

**జవాబు :-** కొన్ని చెప్పే విషయములుంటాయి, కొన్ని చెప్పని విషయములు ఉంటాయి. ఎవనివి వాడు గొప్పగా చెప్పుకోకూడదు. అట్లు చెప్పుకొంటే అవన్నియూ వట్టివగును. ఒకటి మాత్రము సత్యము. నా గ్రంథములు ఏవి అయినా అందులో కొంత శక్తి ఉండును. ఏ గ్రంథమయినా నీ శరీర బలముకంటే ఎక్కువ బలము కల్గియుంటుందని మీరే తెలియగలరు. ప్రతి గ్రంథములోనూ ఒక దేవుని పాలకుడు చేరియుండును. అతను నా గ్రంథములను విశ్వసించిన వారి కర్మలను కొద్దికొద్దిగా దహించి వేయు చుండును. ఒక్కమారుగా కర్మపోదు గానీ, అంటుకొన్నది ఏదయినా కొద్దికొద్దిగా కాలుతూ వచ్చినట్లు కర్మలు కాలిపోవుచుండును. నా గ్రంథములలో గ్రహములు మరియు భూతములు ఏదో ఒకటి చేరియుండు నని చెప్పుచున్నాము. నా ఆజ్ఞ ప్రకారము ఏదీ కాదుగానీ, దేవుని ఆజ్ఞ ప్రకారము అన్నీ జరుగుచుండును. నేను వ్రాసిన గ్రంథములన్నీ నేను వ్రాసినవి కావు. నేను ముందునుండి అదే విషయమునే చెప్పుచున్నాను. నేను సామాన్య మనిషినే అయితే సర్వమునకు అధికారి, దేవుడు అయినవాడే నిజమైన గ్రంథకర్త. పైకి నేను వ్రాసినట్లు కనిపించినా వ్రాసిన వాడు కనిపించని దేవుడే. నేను పైకి కనిపించు బొమ్మలాంటి వాడిని మాత్రమే. వాస్తవముగా చెప్పితే ప్రపంచములో ఎవరూ వ్రాయలేని, ఎవరికీ తెలియని రహస్యములు గ్రంథములలో గలవు. అలా వ్రాయడమ

మనుషులయిన మనకు చెల్లదు. స్వయముగా దేవుడు వ్రాసిన గ్రంథములుగా నేను తలచుచున్నాను. ఆయనే ప్రజలకు జ్ఞానము తెలుపు నిమిత్తము నా ద్వారా వ్రాశాడని చెప్పుచున్నాను. ప్రపంచమునకు అధికారియైన దేవుడు వ్రాసిన గ్రంథములను మహిమపరచుటకై ఆ గ్రంథములలో గ్రహములు, భూతములు చేరియుండి దేవున్ని నమ్మిన వారి శరీరములకు అంటుకొని వారిలోయుండు కర్మలను కాల్చుచున్నారు. గ్రంథములు కొందరి శరీరములకు అంటుకొని యున్న దృశ్యములను తర్వాత పేజీలలో చూడవచ్చును. నా ద్వారా వ్రాయబడిన గ్రంథములకు అంతశక్తి రావడము గ్రహాలు, భూతాలు గ్రంథములలో చేరియుండడము వలన నన్ను కూడా కొందరు గౌరవ భావముతో చూస్తున్నారు. గ్రంథములను చదువలేనివారు, చదువు రానివారు, జ్ఞానమును తెలియు గ్రాహితశక్తి లేనివారు తమ విశ్వాసమును గ్రంథముల మీద పెట్టుకోగా, అవి వారి కర్మలను తగ్గించుటకు ప్రయత్నించుచున్నవి. ఇది ప్రపంచములో ఇంతవరకు జరుగని ప్రక్రియయని సగర్వముగా చెప్పుచున్నాము. గ్రంథాలను చదివి అందులోని జ్ఞానమును తెలియగల్గితే వారి కర్మలు ఇంకా వేగముగా పోవునని తెలుపుచున్నాను.

ఈ గ్రంథాలను ప్రచారము చేసి ఇతరులు జ్ఞానము తెలియుటకు అవకాశము కల్గించిన వారికి, భగవద్గీత భక్తి యోగము అను అధ్యాయము నందు 10వ శ్లోకములో చెప్పిన ఫలితము లభించును. వారు నిజముగా దేవుని సేవ చేసిన వారగుదురు.

# సమాప్తము

**అసత్యమును వేయిమంది చెప్పినా, అది సత్యము కాదు,**
**సత్యమును వేయిమంది కాదనినా, అది అసత్యము కాదు.**

# ధర్మచక్రము




దేవుడు ధరించిన ధర్మచక్రము


Author :

The Only GURU of Three Religions

The Spiritual Emperor, Thraitha Theorem Originator

Sri Acharya Prabodhananda Yogeeshwarulu



www.thraithashakam.org